# అపరాధ పరిశోధన

రు. 7.50 | జులై '88

సప్లిమెంట్

175



# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వీలునామా

రచన: వసుంధర

## అద్దం తిరగని కథ

రచన: వి. యస్. రావ్

## వైరరిజం

రచన: బొమ్మిడి అచ్చారావు

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —175
జూలై, 1984
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్ రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1.

# వీలునామా

## వసుంధర

అతడు సైకిలు దిగి స్టాండు వేసి తాళంకూడా వేసి ఎదురుగా ఉన్న మెడికల్ షాపులోకి వెళ్ళి—"అల్ట్రామైసిన్ టాబ్లెట్సు కావాలి" అన్నాడు.

దుకాణంవాడు ఆశ్చర్యంగా—"దేనికి?" అన్నాడు.

"తలనొప్పికి" అన్నాడతడు.

"డాక్టర్ ప్రిస్క్రిప్షన్ ఉందా?"

"ఆస్ప్రో, అనాసిన్, సారిడన్‌లకు డాక్టర్ సర్టిఫికెట్సు అవసరముండదు. అలాగే అల్ట్రామైసిన్‌కి కూడా."

దుకాణంవాడు నెమ్మదిగా-"మీరడుగుతున్నది అల్ట్రామైసిన్-బీ2 గురించేకదూ" అన్నాడు.

"అవును".

"ఆ టాబ్లెట్సు గురించి మీరు చెప్పింది నెలరోజుల క్రితంవరకూ నిజం. ఇప్పుడు వాటిని డాక్టర్ ప్రిస్క్రిప్షన్ మీద తప్ప అమ్మడంలేదు"

"ఎందుకని?"

"కారణం తెలియదు. కంపెనీనుంచి స్ట్రిక్ట్ ఇన్‌స్ట్రక్షన్స్ వచ్చాయి"

"చాలా ఆశ్చర్యంగా ఉంది" అన్నాడతడు.

"డాక్టర్స్ ప్రిస్క్రిప్షన్ గురించిన ఇబ్బందివల్ల ఇప్పుడెవరూ తలనొప్పికి ఆల్ట్రామెసిన్ వాడడంలేదు. మీకు మరో కొత్తమందు సూచించేదా?"

అతడు నిట్టూర్చి—"మా అమ్మకు పదేళ్ళనుంచి రోజూ తలనొప్పి వస్తోంది. ఎన్నిమందులు వాడినా ప్రయోజనం లేకపోయింది. ఏణ్ణర్థంనుంచి ఆల్ట్రామెసిన్ వాడుతోంది. ఒకరోజు పూటకొకటి చొప్పున మూడు టాబ్లెట్సు వేసుకుంటుందంటే చాలు - వారంరోజులపాటు ఏ బాధా ఉండదు. రెండునెలలుగా నేనీ ఊళ్ళోలేను. నెల్లాళ్ళనుంచి అమ్మకు మందులేదు".

"డాక్టరుచేత ప్రిస్క్రిప్షన్ వ్రాయించుకు రండి."

"డాక్టరుకు తెలుసు. అమ్మకీమందు తప్ప పనిచేయదని! అయినా ఆయన ప్రిస్క్రిప్షన్ ఇవ్వడంలేదు."

దుకాణంవాడు నిట్టూర్చి—"త్వరలోనే ఆల్ట్రామెసిన్ బీకాని మార్కెట్ నుంచి ఉపసంహరించుకుంటారని విన్నాను" అన్నాడు.

"ఎందుకని? మందు చాలా పాపులరయిందిగా?"

"కారణం తెలియదు"

అతడు స్వరం తగ్గించి—"ప్లీజ్ - ఎలాగైనా మీరా టాబ్లెట్సు నాకివ్వాలి. నేను మా అమ్మ బాధ చూడలేకపోతున్నాను" అన్నాడు.

"ఎలాగూ మందు బజార్లోంచి విత్‌డ్రా అయిపోతుంది. దీనికి ఏదో ఆల్టర్నేటివ్ చూసుకోవడం ఇప్పట్నించీ మీకూ మంచిది."

"అది సరే - ప్రస్తుతం అమ్మకు అర్జెంట్ రిలీఫ్ రావాలి."

"సారీ - నేను రిస్కు తీసుకోలేను"

"ప్లీజ్ - ఎక్కువ డబ్బిస్తాను."

దుకాణంవాడు ముసుగ్గా అతడివంక చూసి — "ఎంతెక్కువిస్తారు?" అన్నాడు.

ఆల్ట్రామైసిన్ టాబ్లెట్ ఇరవై అయిదు పైసలు. అతడి క్కావలసిన టాబ్లెట్లు పన్నెండు. పన్నెండింటికీ మొత్తం మూడురూపాయ లవుతుంది. అతడు మొదట ఆరు రూపాయలన్నాడు. తర్వాత పది అన్నాడు.

"ఇందులో నాకు చాలా రిస్కుంది. ఒకోసారి దుకాణం లైసెన్సు రద్దయిపోతుం దిలాంటిపనులు చేయడం వల్ల ...." అన్నాడతడు.

"కానీ పదిరూపాయలే చాలా ఎక్కువ."

"కాదు. యాభైరూపాయ లిస్తారా?"

"యాభైరూపాయలే " అతడు నోరావలించాడు.

"అసలు వందడుగుదా మనుకున్నాను. కానీ మీ ముఖం చూస్తే జాలేసింది. తల్లి ఆరోగ్యంకోసం కలవర పడుతున్న వారి నెక్కువ బాధ పెట్టకూడదనిపించింది. అందుకే సగానికి సగం కన్సెషన్"

"యాభైరూపాయలిస్తే—మీ రిస్కెలా పోతుంది?"

దుకాణంవాడు నవ్వి ఊరుకున్నాడు.

"ఆ మందిప్పటికే అన్ని దుకాణాల్లోనూ విత్ డ్రా అయిపోయింది. మీదగ్గిర తప్ప ఇంకెక్కడా లేదు. అందుకే మీరు అవకాశం వినియోగించుకుని లాభం చేసు కోవాలనుకుంటున్నారు. ఇది చాలా దారుణం".

"కంపెనీ విత్ డ్రా చేస్తున్న మందును కొనాలను

కొనడం దారుణం. నాది దారుణ మెందుకవుతుంది?"

"ప్రాణాలనుకొనడం దారుణం కాదు. కంపెనీ చేస్తున్నదే దారుణం. మందు బాగా పాపులరయింది. ఎంతో మంది ఆ మందుమీద ఆధారపడ్డారు. ఇప్పుడు కంపెనీ ఆ మందు విత్‌డ్రా చేస్తుంది. ప్రజల్లో కలకలం పుడుతుంది. కంపెనీ అప్పుడు కొత్త అల్ట్రామైసిన్ మైక్రోఫైన్ — అంటూ అదేమందును స్వల్పమార్పులతో ప్రజలమీదకు వదుల్తుంది. ధర పెరుగుతుంది...."

దుకాణంవాడు నవ్వి — "మీకూ చాలా తెలుసు. త్వరలోనే కొత్త అల్ట్రామైసిన్ మైక్రోఫైన్డ్ వస్తోంది. అంతవరకూ వేచి ఉండండి. మీకు యాభై రూపాయలు సేవ్ అవుతాయి...." అన్నాడు.

"నాకు సేవింగ్సు ముఖ్యంకాదు. అమ్మ ఆరోగ్యం ముఖ్యం."

"లక్కీగా వేరే కష్టమర్సు లేరు. లేకుంటే వాళ్ళందర్నీ నిలబెట్టాల్సి వచ్చేది...." అన్నాడు దుకాణంవాడు చిరాగ్గా.

"ఒక్క విషయం. నేను యాభై రూపాయలిస్తే మీ ఇబ్బందెలా తొలగిపోతుందో తెలుసుకోవాలనుంది."

"లంచ మివ్వాలి. ఒకోసారి మీ రిచ్చిన యాభై రూపాయలకీ ఏకందో లంచ మివ్వాల్సివుంటుంది. మీకేం తెలుసు మా బాధలు!"

అతడు నవ్వి — "చెప్పుకుందుకే మీ బాధలు. నిజానికి బాధపడేది మేమే! మీరు షాపులో దొంగతనం జరిగిందని పోలీసు కంప్లయింటిచ్చి కొన్ని మందులు పోయినట్లు చెప్పి దాచేస్తారు-వాటిని బ్లాకులో అమ్మేస్తారు. నాకు మందులషాపుల గురించి బాగా తెలుసు" అన్నాడు.

దుకాణంవాడు చిరాగ్గా—"నిజంగానే మీకు చాలా తెలుసు. కానీ మీ వాదెడ్డి సుందుల ధరను తగ్గించదు. నాకు మీతో కబుర్లు చెబుతూ కూర్చునే వ్యవధి లేదు. కావాలంటే యాభైరూపాయలూ ఇచ్చి టాబ్లెట్సు తీసుకోండి. లేకపోతే ఇక వెళ్ళండి" అన్నాడు.

అతడు జేబులోంచి యాభైరూపాయల నోటు తీసిచ్చి "అవసరంనాది. తప్పుతుందా?" అన్నాడు.

దుకాణంవాడు నోటు తీసుకొని తృప్తిగా తలాడించి-"ఈపని ముందే చేయాల్సింది నాకు శ్రమ తప్పేది. మీకు బిల్లు కావాలా?" అన్నాడు.

"ఇస్తానంటే బిల్లు కావాలి"

"బిల్లు అల్ట్రామైసిన్‌కు కాకుండా డాక్టర్ ప్రిస్క్రిప్షన్ అవసరంలేని మరే టానిక్కైనా ఇవ్వగలను"

"అప్పుడా టానిక్‌ని కంపెనీ విత్‌డ్రా చేస్తే బ్లాకులో అమ్ముతుందుకు నాబిల్లు పనికొస్తుంది. అవునా?"

"అవన్నీ మీకనవసరం. బిల్లుకావాలంటే చెప్పండి."

"అవసరంలేదు...."

అతడికి టాబ్లెట్సందాయి. మెరిసే మెటాలిక్ షీట్‌లో ఉన్న ఆ టాబ్లెట్సు నతడు మడతపెట్టి జేబులో వేసుకుని సైకిలువద్దకు వెళ్ళి - పాంటుజేబునుంచి తాళం తీయబోగా ఓకాగితం కింద పడింది.

అతడు చప్పున వంగి ఆకాగితం తీసి మడత విప్పాడు.

"ఇన్‌ఫ్రాసారిన్ వాడే పేషంట్సుకు అల్ట్రామైసిన్ వాడకూడదు. అందువల్ల మృత్యువు సంభవిస్తుంది. ఇటీవల ఆవిధంగా మూడు ప్రపంచనగరాల్లో నాలుగు మరణాలు సంభవించాయి. ఇన్‌ఫ్రాసాలిన్ డాక్టర్ అనుమతిలేనిదే లభించని కారణంగా ఇప్పుడు అల్ట్రామైసిన్

కూడా అటువంటి అంతస్థులకు గురిచేయబడవచ్చునని అభిజ్ఞుల అభిప్రాయం."

మడతపెట్టిన చిన్న న్యూస్ పేపరు కటింగది. వార్త సుమారు సంవత్సరం క్రితంది. వార్త విదేశాలకు సంబంధించినది.

అతడు తిరిగి దాన్ని మడతపెట్టి జేబులోకి తోసేసి సైకిలు తాళం తీశాడు.

## 2

"చంద్రశేఖర్ ఇంకా రాలేదా?" అంది శ్రీవల్లి.

"వస్తాడమ్మా—అబ్బాయి మిమ్మల్ని చూడకుండా ఒక్కరోజు కూడా ఉండలేడుగదా" అంది వంటమనిషి సీతమ్మ.

"అనాధ్నుణి చేరదీసి మనిషిని చేశావు. వాడికి నువ్వు తప్ప వేరే గతి ఏముంది?" అన్నాడు సుబ్బారాయుడు.

"అయినా—మనిషికంత అహంకారం కూడదు. అన్నీ ఉన్న నువ్వే అణిగి మణిగి ఉంటుంటే—ఏముందని వాడికంత గర్వం?" అంది సుబ్బారాయుడి భార్య కనకమహాలక్ష్మి.

శ్రీవల్లి అందరి మాటలూ విని నిట్టూర్చింది.

ఆమె వయసు యాభై అయిదు. అయిదేళ్ళ క్రితం భర్త పోయాడు. పదేళ్ళక్రితం ఆమె ఒక్కగానొక్క కొడుకు అమెరికా వెళ్ళి క్రమేణా అక్కడే స్థిరపడి పోయాడు. ఏడేళ్ళక్రితం అతడిండియాకు వచ్చి తలిదండ్రులు స్థిరపరచిన సంబంధం చేసుకున్నాడు. శ్రీవల్లి కోడలు పేరు విశాలాక్షి. ఆమె సంప్రదాయ కుటుంబంలో పుట్టి పెరిగింది. అందువల్ల కోడలు కొడుకుని

ఇండియాకు తీసుకు రాగలదని శ్రీవల్లి ఆశించింది. కానీ విశాలాక్షికి ఇండియాకంటే అమెరికాయే ఎక్కువనచ్చడం వల్ల ఆమె భర్తను మరింత బలంగా అమెరికాకు కట్టి పారేసింది.

ఇప్పుడు శ్రీవల్లికి భర్త వదిలిన ఆస్తి, కొడుకు అమెరికా నుంచి పంపే డబ్బు మాత్రం ఉన్నాయి. లేక భర్త, ఉండి కొడుకు—ఆమెను ఒంటరిని చేశారు. ఒంటరితనాన్ని భరించలేక ఆమె బంధువుల్ని చేరదీస్తోంది. కానీ అందరికీ ఆమె ఆస్తిమీద నే ఆశ. వారి కబుర్లలో, చేతలలో, ముఖభావాల్లో అది స్పష్టంగా కనిపించి శ్రీవల్లి ఆత్మీయులకోసం అన్వేషణలో ఉంది.

శ్రీవల్లికి ఆత్మీయుడు చంద్రశేఖర్. శ్రీవల్లి కొడుకు ఏడెనిమిదేళ్ళ వయసు వాడైనప్పుడు ఆమెకు యాక్సిడెంటై మరి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయాల్సి వచ్చింది. మరో బిడ్డకోసం ఆమె పరితపించి పోతున్న సమయంలో ఎవరో ఆమె యింటిముందు రోజుల పసిగుడ్డును వదిలి వెళ్లారు. మనశ్శాంతికై ఆ పసిగుడ్డును కన్నబిడ్డలా పెంచుకోమని భర్త ఆమెకు సలహా యిచ్చారు. కులం, గోత్రం తెలియని ఆ పసిగుడ్డును పెంచుకునేందుకు శ్రీవల్లి తటపటాయించింది. భర్త ఆమెను ప్రోత్సహించి "నీవు పెంచితే ఈక్షణంనుంచే వీడిది మన కులమూ, గోత్రమూ—" అన్నాడు.

ఆ పసిగుడ్డుకు చంద్రశేఖర్ అని నామకరణం చేసింది శ్రీవల్లి. వాడిని పెంచడంతో ఆమె కొంత మనశ్శాంతిని పొందింది. అయితే వాణ్ని కన్నబిడ్డతో సమంగా పెంచలేకపోయింది. అందుకు ముఖ్య కారణాలు రెండు.

ఒక అనాథబాలుడికి తన కొడుకుతో సమాన హోదా

యిస్తే ఇక తనకొడుకు గొప్పతనమేముంది?

ఇది మొదటి కారణమైతే రెండవది చంద్రశేఖర్ జన్మగురించి ఆమెకు కొన్ని అనుమానాలున్నాయి. ఆమెకు భర్త శీలంపై నమ్మకంలేదు. అతడి నామె అదుపు చేయలేకపోయేది. భర్త చంద్రశేఖరు పట్ల చూపే అభిమానం, ప్రత్యేకమైన శ్రద్ధాసక్తులు చూస్తూంటే—వాడు భర్త అక్రమసంతానమన్న అనుమానం కలుగుతూండేది. తన అనుమానాన్ని భర్తముందు ప్రకటించలేదామె. చంద్రశేఖర్ని చిన్నబుచ్చి భర్త అనుభూతు లెలాగుంటాయో చూస్తూండేదామె. భర్త ఆమెను దేనికీ ఏమీ అనేవాడు కాదు. చంద్రశేఖర్ని బాగా చూస్తే అతడు సంతోషించేవాడు. వేధిస్తే అతడు బాధపడేవాడు.

చంద్రశేఖర్ ఆ యింట్లో ఒక మనిషిలాగే పెరిగాడు కానీ ఆ యింటిమనిషి కాలేకపోయాడు. అతడొక అనాథ బాలుడని ఇంటా బయటా అందరికీ తెలుసు. చంద్రశేఖర్ తన అవధులు తెలుసుకుని ప్రవర్తించేవాడు. మనసులో ఎటువంటి భావాలున్నా పైకి వినయంగానూ, బుద్ధిగానూ ఉండేవాడు.

కొడుకు అమెరికా వెళ్ళే సమయానికి చంద్రశేఖర్ బీకాంలో అడుగుపెట్టాడు. కొడుకు దగ్గర లేని కారణంగా ఎన్నో విషయాల్లో శ్రీవల్లి చంద్రశేఖర్ మీద ఆధారపడవలసి వచ్చింది. క్రమంగా వారిరువురి ఆత్మీయత పెరిగింది. భర్త పోయినప్పుడు అమెరికాలోని కొడుకు వెంటనే రాలేకపోయాడు. తలకొరివి పెట్టినవాడు చంద్రశేఖర్.

భర్త పోయాక శ్రీవల్లిలో ఇంకా మార్పు వచ్చింది. చంద్రశేఖర్ కన్యాయం జరిగితే భర్త తన్ను క్షమించ

దన్న భయం ఆమెలో పుట్టింది. అదలాగుంటే—కన్న కొడుకు అమెరికాను వదిలిరాడు. తనే అక్కడకు రమ్మంటాడు. కొంతకాలం అక్కడుండి వచ్చేక తనక్కడ ఇమడలేనని ఆమె గ్రహించింది. ఇండియాలో తనకు చంద్రశేఖర్ తప్ప ఆత్మీయు లెవరూలేరు. అందుకని ఆమె అతడిని మరింతగా అభిమానించసాగింది.

ఇప్పుడు చంద్రశేఖర్ ఊళ్ళోనే ఉద్యోగం చేస్తున్నాడు. ఒక ప్రయివేటు కాలేజీలో లెక్చరరుద్యోగం. అతడు జీవితంలో స్థిరపడ్డట్టే లెక్క! ఎటొచ్చీ ఇంకా పెళ్ళికావాలి. శ్రీవల్లి అతడికోసం సంబంధాలు చూస్తోంది.

ఇక్కడే కొన్ని ఇబ్బందులొచ్చాయి.

తన భావిజీవితం పూర్తిగా చంద్రశేఖర్ పై ఆధారపడి ఉందని శ్రీవల్లికి తెలుసు. అందుకని పూర్తిగా తన చెప్పుచేతల్లో ఉండే అమ్మాయినిచ్చి అతడికి పెళ్ళిచేయాలని ఆమె అనుకుంటోంది. ఆవిధంగా సుబ్బారాయుడు, కనకమహాలక్ష్మి ఆమె యింట చేరారు. వారి నాల్గవ పుత్రికారత్నం మాధవి.

మాధవి అందంగానే ఉంటుంది. కానీ పేదరికమంటే ఉన్న భయం పేదరికంతో కూడిన ఆమె ముఖంలో స్పష్టంగా కనబడుతూంటుంది. శ్రీవల్లి ఆమెనో పెళ్ళిలో చూసి తన అభీష్టాన్ని వ్యక్తపరిస్తే ఆమె తలిదండ్రులు ఎగిరి గంతుకేసి ఆమెను శ్రీవల్లితో పంపించేశారు. ఆ తర్వాత కొన్నాళ్ళకు తామే శ్రీవల్లి ఇంట చేరారు. ఎందుకంటే అప్పటికి ముగ్గురు కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేసి ఉన్న పొలం, ఇల్లు అన్నీ అమ్ముకుని అతి కష్టం మీద రోజులు గడుపుతున్నాడు సుబ్బారాయుడు.

శ్రీవల్లికి మాధవి నచ్చింది. ఆమె అవసరమూ వచ్చింది.

కానీ చంద్రశేఖర్ కి మాధవి నచ్చలేదు. అందుకా్కారణం అతడు లతను ప్రేమిస్తున్నాడు.

లత అతడి కాలేజీలోనే చదువుకుంటున్న ఒక అనాథ బాలిక. ఆమె అందమైనది. కానీ అందానికి మించి చంద్రశేఖర్—ఆమె అనాథ అయినందుకే ఆకర్షించ బడ్డాడు. అన్ని కులాలతోపాటు అనాథకులం కూడా ఒకటి అని అతడి నమ్మకం. లతను తను పెళ్ళిచేసుకుంటేే ఆమెకు న్యాయం జరుగుతుందనీ—వేరెవ్వరైనా ఆమెను వంచిస్తారనీ అతడి అభిప్రాయం. అనాథుడైన తనకు ఒక అనాథ బాలికను పెళ్ళిచేసుకోవలసిన బాధ్యతకూడా ఉందని అతడు నమ్ముతున్నాడు.

లత గురించి విన్నాక శ్రీవల్లి ఆమెనోసారి చూసింది. కలుసుకుని మాట్లాడింది. అప్రయత్నంగానే ఆమె లతను, మాధవిని పోల్చుకుంది.

లత శ్రీవల్లిని వ్యక్తిగానూ, తనకంటె పెద్దదైన స్త్రీగానూ గుర్తించి గౌరవించింది తప్ప ఆమెలో తను అనాథననీ, తక్కువదాన్ననీ అభిప్రాయంలేదు. ఆమె కాలేజీలో తను సాధిస్తున్న ఘనవిజయాలకు గర్వపడుతోంది. పెళ్ళికోసం శ్రీవల్లిని దేబిరించే ఉద్దేశ్యంలో లేదామె.

కులంలేనిపిల్లకు అహంకారం! కులమున్న మాధవికి అతివినయం!

లతకు వ్యక్తిత్వముంది. అది శ్రీవల్లి భరించలేక పోయింది.

చంద్రశేఖర్ లతను పెళ్ళిచేసుకుందుకు వీల్లేదందామె,

చంద్రశేఖర్ లతను తప్ప వేరెవర్నీ చేసుకో నన్నాడు.

చంద్రశేఖర్ మాధవిని చేసుకోకపోతే అతడికీ తనకూ ఏసంబంధమూ లేదంది శ్రీవల్లి.

అప్పుడు చంద్రశేఖర్ సందిగ్ధావస్థలో పడ్డాడు. అత డికి శ్రీవల్లి అనీ పెద్ద మోజు లేదు. కానీ ఈనాడు తనీ స్థితిలో ఉన్నాడంటే అందుక్కారణం శ్రీవల్లి అని అత డికి తెలుసు. ఇప్పుడు లతకోసం తనిల్లు వదిలి వెళ్ళిపోతే ప్రపంచమంతా వేలెత్తి తనను కృతఘ్నుడంటుంది. ఆ మచ్చ జీవితాంతం ఉండిపోతుంది.

చంద్రశేఖర్ తన సమస్యను లతకు చెప్పుకున్నాడు.

"విషయం మాధవికి చెప్పు. నువ్వు నన్ను ప్రేమి స్తున్నావనీ—వేరెవరిని వివాహం చేసుకున్నా జీవితం ఇద్దరికీ నరకమవుతుందనీ చెప్పు" అంది లత.

"మాధవి వింటుందా?" అన్నాడు చంద్రశేఖర్.

"వ్యక్తిత్వమున్న ఏ ఆడపిల్లయినా ఇది విన్నాక నిన్ను పెళ్ళి చేసుకుంటాననదు. నాకే వదిలిపెడుతుంది" అంది లత.

మాధవికి వ్యక్తిత్వం లేదు. ఒక మధ్యతరగతి ఆడ పిల్లకు వ్యక్తిత్వమేమిటి?

లత ఊహలు తప్పయ్యాయి.

శ్రీవల్లి చంద్రశేఖర్ని పిలిచి—"నువ్వు మాధవిని బెదిరిస్తున్నావని తెలిసింది. అది ఈ యింటికోడలు. నా ఆస్తంతా దాని పేరున రాస్తున్నాను. దాన్నెవరు పెళ్ళి చేసుకుంటే వాళ్ళే ఈ యింట్లో ఉంటారు" అంది.

"చాలా మంచి పనిచేస్తున్నావు. నువ్వు నీ ఆస్తిని మాధవి పేరున రాయి. అప్పుడామె నన్నెలాగూ పెళ్ళి

చేసుకోదు. వచ్చినవాడు నిన్ను భరించడు. అప్పుడు నువ్వు నాయింటికి రాకతప్పదు. నాకు ఆస్తిమీద మోజు లేదు. నేను, లత నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం" అన్నాడు చంద్రశేఖర్.

శ్రీవల్లి దిమ్మెరపోయింది. చంద్రశేఖర్ చెప్పింది నిజం. సుబ్బారాయుడు సామాన్యుడు కాదు. ఆయన ఆశ కళ్ళలో కనబడిపోతుంది. ఆస్తికోసం అనాథ యువకుణ్ని అల్లుణ్ని చేసుకుంటాడే మాతప్ప—ఆస్తి ఉంటే ఆయన కూతురికి వేరే సంబంధం చేసుకుంటాడు. అంతా చంద్రశేఖర్ చెప్పినట్లే జరుగుతుంది.

కానీ ఆమెకు ఆ క్షణంలో ఆలోచించడ మిష్టంలేదు. చంద్రశేఖర్ని దబాయిస్తూ—"అయితే నన్ను కాదని లతను పెళ్ళి చేసుకుంటావా?" అంది.

"నువ్వు కాదనలేనిస్థితికి వచ్చేకనే మా పెళ్ళి జరుగుతుంది"

"అంటే నేను శవంగా మారాలి" అంది శ్రీవల్లి చటుక్కున.

అప్పుడు చంద్రశేఖర్ చటుక్కున వంగి శ్రీవల్లి పాదాలకు నమస్కరించాడు. అప్రయత్నంగా శ్రీవల్లి అతణ్ని దీవించింది.

చంద్రశేఖర్ లేచి నిలబడి—"అమ్మా! నేను నిన్ను అమ్మా అని పిలుస్తూ కూడా అనాథుణ్ని. ఈ యింట్లో ఒకమనిషిగా ఇరవైఏడేళ్ళు పెరిగి కూడా నేనవాథుడి గానే మిగిలిపోయాను. ఇప్పటికి నువ్వు నన్నెన్నోసార్లు దీవించి ఉంటావు. కానీ నీ దీవనల ఫలితం ఇది! నీ దీవనలకు బలంలేదు. అందుకు నీలో ఏదో లోప ముండి ఉండాలి. ఆ లోపాన్ని సంస్కరించడం బిడ్డగా నావల్ల

కాదు. నీలోపాన్ని సంస్కరించే ఉపాయాన్నన్వేషించ డానికే నేనిల్లు వదిలిపెడుతున్నాను. నీదీవెనలకు బలం రావాలని నాకోరిక" అన్నాడు.

శ్రీవల్లి అతణ్ని వారించలేదు.

చంద్రశేఖర్ ఇల్లు వదిలి అప్పటికి వారంరోజు అయింది.

రెండుమూడురోజాలపాటు శ్రీవల్లి అతడిగురించి పట్టించుకో లేదు. తర్వాత నుంచి ఆమె ఉండబట్టలేకపోయింది. అతడిగురించి కాలేజీలో వాకబు చేయించింది.

అప్పుడు కాలేజీకి సెలవులు.

ఒకటికాదు - రెండుకాదు.... సుమారు రెండుమాసాల సెలవులు.

శ్రీవల్లి అతడికోసం బెంగపెట్టుకుంది.

"ఎప్పుడూ ఇలా చేయలేదు. వాడికి నావల్ల మన సెంతగా కష్టపడిందో ఏమో...." అనుకోసాగిందామె.

సుబ్బారాయుడు, కనకమహాలక్ష్మి ఆమెకు ఓదార్పు మాటలు చెబుతూనే చంద్రశేఖర్ పట్ల ద్వేషం పుట్టించ డానికి ప్రయత్నిస్తున్నారు.

వినివిని విసిగిపోయి—"మీకు చంద్రశేఖర్ అంటే సదభిప్రాయమున్నట్లు లేదు. మీ పిల్ల పేరున నా ఆస్తి వ్రాస్తే వాణ్ని మీయింటల్లుణ్ని చేసుకుంటారా అని నా అనుమానం" అంది శ్రీవల్లి ఒకసారి.

సుబ్బారాయుడు, కనకమహాలక్ష్మి ముందు తెల్ల బోయారు. కనకమహాలక్ష్మి త్వరగా తేరుకొని—"సంప్ర దాయానికి ప్రాణాలిచ్చేవాళ్ళం. నీమాట కాదనలేక ఈ సంబంధాని కొప్పుకుంటున్నాంతప్ప మా యిద్దరికీ ఈ పెళ్ళిష్టంలేదు. అయితే పిల్ల బాగా ఇష్టపడింది. ఈ

రోజుల్లో పిల్ల యిష్టానికి తలవంచక తప్పదుకదా!" అంది.

శ్రీవల్లి మాట్లాడలేదు. ఆమె ఆలోచనలనిండా చంద్రశేఖర్!

చంద్రశేఖర్ గురించి కాస్త ఓదార్పు మాటలు చెప్పేది వంటమనిషి సీతమ్మ మాత్రమే!

మాధవి శ్రీవల్లితో ఎక్కువ మాట్లాడదు. ఆమె శ్రీవల్లి చెప్పిన మాటలు బుద్ధిగా వింటుంది. పనులన్నీ చేస్తుంది. తీరిక దొరికినప్పుడల్లా పుస్తకాలు చదువుకుంటుంది. అవీ శ్రీవల్లి ఎన్నికచేసి ఇచ్చినవే!

చంద్రశేఖర్ వెళ్ళిన వారంరోజులకు శ్రీవల్లి మంచం పట్టింది. కూర్చుంటే లేవలేదు. లేస్తే కూర్చోలేదు.

"వాడికోసం నీకింత బెంగకూడదు వదినా!" అంది కనకమహాలక్ష్మి.

"బెంగకాదు. నామాత్ర అయిపోవచ్చాయి...."

"అయిపోవస్తేయేం? ఇంకా ఉన్నాయిగా...."

"నీకు తెలియదులే. అవి లేకపోతే నాకు రోజు గడవదు. మాత్రలేమో...ఇక్కడ దొరకవు...."

ఆ విషయం అందరికీ తెలుసు.

శ్రీవల్లికి ఉన్నట్టుండి ఒళ్ళంతా బిగుసుకుపోయినట్లనిపించే జబ్బుండేది. అది అయిదారు నెలలకోసారి వస్తూండేది. ఆమె కొడుకుదగ్గర అమెరికాలో ఉండగా అలాంటి జబ్బు వచ్చింది. డాక్టర్లామెను పరీక్షించి రోగ నిర్ణయంచేసి వైద్యంచేసి - జీవితాంతం ఆమె మందుతీసుకుంటూ ఉండాలని నిర్ణయించారు. వారు నిర్ణయించిన మందు తీసుకోవడం మొదలుపెట్టేక ఆమెకు మళ్ళీ ఆజబ్బు రాలేదు. ఆ మందు ఇండియాలో దొరకదు కాబట్టి

కొడుకామెకు క్రమం తప్పకుండా పోస్టులో పంపిస్తూంటాడు.

ప్రస్తుతం మాత్రలయిపోవచ్చాయి.

“ఎంతో దూరాన ఉన్నా పేగుతీపి అంతే! ఈ వేళో రేపో పోస్టులో మందొస్తుంది వదినా! నేను చెబుతున్నాగా....” అంది కనకమహాలక్ష్మి.

సరిగ్గా అప్పుడే కాలింగ్ బెల్ మ్రోగింది.

“చూశావా—వచ్చింది పోస్టుమానే అయ్యుంటాడు. వెళ్ళి చూడండి” అంది కనకమహాలక్ష్మి.

సుబ్బారాయుడు లేచినిలబడ్డాడు.

శ్రీవల్లి మందుగురించి ఆలోచిస్తున్నట్లేలేదు—“చంద్రశేఖర్ వచ్చాడేమో...” అందామె.

అయితే ఆమె ఆశను నిరాశ చేస్తూ—“చెల్లెమ్మా—నువ్విలా వస్తావా—పోస్టుమన్ నక్కడికి రమ్మంటావా? ఇన్‌ఫ్రాసారిన్ మాత్రలు వచ్చాయి—”అంటూ దూరాన్నుంచి అరిచాడు సుబ్బారాయుడు.

## 3

తలుపు తీసిన లత మాధవిని చూసి ఆశ్చర్యపడి—“నువ్వా? లోపలకు రా....” అంది.

మాధవి లోపలకు వెళ్ళి కూర్చుంది. ఆమె గదిని పరిశీలనగా చూసింది.

చిన్నగది. గదిలో ఓమూలగా స్టవ్, గిన్నెలు ఉన్నాయి. ఓగోడ వార మడతమంచముంది. దానిలో రెండు కుర్చీలున్నాయి. నేలమీద చాప పరిచి ఉంది.

“ఈ యింటి అడ్రెస్ ఎవరిచ్చారు నీకు?” అంది లత.

“మనసుంటే మార్గముండదా?” అంది మాధవి.

"నామీద మనసా నీకు?" నవ్వుతూ అంది లత.

"నీమీద కాదు—బావమీద "

"బావా—అత దెవరు?"

"చంద్రశేఖర్ నాకు బావ!

లత నవ్వి—"తను అనాథుడినని చంద్రశేఖర్ నాతో అన్నాడు. నువ్వతడికి మరదలివెలాగయ్యావు?" అంది.

"భగవంతుడు మొట్టమొదటిసారిగా కొందరు మనుషుల్ని సృష్టించి ఈ భూమ్మీదకు వదిలినప్పుడు బంధుత్వాల గురించి యెవరికీ తెలియదు. ప్రేమ మనుషుల్లో పుడితే—ఆ ప్రేమలోంచి బంధుత్వాలు పుట్టాయి...."

"చాలా బాగా మాట్లాడుతున్నావు. ఇంతకీ నా యింటి చిరునామా నీ కెవరు చెప్పారో చెప్పలేదు...." అంది లత.

"బావ డైరీ చదివాను. అందులో నీ చిరునామా చాలా చోట్ల వుంది—"

"ఇతరుల డైరీ చదవడం తప్పు కదూ!" అంది లత.

"బావ నాకు పరాయివాడు కాదు...."

"బావ డైరీ చదివావు కదా—అప్పుడైనా నీకని పించలేదా—నీ బావ నీకు పరాయివాడని ..."

మాధవి తల అడ్డంగా ఊపి—"లేదు—" అంది.

లత కుతూహలంగా — "డైరీలో ఏం చదివావు?" అంది.

"నీ అందం గురించిన వర్ణనలు...."

లత సిగ్గుపడింది.

"బావకు నువ్వంటే చాలా యిష్టం. చాలా చాలా యిష్టం. అదే డైరీలో రాసుకున్నాడు..."

లత సిగ్గు నధిగమించడానికి ప్రయత్నిస్తూ — "అది

తెలిసి కూడా బావ నీకు పరాయివాడనిపించడంలేదా?"
అంది.

మాధవి తమాషాగా నవ్వి—"నేను నువ్వు సినిమా తారవనుకుంటాను——" అంది.

"ఎందుకని?"

"నీ అందం సినీతారల అందం...."

లత ఇబ్బందిగా నవ్వి——"నీ పొగడ్తలు విని సాకిష్టమైంది నేను వరులుకోలేను...." అంది.

"లతా! నిజం చెబుతున్నాను. మొదటిసారి అత్తయ్యవాళ బావ నిన్ను తీచివద్ద పరిచయం చేసినప్పుడే అనుకున్నాను. నీవు అప్సరసవని. నువ్వు సినిమా అవకాశం కోసం ప్రయత్నించకూడదూ?" అంది మాధవి.

"ఆ విధంగా నా అడ్డు తొలగించుకోవాలనుకుంటున్నావా?"

"అవును...."

"ఇప్పుడే చంద్రశేఖర్ నన్ను ప్రేమిస్తున్నాడు. నేను సినీతారనైపోతే ఒక్కక్షణం కూడా నన్ను వదలడు... "

మాధవి నిట్టూర్చి — "మగాడికి అందం పెద్ద ఆకర్షణ. సినీతారలు, మోడల్సు రాజ్యమేలుతున్న కారణం అదే!" అంది.

"మగాడి గురించి పెద్దగా చెబుతున్నావు. నీ అనుభవం యేపాటిది?"

"పుస్తకాలు చదివి ఇతరుల అనుభవాలు పంచుకుంటే చాలదా? ప్రతిదానికీ స్వానుభవం కావాలా?" అంది మాధవి.

"ఇంతకీ నువ్వెక్కడికెందుకొచ్చినట్లు?"

"హాస్టల్లో నీకిబ్బందిగా ఉంటోందని బావ నీకోసం ఈ గది అద్దెకు తీసుకున్నాడు. అద్దె డబ్బులు తనే యిస్తున్నాడు. నీకిబ్బంది కలిగించకూడదని నీ యింటికి ఒక్కసారికూడా రాలేదు. మీరెప్పుడూ బయటే పార్కుల్లోనో, సినిమాల్లోనో, బీచిలోనో కలుసుకుంటూంటారు....ఇవన్నీ నేను బావ డైరీ చదివి తెలుసుకున్నాను...."

"ఊఁ" అంది లత.

"తెరమీద తారను చూసి మగాడామె గురించి కలలు కంటూంటాడని నేను యెన్నో పుస్తకాల్లో చదివాను. భర్తకు సినీతారపట్ల ఆకర్షణ లేకుండాయే భార్యా అపలేదు. సినీతారంపట్ల భర్త ఆకర్షించబడుతున్నాడని యే భార్యా అసూయపడదు. నీ గురించి నేనూ అలాగే సరిపెట్టుకుంటాను...."

లత ఆమె వంక ఆశ్చర్యంగా చూసి—"సరిపెట్టుకునే మన స్తత్వమున్న వాళ్ళకి జీవితమంతా అంతే అవుతుంది. అందులోనూ ముఖ్యంగా ఆడవాళ్ళకి!" అంది.

"ఆ విషయం నాకు తెలుసు. అమ్మ నాన్నతో సరిపెట్టుకుంది. అక్కలు బావలతో సరిపెట్టుకుంటున్నారు. మన సమాజంలో ఆడదానికి సరిపెట్టుకోవడం ఒక బాధ్యత. లేదా అలవాటు. ఇంతకీ నేను చెప్పదల్చుకున్నది వేరే ఉంది. నా మాట విని నువ్వు బావను వదిలిపెట్టు. మా యిద్దరి పెళ్ళికి బావను ప్రోత్సహించు. అందుకోసం యెలాంటి త్యాగమైనా సరే చేయి...."

లత వేళాకోళంగా నవ్వి—"ఎందుకని?" అంది.

"నువ్వు కూడా బావను ప్రేమిస్తున్నావని తెలుసు కాబట్టి ఈ మాటలు చెప్పాను. ఆపైన నీ యిష్టం...."

"నేను బావను ప్రేమిస్తూంటే అతడికెందుకు వదులు కోవాలి?"

"నేను బావ డైరీ చదివాను....అందులో యేముందో తెలుసా?"

"ఇందాక చెప్పావుగా...."

"ఇంకా చెప్పని విశేషాలు చాలా వున్నాయి...."

"ఏమిటవి?"

"అత్తయ్యను కాదని బావ నిన్ను పెళ్ళిచేసుకోలేడు. అందుకని...." ఆగింది మాధవి.

"ఊఁ.... అందుకని!"

మాధవి మాట్లాడలేదు.

"ఊఁ చెప్పు....అందుకని...." అంది లత.

"చెప్పడానికి భయంవేస్తోంది...."

లత చిరాగ్గా-"అసలు చెప్పడానికేమైనా ఉందా?" అంది.

"ఉంది. బావ అత్తయ్యను హత్యచేయాలనుకుంటు న్నాడు..."

నిర్ఘాంతపోయింది లత.

"బావ అత్తయ్యను హత్యచేయకుండా ఆపగల వ్యక్తివి నీవే! హత్యచేస్తే యేదో ఒకరోజున బావ పట్టు బడి తీరతాడు. అప్పుడు బావ నీకూ నాకూ కాకుండా పోతాడు. కాదంటావా?" అంది మాధవి.

"నేను నమ్మలేను...." అంది లత.

"ఇప్పటికీ నేనే యిది నమ్మలేకపోతున్నాను—" అంది మాధవి.

లత కాసేపు మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా—

"నీ బావ డైరీ చదివి నువ్వుచాలా తప్పుచేశావు. మనిషి

భావోద్రేకంలో వున్నప్పుడు అప్పటికప్పుడు కలిగిన భావాలను డైరీలో రాసుకోవచ్చు. ఉద్రేకం తగ్గిపోయాక ఆ మనిషే డైరీలో తను రాసింది చదువుకుని నవ్వుకుంటాడు. ఇతరుల డైరీని చదివేవాళ్ళుంటే మనిషికి ప్రైవసీ లేకుండా పోతుంది. నీ బావ హత్య చేయడు. హత్య చేసేవాళ్ళెప్పుడూ ముందుగా డైరీల్లో రాసుకోరు. అలా చేసేవాళ్ళు పిచ్చివాళ్ళు ..." అంది.

"ఏమో—డైరీ చదవగానే నాకు భయం వేసింది. ఇంట్లో కూడా చెప్పకుండా ముందుగా నీకే చెప్పాలని వచ్చాను. నా బావను హంతకుడు కాకుండా చేయాలని నా తాపత్రయం. కానీ నువ్వు సహకరించేలా లేవు...."

అత వెంటనే—"చంద్రశేఖర్ నీకు బావ కావచ్చు. కానీ అత ఎప్పటికీ నీకు బావే అవుతాడు. నాకు మాత్రం అతడు కాబోయే భర్త. అందువల్ల అతడిని రక్షించుకోవలసిన బాధ్యత నీకంటే నాకే యెక్కువుంది—అంది."

"మీ వివాహం జరిగిందంటే బావ అత్తయ్యను హత్య చేస్తాడనే అర్థం!" అంది మాధవి.

"నీ అత్తయ్య హత్య జరిగితే నాకేం నష్టం?"

"బావ ఉరికంబమెక్కుతాడుగా?"

"నీ బావ ఉరికంబమెక్కడని నా హామీ-చాలా?"

"అత్తయ్య ప్రాణాల గురించి హామీ ఇవ్వలేవా?"

"ఇవ్వలేను—"

"అయితే విను. అత్తయ్య ప్రాణాలకేమైనా గనుక అయితే—నేను బావను వదిలిపెట్టను...."

"అయితే నువ్వు నీ బావను ప్రేమించడం లేదా?"

"ప్రేమిస్తున్నాను కాబట్టే! నాకు దక్కని బావను నీకూ-డా దక్కనివ్వను...."

"నీవాటం చూస్తూంటే నువ్వేమీ అత్తయ్యను హత్య చేసి నీ బావమీద పెట్టేసేలాగున్నావు...."

"సరే—హత్య చేయడానికి బావను ప్రోత్సహించేది నువ్వేనని నేననుమానిస్తున్నాను...." అంది మాధవి.

"నీ ఆలోచన నీ స్వార్థం చుట్టూ తిరుగుతోంది. అసలు నీ బావ యెక్కడున్నాడో ఏం చేస్తున్నాడో నన్న ఆలోచనే వున్నట్టులేదు...."

"బావను నువ్వే పంపి వుంటావు. హత్య గురించిన పథకంతో యెక్కడో తిరుగుతూంటాడు...." అంది మాధవి నిర్లక్ష్యంగా.

లత నిట్టూర్చింది.

## 4

అతడు సైకిలుకు స్టాండువేసి దగ్గర్లోని కిళ్ళీకొట్టు వద్దకు నడిచాడు. కొట్టువాడు హడావుడిగా కిళ్ళీలు కడుతూంటే ఆ పనయ్యేదాకా ఓపికగా ఆగాడు.

కొట్టువాడు ఓరకంట అతణ్ణి గమనిస్తున్నాడు. కాస్త తీరిక దొరకగానే—"ఏం కావాలి బాబూ!" అన్నాడు.

"ఈ వీధిలో శ్రీవల్లి అనే ముసలావిడ ఉంటోంది. వాళ్ళిల్లెక్కడో చెప్పగలవా?" అన్నాడతడు.

"ఆడాళ్ళ పేర్లు నాకేం తెలుస్తాయి బాబూ!"

"ఆవిడ కొడుకు అమెరికాలో వుంటున్నాడు...."

"ఓహో—ఆవిడా—వల్లీయమ్మంటాం.....అవును..... అదిగో—ఆ కనబడుతున్న పచ్చమేడే వాళ్ళది...." అన్నాడు కిళ్ళీకొట్టువాడు.

"చాలా థాంక్స్!" అంటూ అతడు నాలుగు వక్క పొడి పొట్లాలు కొనుక్కుని సైకిలు వద్దకు నడిచాడు.

సైకిలుమీద పచ్చమేడకు చేరుకోవడానికి కొద్ది నిముషాలు పట్టింది.

అతడింటి తలుపు తట్టగానే తలుపుతీసింది మాధవి. అతడామెను చూస్తూనే—"మీ పేరు మాధవి కదూ!" అన్నాడు.

మాధవి ఆశ్చర్యంగా—"మీరెవ్వరో నాకు తెలియదు—" అంది.

"నేను మీ బావ స్నేహితుణ్ణి. కానీ ఆ విషయం ఎవరికీ తెలియకూడదు—" అన్నాడతడు.

మాధవి కంగారుగా—"నాన్న ఇంట్లో లేడు. అమ్మను పిలిచేదా?" అంది.

"వద్దు నా అదృష్టం కొద్దీ తలుపు తట్టగానే మీరు వచ్చారు. లేకుంటే మిమ్మల్ని కలుసుకుని యెలా పలకరించాలో తెలియక ఇబ్బంది పడేవాణ్ణి ..."

"నాతో మీకేం పని?"

"అన్నీ చెబుతాను. మరో గంటలో విజేతా పార్కుకి రాగలరా?"

మాధవి భయంగా—"ఎందుకు?" అంది.

"మీ బావ మీకోసం ఓ ముఖ్యమైన సందేశం పంపాడు ..."

ఆమె అనుమానంగా అతడి వంక చూసింది.

"మీరు నన్ను నమ్మండి. నేను మిమ్మల్ని వంచించబోవడంలేదు. మీ బావ మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు. ఆ విషయం మీక్కూడా తెలియకుండా రహస్యంగా ఉంచాడు. లత అనే అమ్మాయి అతడి చుట్టూ వల విసిరింది. దాన్నుంచి తప్పించుకోవడమెలాగో తెలియక అతడవస్థ పడుతున్నాడు. మీరు పార్కుకు రాకపోతే

మీ బావ మీద శాశ్వతంగా దక్కడు...."

మాధవి వెంటనే—"సరే—వస్తాను...." అంది.

"సరిగ్గా గంటలో రావాలి!" అన్నాడతడు.

"ఊఁ" అని తలుపులు వేసిందామె.

"ఎవరే?" అంటూ కనకమహాలక్ష్మి అక్కడ కొచ్చింది.

"ఎవరో—వీరభద్రంగారిల్లు కావాలిట. చెప్పాను" అంటూ అప్రయత్నంగా అబద్ధం చెప్పింది మాధవి.

"ఆ వీరభద్రాని కూరా పేరా? వాళ్ళనీ వీళ్ళనీ అడిగితే తప్ప అడ్రసుకూడా తెలియదు. మనకైతే—అమెరికాలో కూడా పేరుంది. నువ్వే ఇంటి కోడలివైతే చూడాలని తొందరపడే దందుకే!" అంది కనకమహాలక్ష్మి.

మాధవి తల్లిమాటలు వినలేదు. మరోసారి ఆమె తలుపుతీసి అతణ్ణి చూడాలనుకుంది. కానీ ఆ పని చేయలేదు.

## 5

"రండి లాయరుగారూ—నమస్కారం. కూర్చోలేను. మరేమీ అనుకోకూడదు...." అంది శ్రీవల్లి.

"అయ్యో—ఎంతమాట...." అంటూ లాయరామె మంచం పక్కగా కుర్చీలో కూర్చుని—"ఇంట్లో ఎవరూ ఉన్నట్లు లేదే?" అన్నాడు.

"వంటావిడుంది. అబ్బాయూళ్ళోలేడు. సుబ్బారాయుడుగారూ ఊళ్ళోలేరు. అమ్మాయి మాధవి ఏదో పనుందని బైటకు వెళ్ళింది. వాళ్ళున్నాను నేనే వంక పెట్టి బైటకు పంపించేశాను..."

"ఏమిటి విశేషం?"

"విల్లు రాద్దామని...."

"విల్లుకప్పుడే ఏం తొందరొచ్చింది?"

"ఇంట్లో పరిస్థితులు బాగోలేవు లాయరుగారూ!" అంది శ్రీవల్లి. ఆమె గొంతులో బాధ ధ్వనించింది.

"ఏమయింది?" అన్నాడు లాయరు.

"నా యింట్లో నా మీద నే హత్యాప్రయత్నం జరుగుతుందనిపిస్తోంది...."

లాయరు భ్రుకుటి ముడతలు పడింది—"ఏమిటో వివరంగా చెప్పండి...."

"మా మాధవి చంద్రశేఖర్ డైరీ చదివిందిట...." అంటూ శ్రీవల్లి ఆ వివరాలు చెప్పింది.

లాయరు ఆమె చెప్పింది శ్రద్ధగా విని—"చూడండమ్మా—అనుభవంమీద చెలుతున్నాను. చంద్రశేఖర్ నాకు బాగా తెలుసు. అతడు హత్యలు చేయలేడు. అందులోనూ మీరంటే అతడికి ప్రాణం—" అన్నాడు.

"లేదు లాయరుగారూ! వాణ్ని నేను చిన్నతనంనుంచీ శ్రద్ధగా గమనిస్తున్నాను. వాడిలో అహంకారంపాలు జాస్తి. దానికి తగ్గట్టే ఆశ కూడా ఎక్కువే. ఈ ఇంట్లో నా కొడుకుతో సమంగా హోదా కావాలి వాడికి. అదెలా సాధ్యం? నేను వాణ్ని కొడుకు తర్వాత కొడుకంత వాడిగా చూసుకుంటున్నాను....కానీ అది చాలదు వాడికి...." అని నిట్టూర్చింది శ్రీవల్లి.

"ఎందుకని?"

"పెట్టనమ్మ ఎప్పుడూ పెట్టదు—పెట్టే ముండకే పెంచింది రోగమన్నాట్ట ఒక బిచ్చగాడు. ఈ సామెత చాలా గొప్పది. నడిరోడ్డుమీద బిచ్చగాడికి చేతిలో పది పైసలు పెడితే ముఖం వెలుగుతుంది. అదే వాణ్నింటికి

తీసుకువచ్చి పంచభక్ష్యపరమాన్నాలతో విందు చేస్తే వాడికి మన వైభవం చూసి అసూయపుడుతుంది మానవ స్వభావం చిత్రమైనది. పొత్తిళ్ళలో వాడు మాకు దొరికినప్పుడే నేను — వాణ్ని ఏ అనాథశరణాలయానికో అప్పజెప్పాల్సింది. తప్పుచేశాను...."

"మీ ఆలోచనలు సరైన దారిలో వెళ్ళడంలేదు. అంతా మీరు మీ తరఫునించే ఆలోచిస్తున్నారు. ఉదాహరణకు అమెరికాలో ఉన్న మీ అబ్బాయినే తీసుకోండి. అతడు తండ్రి దహన క్రియలకు రాలేదు. మీరు జబ్బుతో బాధపడుతూంటే వచ్చి మీ దగ్గరుండడం లేదు...." అన్నాడు లాయరు.

"నన్ను వాడు రమ్మనే రాడు. నేను వెళ్ళకపోతే వాడేం చేస్తాడు?" అంది శ్రీవల్లి — "అప్పటికీ నా కోసం వాడు మందులు పంపిస్తూనే వున్నాడు. ఒక్కసారి కూడా మందులాలస్యం కాలేదు...."

"మీ అబ్బాయి తనకు వీలైన ప్రకారం చేస్తున్నాడు. మీ వీలు ప్రకారం చేయడంలేదు. అయినా మీరతణ్ణి తప్పుపట్టడంలేదు. ఎందుకంటే అతడు మీ కన్నకొడుకు కాబట్టి! చంద్రశేఖర్ మీ కన్నకొడుకే అనుకోండి. అప్పుడతడిపై మీరు కోపగించుకోగలరా?"

"కన్నకొడుకైతే డైరీలో తల్లిని చంపుతానని రాసుకుంటాడా?"

"ఒక వయసులో పురుషుడు తల్లినిమించి ప్రియురాలిని కోరుకుంటాడు. ప్రేమకు తల్లి అడ్డువస్తే తాత్కాలికంగా ఆవేశపడతాడు. ఆ ఆవేశంలో తల్లిని చంపాలని కూడా అనుకోవచ్చు. తల్లి చచ్చిపోవాలనికూడా కోరుకోవచ్చు. కానీ అది తాత్కాలికం మాత్రమే!

చంద్రశేఖర్ మీ కన్నకొడుకే అనుకోండి. మీరతణ్ని క్షమించగల్గుతారు....”

“లాయరుగారూ! మీకు మా కుటుంబంలో ప్రతి ఒక్కరితోనూ దగ్గర పరిచయముంది. అందరి మనస్తత్వాల గురించీ మీకు బాగా తెలుసు. మీ మాటలకు నేనొప్పుకుంటాను. కానీ చంద్రశేఖర్ దెబ్బ నా మనసు మీద గట్టి దెబ్బతీసింది. వాడొక అనాధ. వాణ్ని నేను ఇంట్లో మనిషిలా పెంచాను. ఆ కృతజ్ఞత వాణ్ని నాకు బానిసలా కట్టిపడేయాలి. అసలు నన్ను హత్య చేయాలన్న ఆలోచన కూడా వాడికి రాకూడదు. అందుకే నేను విల్లు రాయాలని నిర్ణయించుకున్నాను....”

“మీ యిష్టం— నేను చెప్పవలసింది చెప్పాను....” అన్నాడు లాయరు.

“మీరు చెప్పినవన్నీ దృష్టిలో వుంచుకున్నాను. మీరు వచ్చే ముందే తే నేను చంద్రశేఖర్‌కీ నాకూ ఏ సంబంధమూ లేదని నిర్ణయించుకున్నాను. కానీ ఇప్పుడు నా మనసు మారింది....” అంది శ్రీవల్లి.

“చెప్పమ్మా—” అన్నాడు లాయరు.

“చంద్రశేఖర్ని నా కొడుకుతో పోల్చాలంటే వాడూ నా కొడుకులాగే ప్రవర్తించాలి. మా అబ్బాయి మేము చెప్పిన పెళ్ళి చేసుకున్నాడు. ఆ పిల్ల కారణంగా వాడు అమెరికాకు అంకితమైపోతే అది నా తప్పుగానీ వాడి తప్పు కాదు....” ఆగింది శ్రీవల్లి.

లాయరు తలాడించాడు.

“చంద్రశేఖర్ మాధవిని పెళ్ళిచేసుకుంటే వాడికి నా ఆస్తిలో మూడోవంతు ఇచ్చేస్తాను. నా తదనంతరం ఈ యిల్లు, మరో మూడోవంతు ఆస్తి కూడా వాడి పర

పోతుంది. అనీ వాడి పేరున వుండదు. వాడు పెళ్ళికి ఒప్పుకుంటే ఆస్తి మాధవి పేరున రాస్తాను. వాడు వేరే పెళ్ళి గనక చేసుకుంటే వాడికి నాకూ ఇక ఆస్తిపరంగా ఏ సంబంధమూ ఉండదు...." అంది శ్రీవల్లి.

"మీరు బాగా ఆలోచించుకున్నారా?"

"ఊఁ."

"అయితే సాక్షులను పిలవమంటావా?"

"ముందు విల్లు తయారుచేయండి. అప్పుడు సాక్షులను పిలవ్వచ్చు —" అంది శ్రీవల్లి.

"సరే-ఇప్పుడే డ్రాఫ్టు తయారుచేస్తాను. ఇంకేమైనా ముఖ్యమైన పాయింట్సుంటే చెప్పండి—"

"వాడి పెళ్ళికి ముందే గనుక నేను చచ్చిపోతే— నా యావదాస్తీ అమెరికాలోని నా కొడుక్కి మాత్రమే చెందుతుంది. ఇటు మాధవికిగానీ, అటు చంద్రశేఖర్ కి గానీ చిల్లిగవ్వ కూడా రాదు...." అంది శ్రీవల్లి.

## 6

"ఈ రోజు మీ అత్తయ్య విల్లు వ్రాయబోతోంది. ఆ ప్రకారం ఆస్తిలో మూడొంతులు మీకే వస్తుంది—" అన్నాడతను.

మాధవి పార్కులో చుట్టూ చూసింది. జనం బాగానే వున్నారు. వాళ్ళెవరి హడావుడిలో వాళ్ళున్నప్పటికీ అంతా తనవంకే చూస్తున్నట్లు తోచిందామెకు. ఆమె ఇబ్బందిగా—"ఇలా నేనెన్నడూ బావతో కూడా తిరగ లేదు. నాకు చాలా మొహమాటంగా వుంది. మీరు చెప్పదల్చుకున్నదేమిటో త్వరగా చెప్పండి—" అంది.

"మొహమాటపడితే నేను చెప్పేది వినలేరు. నేను మాట్లాడబోయేది మీ పెళ్ళి గురించి.... భవిష్యత్తులో

మీకు కలిగే సుఖాల గురించి.... మీరు నన్ను ఆత్మీయుడిగా భావించాలితప్ప సిగ్గుపడకూడదు...."

"చెప్పండి—" అంది మాధవి.

"మీ బావ నిజానికి మిమ్మల్నే ప్రేమిస్తున్నాడు. మిమ్మల్నే పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడు. కానీ అతణ్ణి లత చిక్కుల్లో పడేసింది. ఏమీ ఎరుగని అతణ్ని అభిమానంగా పలకరించి, ప్రేమను నటించింది. అతడు నిరసిస్తే తను అనాథ కాబట్టి స్నేహానికిష్టపడడంలేదంది. మీ బావకు అనాథలంటే సెంటిమెంటు. క్రమంగా వారి స్నేహం పెరిగింది. అయితే అతడికేవిధమైన దురుద్దేశ్యమూ లేదు. వారి మధ్య కొంత చనువు పెరిగాక ఆమె అతణ్ని బ్లాక్ మెయిల్ చేయసాగింది. తన్ను పెళ్ళిచేసుకోకపోతే తనతో అక్రమ సంబంధం యేర్పరచుకున్నట్లు ప్రచారం చేస్తానంది. అతడు భయపడ్డాడు.. అప్పట్నించీ ఆమె నెలా వదిలించుకోవాలా అని ఆలోచిస్తూనే వున్నాడు. అతడిల్లు వదిలింది కూడా తాత్కాలికంగా లతను వదిలించుకుందుకే తప్ప అమ్మమీద కోపంలేదు.."

"ఇంతకీ మీరెవరు?"

"చెప్పానుగా—మీ బావకు స్నేహితుణ్ణి!"

"మీకు నాతో ఏం పని?"

"మీ బావ నన్ను మీ దగ్గరకు పంపాడు...."

"ఎందుకు?"

అతడు జేబులోంచి ఒక మెటాలిక్ పేపర్ తీశాడు— "ఇది మొత్తం పన్నెండు టాబ్లెట్సు. వీటిని పూటకొకటి చొప్పున మూడురోజులపాటు మీ అత్తయ్యకివ్వాలి..."

మాధవి కళ్ళు పెద్దవిచేసి పేపర్ వంక చూస్తూ— "నేనెందుకివ్వాలి? ఈ మాత్రలు ప్రమాదకరమైనవా?"

అంది.

"ప్రమాదకరమైనవైతే మీ బావ వీటిని నాద్వారా పంపించడు. ఈ మాత్రలు వేసుకుంటే శిరోభారం తగ్గుతుంది...."

"కానీ అత్తయ్యకు శిరోభారం లేదు..."

"శిరోభారమున్నట్లు తెలియదు. కన్నకొడుకు అమెరికాలో స్థిరపడిపోయాడు. పెంచిన కొడుకు పెళ్ళి విషయంలో తన మాట వినడం లేదు. అభిమానించే అయిన వాళ్ళెవరూ లేరు. శ్రీవల్లి గారికి యెవరిపైనా నమ్మకం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఆమెకు మెదడంతా అయోమయంగా ఉండడం సహజం. ఆ అయోమయావస్థను తొలగించి మనసును ప్రశాంతంగా ఉంచుతాయీ టాబ్లెట్స్. అప్పుడామె ఆలోచనలు సక్రమమైన రీతిలో వుంటాయి. అసూయాద్వేషాలు మరిచి, స్వార్థాన్ని విడిచిపెట్టి మానవత్వంతో ప్రతి విషయాన్ని పరిశీలించగల్గుతుంది. నాలుగు రోజుల తర్వాత మీ బావ మీ ఇంటికి వస్తాడు. తల్లి అతన్ని సహృదయంతో ఆదరిస్తుంది. అతను సంబంధించిన తన సమస్యనప్పుడతడామెకు చెప్పుకుంటాడు. ఆమె సహకరిస్తే అది అతడికి సమస్యకాదు."

"నాకేమిటో నమ్మకంగా లేదు. ఈ మాత్రలవల్ల అత్తయ్య ప్రాణాలకే ప్రమాదమైతే?"

"ప్రమాదం లేదని నా హామీ. ప్రమాదముంటే ఆపని మీ బావ చేయడు. అతడు తన డైరీలో కసిపట్టలేక— తల్లిని చంపేస్తానని రాసుకున్నాట్ట. ఇప్పుడు తల్లికేదైనా ప్రమాదం వాటిల్లితే అతడినే అనుమానిస్తారు పోలీసులు...."

"బావ మీద చాలా విశేషాలు చెప్పావు...."

"అవును— నేనతడికి ప్రాణస్నేహితుణ్ని కదామరి!"

మాధవి ఆ టాబ్లెట్సందుకుని— "నాకింకా భయంగా వుంది. ఈ టాబ్లెట్సును మీరింత రహస్యంగా యెందు కిస్తున్నారు?" అంది.

అతడు నవ్వి— "నాకు మీ యిల్లు తెలుసు. అయినా సరే — ఏమీ తెలియనివాడిలా వాకబు చేసుకుంటూ వచ్చాను. ఈ టాబ్లెట్సు విషయమూ అంతే! ఉద్దేశ్యం మంచిదైనా యేదైనా ఇప్పుడు మీరనుమానించినట్లే అనుమానిస్తారు. టాబ్లెట్సివ్వకుండా మీ బావ శ్రీకల్లి గారిని కలుసుకోడు. అందుకు నన్నెన్నుకున్నాడు...." అన్నాడు.

మాధవి రేపర్ మీద పేరు చూసి— "ఆల్ట్రామైసిన్ బీస్తై" అని చదివి— "ఇవి ఈ ఊళ్ళో దొరకవా?" అంది.

"ఒకప్పుడు ఆస్ప్రో, అనాసిన్ లకులాగే డాక్టర ప్రిస్క్రిప్షన్ అవసరం లేకుండా బజార్లో అన్ని షాపు ల్లోనూ దొరికేవి. కంపెనీకి మంచి లాభాలు తెచ్చిపెట్టిన మందిది. కంపెనీ ధరను పెంచడంకోసం మందును తాత్కాలికంగా మార్కెట్లోంచి విత్ డ్రా చేసింది. ఇప్పుడిది యెక్కడా దొరకడంలేదు. అతికష్టంమీద నేనీ టాబ్లెట్సు మీ బావకోసం సంపాదించాను....త్వరలో కంపెనీ ధరను పెంచికొత్త పేరుమీద ఇదే మందును ప్రజలమీదకు వదలబోతోంది...."

మాధవి టాబ్లెట్సు రేపర్ని జాకెట్లోపలకు తోసి— "మరి వాకు సెలవా?" అంటూ లేవబోయింది....

"మీరు లేవకండి. ముందు నేను వెళ్ళిపోతాను. ఈ టాబ్లెట్ సులభంగా నీళ్ళలో కరిగిపోతుంది. నీళ్ళలో

కరిగించి ఇవ్వండి. ఆమె మామూలుగా టాబ్లెట్సు వేసుకుంటూనుగా—అప్పుడు మంచినీళ్ళు తాగడానికివ్వాలిగా. ఆ నీళ్ళలో ఈ టాబ్లెట్సు కరిగించండి" అన్నాడతడు.

మాధవి తలూపింది.

అతడు లేచి దూరంగా స్టాండువేసి వున్న సైకిలు వద్దకు వెళ్ళాడు.

## 7

"నువ్వా?" అంది లత.

"అవును—నేనే!" అంటూ అదోలా నవ్వేడతడు.

"నవ్వకు—అలా కూర్చో!" అంది లత.

"ఇక జీవితమంతా నవ్వే నాకు. లతా! నిస్సందేహంగా నీవు నా దానివౌతావు...." అన్నాడతడు.

"లత నవ్వి—ఏం చేశావు నువ్వు?" అంది.

"చంద్రశేఖర్ని ఉరికంబమెక్కించే యేర్పాట్లు...."

లత తెల్లబోయి—"ఎలా?" అంది.

"నాలుగు రోజుల తర్వాత నీకు తెలుస్తుంది...."

"ఏం చేశావో చెప్పు.." అంది లత కంగారుగా.

అతడు నవ్వి—"నీ దగ్గరకు మాధవి వచ్చింది. నిన్ను హెచ్చరించింది. ఆ విషయం నువ్వు నాకు చెప్పావు.." అన్నాడు.

"అవును. చంద్రశేఖర్ నన్నెంతలా ప్రేమిస్తున్నాడో తెలుసుకుంటావని నేనది నీకు చెప్పాను...."

"కానీ నేనది మరోకలా ఉపయోగించుకున్నాను."

"ఏం చేశావో చెప్పు...." కంగారుగా అంది లత.

"రక్తపాతం లేకుండా హత్య జరుగుతుంది. ఆ హత్యానేరం చంద్రశేఖర్ మీద మోపబడుతుంది...."

"ఎవర్ని నువ్వు హత్య చేయబోతున్నది?"

"శ్రీవల్లి ..." అన్నాడతడు తాపీగా.

"దుర్మార్గుడా—ఇప్పుడే వెళ్ళి నేనావిణ్ని హెచ్చరిస్తాను...."

అతడు నవ్వి—"నువ్విలాంటిదానివని నాకు తెలుసు. అందుకే నా యేర్పాట్లన్నీ అయ్యాకనే—విషయం నీకు చెప్పాను...." అన్నాడు.

లత ఆవేశంగా — "నేను నీ గురించి పోలీసులకు చెబుతాను. నిన్ను నేను వదలను—" అంది.

"పోలీసులెలాగూ నన్ను వదులుతారు. నువ్వు నన్ను వదలనంటున్నావు. అది నాకు వరం...."

"చంద్రశేఖర్ నీకేమన్యాయం చేశాడు?"

"ఏం చేశాడా అని నెమ్మదిగా అడుగుతున్నావా? నేనూ నీకులాగే అనాథుణ్ని. నీ బాధలు నాకు తెలుసు. నా బాధలు నీకు తెలుసు. చాలాకాలం ఒకే శరణాలయంలో కలిసి పెరిగాం. ఆ కారణంగా నువ్వంటే నాకు ప్రాణం. వాడు-ఆ చంద్రశేఖర్ నా ప్రాణాన్ని నానుంచి వేరుచేయాలని చూస్తున్నాడు. వాణ్ని నేను వదిలిపెడతానా?"

లత నిట్టూర్చి—"ఇందులో చంద్రశేఖర్ తప్పేం లేదు. తప్పంతా నాది—" అంది.

"నీ తప్పుల్ని నేను క్షమించగలను...."

"చంద్రశేఖర్ కన్యాయం జరిగితే నేను నిన్ను క్షమించలేను..."

"చంద్రశేఖర్ కన్యాయం జరిగితే తప్ప—నాకు జరిగిన అన్యాయం తొలగించబడదు...."

"నీతో వాదించి లాభంలేదు. నేను చంద్రశేఖర్

ఇంటికి వెళ్ళి—అందర్నీ నీ గురించి హెచ్చరిస్తాను—"

"నా గురించి హెచ్చరించడంవల్ల నీకే ప్రమాదం. నేనాయింట్లో యెప్పుడూ అడుగు పెట్టలేదు. ఆ యింట్లో యెవర్నీ పలకరించను కూడా లేదు. నా యేర్పాట్లన్నీ వేరే మనిషి ద్వారా జరుగుతున్నాయి. అతడెవరో నువ్వు తెలుసుకోలేవు. తెలుసుకున్నా అతడి నోటినుంచి నా పేరు చెప్పించలేవు...." అన్నాడతడు.

"చూస్తాను. నా ప్రయత్నం నేను చేస్తాను—" అందీ లత.

"వెస్ట్ వాళ్ళింట్లో శవం చుట్టూ చేరి రోదించడానికో మనిషి తక్కువయ్యారుట...." అంటూ వెటకారంగా నవ్వాడతడు.

# 8

శ్రీవల్లి పక్కిలో కూర్చుంది.

చంద్రశేఖర్ ఆమె కెదురుగా కూర్చున్నాడు.

"ఏరా—అమ్మ నీకిప్పటికి గుర్తొచ్చిందా?" అంది శ్రీవల్లి.

చంద్రశేఖర్ మౌనంగా ఊరుకున్నాడు.

"నేను విల్లు రాశాను. తెలుసా?"

చంద్రశేఖర్ మాట్లాడలేదు.

శ్రీవల్లి అతడికి విల్లులోని విశేషాలు వివరించి చెప్పింది అవి వింటూనే చంద్రశేఖర్ చటుక్కున లేచి నిలబడ్డాడు.

"నేను నీకు బుద్ధి చెప్పాలనే అలా విల్లు రాశాను."

"అమ్మా! నీ వీలునామా నాకు మహోపకారం చేసింది. ఏం చేయాలా అని కొట్టుమిట్టాడిపోతున్న నాకు దారి చూపించింది—" అన్నాడు చంద్రశేఖర్.

"నాకు తెలుసు. నీ నిర్ణయము నాకు తెలుసు. నువ్వు మాధవిని పెళ్ళి చేసుకుందుకు దొరక్కటే మార్గం—...." అంది శ్రీవల్లి.

"లేదమ్మా! ఇప్పుడు నేను నిరభ్యంతరంగా లతను వివాహం చేసుకోవచ్చు...." అన్నాడు చంద్రశేఖర్.

ఆశ్చర్యంగా తన వంక చూస్తున్న శ్రీవల్లితో— "అమ్మా! నేను మాధవిని పెళ్ళిచేసుకుంటే అది ఆస్తి కోసం ఆశపడ్డట్టే అవుతుంది. నీ మాట విన్నానన్న గౌరవం నాకెలాగూ దక్కదు. అలాంటప్పుడు లతను పెళ్ళిచేసుకోవడమే మంచిది. నిన్నగాక మొన్న వచ్చిన మాధవి నీకు నాకంటే ఎక్కువ కావచ్చు. కానీ నాకు నువ్వెప్పుడూ ఎక్కువే! నేను, లత పెళ్ళిచేసుకుంటాం. నువ్వు నీ ఆస్తిని ఇష్టం వచ్చిన వారికి దానంచేసుకుని నా దగ్గరకు వస్తే—నేను, లత నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాం. పెద్ద కోడలు నిన్ను నీ కొడుక్కి దూరం చేసింది. రెండో కోడలి విషయంలో అలా జరక్కూడదనే నేను లతను ఎన్నుకున్నాను. ఆమె ఎంతో మంచిది నీకోసమే ఆమెను నేనెన్నుకున్నాను. నేనిప్పుడు బైటకు వెడుతున్నది ఆమెకోసం అనుకోకు! నీకోసం ఎదురుచూడ్డానికి! నేను కావాలని నువ్వు నా దగ్గరకు వచ్చే రోజుకోసం నే నెదురుచూస్తాను...." అంటూ అతడు వెనక్కి తిరిగాడు.

శ్రీవల్లికి మాటరాలేదు. అతడలాగంటాడని ఆమె అనుకోలేదు. వెళ్ళిపోతున్న చంద్రశేఖర్ని ఆపాలనుకుందామె. కానీ గొంతు సహకరించలేదు.

ఎవరూ ఆపకుండానే చంద్రశేఖర్ నాలుగడుగులు ముందుకువేసి ఆగిపోయాడు.

"నువ్వా?" అన్నమాటలతడినోట అప్రయత్నంగా వచ్చాయి. అతడి మాటలు పూర్తయ్యేసరికి లత అతడికి బాగా దగ్గరగా వచ్చింది.

"నువ్వెప్పుడొచ్చావ్?" అంది లత ఆశ్చర్యంగా.

చంద్రశేఖర్ ఆమెకు బదులివ్వకుండా—"నువ్విక్కడికెందుకొచ్చావు? ఈ యింట్లో నీకు స్థానంలేదని తెలియదూ?" అన్నాడు.

"ఈ యింట్లో స్థానంకోసం రాలేదు నేను. ఈ యింట్లో స్థానమున్న వారి క్షేమం కోరి వచ్చాను...." అంది లత.

చంద్రశేఖర్ ఆమె మాటలనర్థంచేసుకుందుకు ప్రయత్నిస్తూండగానే లత శ్రీవల్లిని సమీపించి జరిగిందంతా చెప్పి—"ఈ యింట్లో మీమీద హత్యాప్రయత్నం జరిగే యేర్పాట్లెలాగయ్యాయో తెలియక — నేను మిమ్మల్ని హెచ్చరించాలని వచ్చాను...." అంది.

శ్రీవల్లికామె చెప్పినదర్థం చేసుకుందుకు కొంత సమయం పట్టింది.

"అంతా అయోమయంగా వుంది నాకు...." అంది శ్రీవల్లి.

"ఇందులో అయోమయమేంలేదు. ఇదంతా ఈ లత, చంద్రశేఖర్లు కలిసి ఆడుతున్న నాటకంలాగుంది...." అంటూ మాధవి అక్కడకు వచ్చింది.

"నువ్వెక్కణ్ణించి వచ్చావ్?" అంది శ్రీవల్లి ఆశ్చర్యంగా.

"మొత్తం సంభాషణంతా తెర చాటునుంచి వింటున్నానత్తయ్యా! బావ స్నేహితుడు నాకు కొన్ని టాబ్లెట్సిచ్చి మంచినీళ్ళలో కలిపి మీకివ్వమన్నాడు. అది

హత్యాప్రయత్నమని నేననుకోలేదు. ఇప్పుడు నేరం నా మీదకు తోసేయాలని వీళ్ళిద్దరూ కూడబలుక్కుని ఇలా వచ్చారు....” అంటూ మాధవి తన అనుభవం వివరించి చెప్పింది.

శ్రీవల్లి అంతా విని—“ఏరా—పెంచినందుకు నా ఋణమిలా తీర్చుకుందామనుకున్నావా? నాకు విషమిచ్చేటంత తప్పు నే నేం చేశాను?” అంది.

చంద్రశేఖర్ కంగారుగా—“నాకేమీ అర్థంకావడం లేదు. అంతా అయోమయంగా ఉంది నాకు........” అన్నాడు.

శ్రీవల్లి మాత్రం ప్రశాంతంగా—“గతంలో ఇలాంటివి జరిగితే నాకు రక్తం మరిగి ఆవేశంపూనకంలా వచ్చేది. ఇప్పుడలాగనిపించడంలేదు. బహుశా చావుకు ముందు ప్రశాంతత కావచ్చునిది....ఇక నువ్వెప్పుడూ నా కంటికి కనిపించకు. వెళ్ళు. ప్రాణంపోయేలోగా నేను చేయగల మంచి పని—నిన్నింట్లోంచి గెంటేయడమే!” అంది.

కాసేపక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

“వెళ్ళిరా—వెళ్ళు—” అంది శ్రీవల్లి.

“మీ అబ్బాయి సంగతి సరే! ఎవరో పరాయి మనిషి వచ్చి బావ పేరు చెప్పి మందిస్తే అదేమిటో తెలుసుకోకుండా ఇచ్చిన మాధవి సంగతేమిటి? ఆమెను తప్పు పట్టరా మీరు! ఆమె మీ గురించి రవంతకూడా బెంగ పెట్టుకోలేదు. మీరు పోతే ఆస్తి తనదనుకుంది. అప్పుడు తను చంద్రశేఖర్ని కాక తన అభీష్టం ప్రకారం వేరే పెళ్ళి కూడా చేసుకోవచ్చు. ఒకవేళ మందు పనిచేసి— అప్పుడూ ఆమెకు నష్టంలేదు....” లత ఇంకా యేదో

అనబోతూండగా మాధవి కళ్ళనీళ్ళతో—"నాకలాంటి ఆలోచనలేం లేవు. నేనీ విషయం యొక్కవ దూరం ఆలోచించలేదు. బావకు సాయపడుతున్నాననుకున్నానంతే!" అంది.

"ఏమో—నేనైతే ఆ సమయంలో అలా ప్రవర్తించే దాన్ని కాదు—" అంది లత.

"మాధవి స్వార్థపరురాలు కావచ్చు. కానీ ఆమె నాకు నచ్చింది...."

కొత్త గొంతు విని అంతా ఆశ్చర్యపడ్డారు. మాధవి అటు చూసి—"అరే—అతడే బావ స్నేహితుడు...." అంది.

శ్రీవల్లి యేదో అనబోగా—"ఒక్క నిముషం.... ముందు నన్ను మాట్లాడనివ్వండి...." అన్నాడతడు.

అతడు చెప్పింది విని అంతా ఆశ్చర్యపడ్డారు.

ఇన్‌ఫ్రాసారిన్, అల్ట్రామైసిన్ కలిసి తీసుకోవడంవల్ల మనిషికి చావు రావచ్చునని విదేశీ పత్రికల్లో రిపోర్టు వచ్చింది. ఆ కారణంగా ఇండియాలో తయారవుతున్న అల్ట్రామైసిన్ మందు కూడా ఉపసంహరించుకోవలని వచ్చింది బజార్లోంచి. చంద్రశేఖర్ స్నేహితుడినని చెప్పుకునే వ్యక్తి పేరు భవన్. అతడికి అల్ట్రామైసిన్ మందుల కంపెనీలో షేర్సున్నాయి. ఈ కంపెనీలో కొందరు విదేశీయులకు కూడా షేర్సున్నాయి. ఆ విదేశీయుల్లో కొందరు నాన్ రెసిడెంట్ ఇండియన్సూ వున్నారు. వారిలో శ్రీవల్లి కొడుకు కూడా వున్నాడు.

భవన్ అల్ట్రామైసిన్ విషయంలో ప్రయోగాలు చేయడానికి అమెరికా వెళ్లాడు. అక్కడ అతడు, శ్రీవల్లి కొడుకు కలిసి కొన్ని ప్రయోగాలు చేసి—

రెండుమందులూ కలియటంవల్ల సత్ఫలితాలే తప్ప వేరేవేవని తేల్చారు. అంతకుపూర్వం వచ్చిన రిపోర్ట్సు కాకతాళీయమని తేలింది. ఇక వీటి గురించిన ప్రయోగం మనుషుల మీద చేయాల్సి వుంది. ఫలితం బాగుంటే—కంపెనీకి కోట్లలో లాభం. ఫలితం రిపోర్టు రూపంలో వస్తే దానికి విదేశాల్లో మంచి గిరాకీ వుంటుంది.

శ్రీవల్లి రెగ్యులర్ గా ఇన్‌ఫ్రాసారిన్ తీసుకుంటున్న పేషంటు. కొడుక్కి మరో మందు సూచించబడినా కూడా ఈ ప్రయోగంకోసం ఇన్‌ఫ్రాసారిన్ క్రమం తప్పకుండా ఆమెకందజేస్తున్నారు. తనకు తానే తల్లికి అల్ట్రామైసిన్ ఇవ్వలేక అందుకు భగవ్‌ని నియమించాడు. ఆ మందుపట్ల మందులషాపుల వైఖరి యెలాగుందో స్వయంగా విచారించి తెలుసుకున్నాక-భగవ్ ఎక్కడా శ్రీవల్లి కొడుకు పేరు రానివ్వకుండా, తాను ఫలానా అని తెలియనివ్వకుండా వ్యవహారం నడిపాడు. అందుకు మాధవి సహకరించింది.

“నేను మీ అబ్బాయిందుకొప్పుకుంటాడనుకోలేదు. కన్నతల్లిమీద ప్రయోగం చేయడం ప్రమాదమని నేనంటే—“నో సెంటిమెంట్స్—కన్నతల్లిమీద ప్రయోగించగలిగినప్పుడే మందుమీద మన నమ్మకం తెలుస్తుంది. మానవాళికి మహత్తర ప్రయోజనంకోసం యే మనిషైనా ఆమాత్రం రిస్కు తీసుకోవాలి. ఇందులో రిస్కేమీ లేదని నాకు తెలుసు—” అన్నాడు. అటువంటి అద్భుతమైన మానవతావాదిని బిడ్డగా పొందిన మీరు ధన్యులు. ఈ ప్రయోగం సత్ఫలితం సాధించింది. మా రిపోర్టు విదేశాలకు వెడుతుంది. మీ అబ్బాయి, మీరు—ప్రపంచ పత్రికలలో మొదటి పేజీలలో అందరికీ కనువిందు చేయ

బోతున్నారు...." అంటూ ముగించాడు భవన్.

శ్రీవల్లి తెల్లబోయి అంతా వింది.

కన్నకొడుకు మానవతా వాదంతో తన్ను గినీపిగ్ లా వాడుకున్నాడు.

కోడల్ని చేసుకోవాలని అభిమానించిన పిల్ల—తన స్వార్థంకోసం—విచక్షణలేకుండా తనపై మందు ప్రయోగించింది.

అటు పెంచిన కొడుకు తనకు అసిస్ఠ వద్దనీ తల్లి చెప్పుదైనా ఆదరిస్తాననీ అంటున్నాడు. తన ప్రాణాలు ప్రమాదంలో వున్నాయని తెలిసి—తను చావడంవల్ల లాభం పొందేదే అయినప్పటికీ కూడా—తన్ను హెచ్చరించడానికి వచ్చింది—తన కోడలుగా వద్దన్నపిల్ల!

ఈ పరిస్థితిలో తనేం చేయాలి?

శ్రీవల్లి ఎక్కువ ఆలోచించలేదు.

మాధవి భవన్ ని చేసుకుందుకూ, చంద్రశేఖర్ అతను చేసుకుందుకూ అంగీకరించడం మాత్రమేకాక—ఆమె వీలునామాను మరోసారి మార్చి రాసింది.

ఆ తర్వాత ఇన్ ఫ్రాసారిన్, అల్ప్రామెసిన్ లు కలపకుండానే ఆమె ప్రశాంతంగా ఉండగలిగింది.

—: ఐ పో యిం ది :—

# అద్దం తిరగని కథ!

## ఎ.యస్. రావ్

సిగరెట్ పీకని గిరాటేసి, చెట్టుకి జార్లా బడ్డాడతను.

సావధానంగా మరో సిగరెట్ వెలిగించాడు.

అతని చూపులు ఆ ఇంటిగేటుమీదే నాటుకుపోయి వున్నాయి. మూడునిమిషాల క్రితమే అతను స్కూటర్ మీద వెళ్ళిపోయి వుండాలి. ఇవాళ ఎందుకో ఆలస్యం చేస్తున్నాడతను. ఇంతకీ ఇవాళ అతను ఇల్లోదిలి ఆఫీసుకి వెళ్తాడా?

అతని ప్రశ్నకి సమాధానం చెప్తున్నట్టు వందగజాల దూరంలో వున్న గేటుగుండా చప్పుడు చేస్తూ బజాజ్ కబ్ ఇవతలికి దూకింది. నల్ల కళ్ళద్దాలు. పెదాలమధ్య ఇరుక్కున్న సిగరెట్. స్కూటర్ కుడివేపుకి తిరిగి వేగం పుంజుకుంది.

వీపుని చెట్టుబోదెకి దూరంగా జరిపాడతను. వేగంగా దూసుకెళ్తున్న స్కూటర్ని చూస్తూ కాసేపు అలాగే చెట్టు పక్కన కట్రాటలా నిలిచిపోయాడతను. స్కూటర్ మరో

మలుపు తిరిగింది. అతను పక్కకి తిరిగాడు. చకచకా అడుగులేస్తూ గేటుని సమీపించాడు. అతని చూపులు వరండావైపు దూసుకెళ్ళాయి. భర్త వీపుమీదే, లేక పోతే మొహంమీదే తలుపుల్ని మూసేసినట్టుందామె.

నవ్వుకుంటూ సిగరెట్ పీకని గిరాటేసి వరండావేపు కదిలాడతను. రెండు క్షణాల్లో అతని చూపుడు వేలు కత్తిలా కాలింగ్ బెల్ స్విచ్చిమీదున్న గంటని గుచ్చింది. చేతినిలాగి, నిటారుగా ఠీవిగా నిలబడ్డాడతను. తలుపు తటాలున లోపలికి జరిగింది.

"ఇవాళ ఏమిటి మరిచిపోయారు?" ప్రశ్నని వరండా మీదికి రువ్వి, తలని ఇవతలికి చాపిన ఆమె కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

"ఎవరు?" అందామె.

పొట్టిగా, లావుగా వున్న ఆమె గుండ్రటి మొహం లోకి అతను చిరునవ్వుతో చూశాడు. చూడీదార్, కమీజ్.

"గంగాప్రసాద్ గారున్నారా?" బజాజ్ మీద పరుగుతీసిన గంగాప్రసాద్‌ని తలుచుకుంటూ అడిగాడతను.

"లేరు ఆఫీసుకెళ్ళారు. మీరు....?"

"పేరు రుద్రభట్. రైటర్ గార్ని ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాను...." అతను ఆగాడు.

"మీది యే పత్రిక?" ఆమె వెంటనే ప్రశ్నించింది ఫుల్ సూటులో వున్న అతన్ని పరిశీలనగా చూస్తూ.

అతను చిన్నగా నవ్వాడు. "మిసెస్ ప్రసాద్.... మీకు అభ్యంతరం లేకపోతే, లోపలికెళ్ళి మాట్లాడుకుందాం...."

ఆమె తటపటాయిస్తూ చూసింది. అతను చిరునవ్వు

నవ్వాడు.

"రావాలంటే మీరు తలుపు బార్లా తెరిచివుంచాలు.
రచయిత భార్యగా మిమ్మల్ని ఇంటర్వ్యూ చేయాలి నేను!"

ఏదో అనుమానం, యేదో ఆశా ఆమె మొహంమీద రోజ్ కలర్, పౌడర్ కోటింగ్‌లా ప్రత్యక్షమయ్యాయి. చిరునవ్వుతో మెరుస్తున్న అతని పళ్ళనీ, కళ్ళనీ ఒకసారి చూసిందామె. ఆమె ఎడమచెయ్యి అప్రయత్నంగా తలుపుని బార్లా తోసింది.

"రండి...." అంటూ ఆమె వెనక్కి తిరిగింది.

అతను ఆమెని వెంబడించాడు. చిన్న హాలు. గోడ వారగా వున్న సోఫాని అతనికి చూపిస్తూ ఆమె కదిలింది. అతను సోఫాలో కూచుని, గదిలోకి వెళుతున్న ఆమెనే రెప్పవేయకుండా చూస్తూండిపోయాడు. వయసుకి మించిన లావుతో ఆమె బుట్టబొమ్మలా వుంది. ఆమె కళ్ళనీ, శరీరాన్నీ గుర్తుచేసుకుంటూ ఆమె తత్వాన్ని బేరీజు వేయడానికి ప్రయత్నిస్తూ అతను సోఫాలో వెనక్కి వాలాడు.

మెత్తటి అడుగుల చప్పుడు అతని ఆలోచనల్ని చెల్లాచెదురు చేసింది. తన ఎదురుగా ప్రత్యక్షమైన ఆమెని రుద్రభట్ చిరునవ్వుతో చూశాడు. ఆకుపచ్చరంగు పువ్వులున్న టర్కీ టవల్ని ఆమె ఛాతీమీద శాలువాలా వేసుకుందిప్పుడు. దృష్టితగలకుండా నా? రుద్రభట్ నవ్వు ఆపుకుంటూ ఆమెకి తెల్లటి పళ్ళు చూపించాడు. ఎదురుగా వున్న సోఫాలో బరువుగా కూచుంటూ ఆమె చిరునవ్వు నవ్వింది.

"చెప్పండి...."

"మిసెస్ ప్రసాద్ ...." రుద్రభట్ ప్రారంభించాడు.

"నా పేరు సునీల ...." ఆమె అడ్డు తగిలింది.

"ఓహ్....అయామ్ సారీ....అండ్ అయామ్ హాపీటు నో యూ మిసెస్ సునీలా....మీ పేరు కొత్తగా, చక్కగా వుంది. సునీలా ఈజే నైస్ నేమ్...."

"థాంక్స్."

"నేను 'భారసం' సంస్థ యాక్టివ్ ప్రెసిడెంట్ని."

"భారసమా?" సునీల కనుబొమలు వంకీలు తిరిగాయి "అంటే ఏమిటి? కొత్త పత్రికా?"

రుద్రభట్ చిన్నగా నవ్వాడు. "నో. పత్రిక కాదు. భా-ర-సం అంటే భారత రచయితల సంక్షేమ సమాఖ్య. మా దేశ్య్రకీతం ఇది ఢిల్లీలో జన్మించింది. కొంతకాలం రచయితగా రాణించిన నేను ఇలాంటి సంస్థ అవసరాన్ని గుర్తించాను. భారసాన్ని స్థాపించాను; ఒంటరిగా. తరవాత, అచిరకాలంలో పి.ఇ.ఎన్, రైటర్స్గిల్డు, రాష్ట్రాల రచయితల సంఘాలూ 'భారసం'తో ఎడతెగని సంబంధాలు పెట్టుకున్నాయి. భారసం పరిధీ, బాధ్యతా విస్తరించాయి. జ్ఞానపీఠ్ అవార్డు పొందినవాళ్ళు, రాష్ట్రస్థాయి బహుమతులు పొందిన రచయితలూ, సాహిత్య అకాడెమీ — కేంద్రం – రాష్ట్రాలూ కూడా-భారసంలో సలహా సభ్యులుగా, కార్యదర్శులుగా కృషి చేస్తున్నారు. భారసం యాక్టివిటీస్ కందదాకా వున్నాయి. అవన్నీ మనకి ఇప్పుడు అనవసరం...." రుద్రభట్ ఆగి ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు.

"గంగాప్రసాద్ గారు స్మోక్ చేస్తారనుకుంటాను. నేను సిగరెట్ కాలిస్తే ఫర్లేదుగా?"

సునీల చిన్నగా నవ్వింది. "కాల్చుకోండి. రాతలో

మునిగిపోతే ఆయన గది కట్టెల పొయ్యి వుండే వంట
గదిలా తయారవుతుంది!"

రుద్రభట్ పకపక నవ్వాడు. సిగరెట్ ముట్టించి ఆమెని నవ్వుతూ చూశాడు. "సునీల గారూ, మీరూ రాస్తారా?"

"ఏం?"

"మీలో చక్కటి భావనాశక్తి వుంది. ఇందాకా మీ ఆయన సిగరెట్స్ ఎక్కువగా కాలుస్తారని డైరెక్టుగా చెప్పకుండా వంటగది ఉపమానంతో అద్భుతంగా చెప్పారు. ఇంతవరకూ రాయకపోతే వెంటనే కాగితాలూ, కలం అందుకోండి!"

సునీల సిగ్గుపడుతూ నవ్వింది. "నేనెక్కడ రాస్తాలెండి! ఆయనకి ఇతివృత్తాలు ఊహించడంతోటే సరిపోతోంది! ఇంతకీ మీరు వచ్చిన పని ...."

"యస్! చెప్తాను: ఎన్నో కార్యక్రమాల్ని ప్రారంభించిన 'భారసం' రచయితల సంక్షేమాల్ని ప్రముఖంగా ఆలోచిస్తోంది. ప్రచురణకర్తలనుండీ న్యాయంగా రావాల్సిన పారితోషికం, రావాల్సిన కాంప్లిమెంటరీ కాపీలు వగైరాల్ని సక్రమంగా రాబట్టడంలో రచయితలకి సహాయం చేస్తుంది. ఇందుకోసం రచయితలు పైసా ఇవ్వక్కర్లేదు...."

"అలాగా?" చందా, సభ్యత్వరుసుం వగైరా వాటికి రుద్రభట్ గాలం వదుల్తున్నాడేమో అని చిటికెలో ఊహించడం ప్రారంభించిన సునీల వెంటనే అంది.

"మరేమనుకున్నారు? కేంద్ర సాహిత్య అకాడెమీ సిఫార్స్ మేరకు ప్రభుత్వం 'భారసం'కి గ్రాంట్స్ మంజూరు చేసింది! అదలా వుంచండి. పారితోషికం,

పుస్తకాల ప్రతులూ—ఇవేకాకుండా రచయితలకి సంబంధించిన మరో ముఖ్యమైన — నన్నడిగితే — అసలైన విషయం గురించి 'భారసం' ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది. అది...."

"ఏమిటది?" రుద్రభట్ మాటల్లో ఇంటరెస్ట్ పుట్టిన సునీల తటాలున ప్రశ్నించింది.

"ఈమధ్యన రచయితల పారితోషికం రేటు కూడా మనదేశంలో గణనీయంగా పెరిగింది. తమ టాలెంట్ ద్వారా సంపాదిస్తున్న పైకాన్ని రచయితలు సద్వినియోగం చేస్తున్నారా, దుర్వినియోగం చేస్తున్నారా అన్న విషయాన్ని పరిశీలించి దుర్వినియోగం జరిగే సందర్భాల్లో భారసం చొరవతీసుకుని, పరిస్థితిని చక్కబెట్టే ప్రయత్నం చేస్తుంది...."

"అంటే?" సునీల కనుబొమలు ముడేస్తూ ప్రశ్నించింది.

"ఉదాహరణకి మీ ఆయన సంగతి తీసుకుందాం. ఉద్యోగరీత్యా ఆయనకి నెలకి రెండువేలా రెండువందల నలభైరూపాయల మొత్తం—కటింగ్స్ పోనూ వస్తోంది."

"మీకెలా తెలుసు?" భర్త జీతాన్ని ఖచ్చితంగా చెప్తున్న రుద్రభట్ ని పెద్దవైన కళ్ళతో చూస్తూ సునీల ఆశ్చర్యంతో ప్రశ్నించింది.

రుద్రభట్ సగర్వంగా నవ్వాడు. "ఇండియాలోని అన్ని భాషల రచయితల, రచయిత్రుల కథలన్నీ సమగ్రమైన నరలల్లాగా మాకు—అంటే, 'భారసం'కి తెలుసు! అవన్నీ తెలుసుకోడానికి మా పద్ధతులు మాకున్నాయి లెండి. తరవాత....గంగాప్రసాద్ గారి నెలసరి ఆదాయం అంత వుంది. రచనల ద్వారా వచ్చే ఆదాయం లేక

పోయినా అయినా, ఆయన కుటుంబం హాయిగా జీవించే అవకాశం వుంది. అంచేత అదనంగా వచ్చే ఆదాయాన్ని ఆయన మరో మంచి పనికి ఉపయోగించాలి. అంటే— మాటవరసకి యేదో నవల ఆయనకి ఏ పదివేలో ఆర్జించి పెట్టిందనుకుందాం. ఆ పదివేలనీ ఒక బంగారం గొలుసుగా మార్చి ఆయన మీ మెడలో అలంకరించవచ్చు!" రుద్రభట్ ఆగి నవ్వుతూ చూశాడు.

సునీల కళ్ళు యెందుకో మెరుస్తున్నాయి. అప్రయత్నంగా ఆమె తలాడించింది.

"సో, మాటవరసకే—మీ ఆయన ఆ పదివేలనీ మీ మెడలో వేయకుండా యే గుర్రప్పందాలమీదో తాగుడు కిందో తగలేశాడనుకుందాం. అప్పుడు ఆయన్ని తగు విధంగా ఎజుకేట్ చేయడానికి ప్రయత్నిస్తాం. ఆ కార్యాన్ని మీద్వారా—మీరు ఆయన జీవిత భాగస్వామి గనక—కొనసాగిస్తాం!" రుద్రభట్ ఆగి, లేచి కిటికీవైపు నడిచాడు. సిగరెట్ పీకని ఇవతలికి విసిరి, ఆమెవైపు తిరిగాడు. అర్థంకాని ఉద్రేకంతో ఆమె అతన్నే చూస్తోంది. రుద్రభట్ నవ్వుతూ సోఫావైపు నడిచాడు. కూచుని ఆమెని సూటిగా చూశాడు.

"మిసెస్ సునీలా, మిమ్మల్నీ, మీ ఆయన్నీ ఇంటర్వ్యూ చేయడానికి వచ్చానన్నాను. ఎందుకో మీరు అడగలేదు!"

"ఔ....ను...." సునీల సందేహిస్తూ అంది.

"మా సంస్థ సేకరించిన సమాచారం ప్రకారం గత దీపావళి సందర్భంలో మీ ఆయన రాసిన నవల 'గాలిలో ఈల'కి పదివేల రూపాయల ప్రథమ బహుమతి వచ్చింది. అత్యధికంగా అమ్ముడై పోతున్న ఒకానొక వారపత్రిక

ఆ నవలని ధారావాహికంగా ప్రచురించింది. ఆ పదివేల రూపాయలూ మీ మెడలో వాలలేదని కూడా మాకు తెలుసు!" రుద్రభట్ ఆగి, ఆమె వైపు నవ్వుతూ చూశాడు.

సునీల సోఫాలో వెనక్కి వాలింది. "మీకు... ఇంకా ఏం తెలుసు?" అప్రయత్నంగా ప్రశ్నించిందామె.

"మీ ఆయనకి గుర్రప్పందాల పిచ్చి లేదని తెలుసు. ఆయనకి తాగుడు అలవాటులేదని తెలుసు. పేకాట లాంటి జూదాలు అలవాటు లేదని తెలుసు. మీరు తప్ప మరో స్త్రీకి ఆయన హృదయంలో స్థానంలేదని తెలుసు. అయితే ఆ పదివేలూ ఏమయ్యాయి? ఇదే మాకు తెలీదు!" రుద్రభట్ నవ్వుతూ అడిగాడు.

సునీల అతన్ని కాసేపు మౌనంగా చూస్తూ వుండిపోయింది. మెల్లిగా ఆమె లిప్‌స్టిక్ పెదవులు కదిలాయి "తెలీని ఇలాంటి విషయాల గురించి మీ సంస్థ ఎందుకింత తాపత్రయపడుతోంది?"

తన ఉపోద్ఘాతాన్ని అప్పుడే మరిచిపోయిన ఆమెని రుద్రభట్ సానుభూతితో చూశాడు. "ఒకే ఒక ముక్కలో మీ సందేహానికి సమాధానం చెప్తాను: మీ భర్తలాంటి రచయితలు పాఠకుల్ని, సమాజాన్ని ఎడ్యుకేట్ చేయడానికి ప్రయత్నిస్తున్నారు. సంస్థ తరఫున నేను రచయితల్ని ఎడ్యుకేట్ చేయడానికి ప్రయత్నిస్తున్నాను!"

సునీల చిన్నగా నిట్టూర్చింది. "మీరు సాయంత్రం రండి. ఆయనతో మాట్లాడండి. ఎందుకంటే మీరు అడగబోయే ప్రశ్నలకి నేను సమాధానాలు చెప్పలేను."

"చెప్పగలరు!" రుద్రభట్ బల్లగుద్దినట్టు అన్నాడు.

"అలా ఎందుకనుకుంటారు?"

"అనుకోడం కాదు; అంటున్నాను!" రుద్రభట్ సగర్వంగా అన్నాడు. "ఎందుకంటే, మీలాంటి చదువుకున్న స్త్రీలు, రచయితల భర్తలకి—ప్లాట్లు అందించే-కలం పట్టని రచయిత్రులు—నిజం చెప్పడానికి వెనకాడరు!"

సునీల అర్థంకానట్టు చూసింది. ఆమె నోరు పెగుల్చుకునేలోగా రుద్రభట్ ప్రారంభించాడు.

"సునీలగారూ, ఇందాకా, ఆ పదివేలూ యేమయ్యాయో తెలీదని ఊరికే అన్నాను. ఆ పదివేలూ యేమయ్యాయో నాకు తెలుసు. మీకూ తెలుసని నాకు తెలుసు...."

"ఏమయ్యాయి?" సునీల సవాలు రువ్వినట్టు అంది.

రుద్రభట్ చిన్నగా నవ్వాడు. "మిసెస్ సునీలా, ఆ పదివేలూ మీకు అంటే, మీ ఆయన చేతికి రాలేదు!"

సునీల ఉలిక్కిపడింది. "మీరు.... మీకు...."

"కంగారుపడకండి!" రుద్రభట్ చిన్నగా నవ్వుతూ అన్నాడు. "రచయితల్ని గురించి పరిశోధించినట్టే, మా సంస్థకోసం దేశంలోని పత్రికల్నీ, ప్రచురణ సంస్థల్నీ నేను క్షుణ్ణంగా పరిశోధించాను. ఆ పదివేలూ వదులుకోడంవల్లనే మీ ఆయన నవలకి ప్రథమ బహుమతి వచ్చింది! వదులుకోడంవల్లే అది సీరియల్ అయ్యింది!"

సునీల నివ్వెరపోతూ చూసింది. రుద్రభట్ చిరునవ్వు నవ్వుతూ ఆమెకి ధైర్యం చెప్తున్నట్టు చూశాడు.

"ఆ షరతుకి అంగీకరించకపోయివుంటే మరో రచయిత రాసిన మరో నవలకి,—ఏ 'నేలమీద ఊత'కో

ఆ బహుమతి వచ్చి వుండేది!"

"ఇదంతా మీ కెవరు చెప్పారు?" సునీల వణికే కంఠంతో ప్రశ్నించింది.

"ఆ విషయం మరిచిపొండి!" రుద్రభట్ నవ్వాడు.

"మీకో సంగతి చెప్తాను. అమెరికాలో ప్రెస్ సిండికేట్స్ వున్నాయి. వాటి ద్వారా తప్ప లేకానీ, యే రచయిత నవలనీ, కధనీ—ఎవరూ ప్రచురించరు. యేజెంట్‌లా వ్యవహరించే ప్రెస్ సిండికేట్ సిఫార్స్ చేస్తేగానీ రచనలు పరిశీలించబడవు. పరిశీలన జరిగి ప్రచురించబడ్డాక రచయితకి వచ్చే పారితోషికంలో నాలుగు శాతం సిండికేట్ తీసుకుంటుంది. సిండికేట్ మూలంగా అక్కడ రచయితలకి యెంతో మేలు జరుగుతోంది. పారితోషికం గల్లంతు కాదు. ఆ వ్యవస్థ ఇక్కడ లేదు. పూర్తిగా ప్రచురణ కర్త దయా-ధర్మాలమీద రచయిత ఆధారపడి వున్నాడు. అంచేత 'భారసం' చొరవ తీసుకుంటుంది...."

"ఎలా?"

"మీ ఆయన సంగతే తీసుకోండి. పారితోషికానికి పావలా నువ్వులు వదిలేసి ఆయన నవలని ఇచ్చేసు కున్నారు. పత్రిక అచ్చేసుకుంది. ఆయన అలా చేయడానికి కారణం మీకు తెలుసు. ఆయన అంగీకరిస్తే, అసలు సంగతిని రాతమూలకంగా, రహస్యంగా మాకు అందజేస్తే 'భారసం' తగిన చర్య తీసుకుంటుంది. మీ ఆయన పరువూ, పత్రిక పరువూ పాడవకుండా మధ్యే మార్గంలో వ్యవహారం నడిపి, గుట్టుచప్పుడు కాకుండా పది వేల పారితోషికాన్ని ఇప్పిస్తుంది. అందుకు ప్రతిఫలంగా రెండు శాతం అంటే కేవలం రెండువందలు స్వీక

ేస్తుంది. అంతే!" రుద్రభట్ నవ్వుతూ అన్నాడు.

సునీల మౌనంగా వుండిపోయింది. ఆమె కళ్ళల్లో యేదో ఆశా, యేదో అనుమానం దోబూచులాడుతున్నాయి.

"జరిగిందాన్ని బైట పెడితే ఆ పత్రిక భవిష్యత్తులో మీవారి రచనల్ని వేసుకుంటుందో, లేదో అని మీరు ఆలోచిస్తున్నారు. అగ్రిమెంట్ సీరియల్ అయిపోయాక మీవారు రాసి పంపిన రెండో నవలని ఆ పత్రిక తిప్పి పంపిందనీ మాకు తెలుసు!" రుద్రభట్ నవ్వుతూ అన్నాడు.

సునీల ఆశ్చర్యాన్ని ఆమె పెద్ద కళ్ళు చక్రాగా వ్యక్తం చేశాయి. "అయితే.... మీకు...."

"అంతా తెలుసని ఇందాకే చెప్పాను. ఈ సందర్భంలో మీతో సత్యం చెప్తాను. రచన ఆధారంతో కాకుండా మరో ఆధారంతో రచయితగా పరిచయం అయిన వ్యక్తి అట్టేకాలం నిలబడ్డం జరగదు. మీవారి నవలని ఆ పత్రిక బ్రహ్మాండంగా పైకెత్తేసి, హైక్లాస్ పబ్లిసిటీ ఇచ్చి ప్రచురించింది. దాని మూలంగా దాన్ని పుస్తకంగా వేసే పబ్లిషర్ బుట్టలో పడ్డాడే తప్ప, మరో పబ్లిషర్ కానీ, పత్రికగానీ ఆయన్ని రచనలు అడగలేదు!"

"అలా ఎందుకు జరిగిందంటారు?" సునీల చివరకు ప్రశ్నించింది.

"అమ్మాయి చాలా బావుందని ఆమె తల్లిదండ్రులూ, మధ్యవర్తీ, చివరికి పెళ్ళిచేసే పురోహితుడూ యేక కంఠంతో మొత్తుకోవచ్చు. చేసుకునే వాడికి నచ్చాలిగా? నవల బావుందని సంపాదకుడు పాఠకుల్ని

బ్రెయిన్ వాష్ చేయొచ్చు. పాఠకులకి అలా అనిపించాలిగా?" రుద్రభట్ వివరిస్తూ మరో సిగరెట్ వెలిగించాడు.

"రుద్రభట్ గారూ.. ఇంతకీ నన్నేం చేయమంటారు?" అంతా అగమ్యగోచరంగా అనిపిస్తున్న సునీల అడిగింది.

"మీ వారు మీ మాటకి గౌరవం ఇస్తారని మాకు తెలుసు. మీతో అన్నదంతా నేను స్వయంగా ఆయనతో అంటే ఆయన అఫెండవుతారు. మీరే చెప్పండి, ధర్మంగా తనకి రావాల్సిన బహుమతి మొత్తాన్ని న్యాయంగా రాబట్టుకొమ్మనండి. తనకి న్యాయం చేసుకోలేని వ్యక్తి మరొకరికి, లోకానికి న్యాయంచేసే హీరోల్ని సృష్టిస్తూ రచనలు చేయడానికి అర్హుడు కాడని చెప్పండి!"

సునీల చిన్నగా నవ్వింది. "ఇవే అక్షరాలు కాకపోయినా, ఇదే అర్థాన్ని వ్యక్తంచేస్తూ అప్పట్లో నేనూ ఆయనతో ఇలాగే అన్నాను...."

"అందుకే మొదట మిమ్మల్ని కల్సుకున్నాను. ఆ పదివేలూ మగాడైన మీ ఆయనకి మరీ గొప్ప మొత్తం అనిపించకపోవచ్చు. గృహిణిగా డబ్బు విలువ మీకు తెలుసు. మా సంస్థ సహాయంతో దాన్ని వసూలు చేసుకోండి!" రుద్రభట్ ఆరితేరిన ఎల్ఐసీ యేజెంట్‌లా అన్నాడు.

సునీల సాలోచనగా తన ఎర్రటి గోళ్ళని కాసేపు చూసుకుంది. రెప్పలెత్తి రుద్రభట్టువేపు చూసింది. "మీరు చెప్పిందంతా నాకు బాగా నచ్చింది. కానీ ఆయనకి నచ్చుతుందో లేదో నాకు తెలీదు. ఆయనకి ఫోన్ చేస్తాను. ఆఫీసుకి శెలవుపెట్టి అరగంటలో రమ్మం

టాను. మీరూ నేనూ ఇద్దరం ఆయనతో చర్చిద్దాం...."

"గుడ్ ఐడియా!" రుద్రభట్టు నవ్వుతూ అన్నాడు. "మిసెస్ సునీలా, అప్పుడే చెప్పాను. మీరు రచయిత్రిగా బాగా రాణిస్తారు. ఆ 'కోనపల్లి కోకిల'ను చూడండి. ఎడా పెడా ఎలా రాసేస్తోందో!"

పైకి లేవబోతున్న సునీల మళ్ళా సోఫాలోకి వాలింది. "హుం! కోకిల కథలు ఎడా పెడా పబ్లిష్ అవుతున్నాయి. ఆమె రచనలు చదువుతూంటే, ఆమెకంటే నేనే బాగా రాయగలననిపిస్తుంది! పత్రికలు, ముఖ్యంగా ఆ వార పత్రిక ఆమె రచనల్ని పర్మినెంటుగా వేస్తోంది. ఎందుకా అని ఆలోచించాను. తరవాత.... తెలిసింది...."

"ఏమిటది?" రుద్రభట్టు ప్రశ్నించాడు.

సునీల కళ్ళతో నవ్వింది. "కోకిల.... ఆ పత్రిక ఎడిటరూ.... అయినా మనకెందుకులెండి...."

రుద్రభట్టు అర్థమైనట్టు నవ్వాడు. "ఆమె విజృంభించాక మీ ఆయన సీరియల్స్‌కి ఆ పత్రికలో అవకాశం లేకుండా పోయింది! అది కూడా మా సంస్థకి తెలుసు!"

"అలాగా!"

"ఇలాంటి దౌర్భాగ్యస్థితి మారాలి. దేశమంతా వున్న టాలెంట్ దేశానికంతికీ అందాలి. పేరుకోసం ఉచితంగా రచనలు సప్లై చేసే వాళ్ళవల్ల నిజమైన రచయితలు భూస్థాపితం అయిపోతున్నాడు. వ్యక్తిగతమైన లాభాల్ని ముఖ్యంగా చూసుకునే వ్యక్తుల పిడికిలినుండీ పత్రికలు విముక్తి చెందాలి! మీవారికి చెప్పండి. తనకి జరిగిన అన్యాయాన్ని వివరిస్తూ 'భారసం'కి రాసివ్వమనండి!" రుద్రభట్టు ఉద్రేకంతో అన్నాడు.

"ఆయన్ని రమ్మంటాను. ఈలోగా మీకు టీ తెస్తాను" సునీల లేచి, వంటగదివేపు నడిచింది.

రుద్రభట్టు వెనక్కి వాలి సిగరెట్ వెలిగించాడు.

## 2

అతను మంచంమీద వెల్లకిలా పడుకున్నాడు. ఏవో ఆలోచనలు అతని బుర్రలో మోసులెత్తి, మెలికలై తీగలుగా సాగుతున్నాయి. పడుకునే సిగరెట్ వెలిగించి, సీలింగ్ వైపు రింగులా వదిలాడతను.

చిన్న చప్పుడుతో తలుపు తెరుచుకుంది. అతని ఆలోచనల తీగలన్నీ ఒక్కసారిగా తెగిపోయాయి. అతను పక్కకి తిరిగాడు.

ఆమె గుమ్మంలో నిలబడింది. లేతగులాబిరంగు గార్డెన్ సిల్కు చీర. అదే రంగు స్లీవ్ లెస్ జాకెట్. భుజాలమీద గమ్మత్తుగా కదుల్తున్న బాబ్డ్ హెయిర్. పట్టుకుచ్చు లాంటి శిరోజాల ఫ్రేమ్ మధ్య అందంగా ఇరుక్కున్న కోల మొహం. మూసిన తలుపుకి జార్లాబడి ఆమె బరువుగా, పొడుగ్గా నిట్టూర్చింది. కెరటంలా కదుల్తున్న గులాబిరంగు పైటని అతను చిరునవ్వుతో చూశాడు.

ఆమె మెల్లిగా కదిలింది. ఆమె నడకలో, మొహంలో అలసట స్పష్టంగా అవుపిస్తోంది. అలసట ఆమె అందాన్ని అద్భుతంగా హెచ్చు చేస్తోంది. అతని దగ్గరగా మంచంమీద చతికిలబడి ఆమె మళ్ళీ బరువుగా నిట్టూర్చింది.

"బరువు మోసినట్టు అపసోపాలు పడుతున్నావ్!" అన్నాడతను నవ్వుతూ.

"యూ కెన్ సే ఇట్ ఎగైన్! ఇకనుంచీ యే పని మీద యెవర్ని కల్సుకోమన్నా సంతోషంగా వెళ్తాను.

అయితే ఇవాళ ఇంటర్వ్యూ చేయడానికి నన్ను పంపించిన 'జాతి దగ్గరకు మాత్రం ఛస్తే వెళ్ళను!" అందామె అతన్ని అదోలా చూస్తూ.

"ఏం?"

"నేన్నీకు ఏం అపకారం చేశాను? ఎందుకీ శిక్ష విధించావ్?" ఆమె సీరియస్‌గా అడిగింది.

"ఏం?"

"రాజకీయ నాయకుల్ని ఇంటర్వ్యూ చేస్తాను. జైళ్ళలో కూచున్న దొంగల్ని, ఖూనీ కోర్లనీ ఇంటర్వ్యూ చేస్తాను. చివరికి, సైకియాట్రిస్టులనీ ఎల్ఐసీ ఏజెంట్లనీ ఇంటర్వ్యూ చేస్తాను; అవసరమైతే! కానీ.... రచయితల్ని — బాబోయ్ — జన్మలో ఇంటర్వ్యూ చేయను!"

ఆమె మొహంలోని కంగారుని అతను నవ్వుతూ చూశాడు.

"ఏం?"

"ఆ అక్షరం తప్ప మరో ముక్క నీ నోటమ్మట రావడంలేదు! మహానుభావుడు చంపేశాడు! తన రచనల లిస్టు అడిగాడు. గుర్తులేదంటే తనే వల్లించాడు; ఒక్కో పేరుని రెండేసి, మూడేసిసార్లు చెప్తూ. ఈ మధ్యే ప్రారంభించిన గేయాలు వినిపించాడు. రాస్తున్న నవలలో రెండున్నర చాప్టర్లు.... మై గాడ్.... నజ్జునజ్జు చేసేశాడు...."

"తరవాత?" అతను నవ్వుతూ అడిగాడు.

"ఇవాళంతా అక్కడే వుంటే ఎక్స్‌క్లూజివ్ ఇంటర్వ్యూ ఇస్తానన్నాడు. భార్య పుట్టింటికెళ్ళిందట. ఇంటర్వ్యూకి అంతరాయం కలగదన్నాడు.... బాస్టర్డ్."

అతను పకపక నవ్వాడు. "ఇంతకీ...."

"ఇంతా చెప్పి, పబ్లిష్ అయిన రెండు నవలలు ఇచ్చాడు. మోసి మోసీ అలిసిపోయాను. అందుకే బరువు మోసినట్టు నీకు అవుపించాను. అలసట యెక్కువయ్యేసరికి రోడ్లో అవుపించిన పీచుమిఠాయి బండి వాడికి ఇచ్చేశాను. పీచుమిఠాయి తిని చాలా యేళ్ళయింది!" ఆమె నవ్వుతూ ఆపింది.

"ఇంతకీ...."

వ్యానిటీ బ్యాగ్ లోంచీ తీసిన ఒక కాగితాన్ని ఆమె అతని పక్కనే గిరాటేసింది. "ఎంతో ప్రయత్నించి, ఎన్నో పాట్లుపడి, గురుడికి బ్రెయిన్ వాష్ చేసి రాబట్టాను!"

"కంగ్రాట్స్!" కాగితాన్ని పరిశీలిస్తూ అతను అన్నాడు. "గుడ్ రిసీవర్ అందుకో. రసగుల్లా, మసాలా, స్ట్రాంగ్ టీ ఆర్డరిచ్చేయ్. అవన్నీ వచ్చేలోగా స్నానం చెయ్. తరవాతి నవల డిక్టేట్ చేస్తాను, రాద్దువుగానీ...."

ఆమె కంగారుగా చూసింది. "నవలా? నువ్వా?"

"వై నాట్? నలుగైదుగురు రచయితల్ని ఇంటర్వ్యూ చేశాక, నాక్కూడా ఆ తీట పట్టుకుంది. రేపు స్వయంగా వెళ్ళి సంపాదకరావుగార్ని కల్సుకుంటాను. సీరియల్ గా వేయడానికి కొనుక్కుంటాడేమో కనుక్కుంటాను!"

## 3

తలుపు తోసుకుని అతను హాల్లోకి చూశాడు. రెండు వేపులా వరసలుగా వున్న టేబుల్స్ వెనక దాదాపు ఇరవైమందిదాకా కూచున్నారు. కొందరు రాస్తున్నారు; కొందరు చదువుతున్నారు. తలుపు దగ్గరగా నిలబడి

అతను అందర్నీ కలయజూశాడు. ఒక మూలగా అంగుళం పొడవు పెరిగిన గడ్డంతో రిమ్‌లెస్ కళ్ళద్దాల్లో వున్న వ్యక్తి కుర్చీ వెనక్కి నిలిగి తను రాసిందాన్నో, గీసిందాన్నో పెదాలు బిగించి చూస్తున్నాడు.

అతని ముందు స్టూలుమీద కూచున్న స్త్రీ కాగా ముందుకి వొంగి, అతని ముందున్న కాగితాన్ని చూడ్డానికి ప్రయత్నిస్తోంది. టేబుల్ మీదున్న సరంజామా అతన్ని ఆర్టిస్టుగా పరిచయం చేస్తున్నాయి. ఎదురుగా కూచున్నామె బొమ్మ వేస్తున్నాడా అతను?

నవ్వుకుంటూ అతను కదలబోయాడు. స్టూలుమీద కూచున్నామె పైకి లేచి, ఆర్టిస్టువేపు కదిలింది. అతని పక్కనే నిలబడి, ముందుకి వంగి డ్రాయింగ్ పేపర్ మీదున్న బొమ్మని పరిశీలనగా చూసింది.

“అంతా బావుంది. అయితే, ఈ సన్నివేశంలో, కథలో ఈ అమ్మాయికి పైటలేదు! పైటెందుకు వేశారు?” ఆమె ఆర్టిస్టుని ప్రశ్నించింది.

టేబుల్ మీదకి చేతులు ఆన్చి తొలిగిన ఆమె పైట యెప్పుడో కిందికి జారింది. ఆర్టిస్టు పక్కవాటంగా ఆమెని మాస్తూ చూపులు తిప్పుకోడానికి యమ ప్రయత్నం చేస్తున్నాడు.

తలుపు దగ్గర నుంచున్న అతను పూర్తిగా వాళ్ళిద్దరివైపూ తిరిగాడు.

“పైట అక్కర్లేదన్నట్టు నా ఇన్‌స్ట్రక్షన్స్‌లో సబ్ ఎడిటర్ రాయలేదు. మీరు కిరణ్‌ని అడగండి....”

ఆమె నిటారుగా నుంచుంది. జారిపోయిన పైటని గుర్తించి, విసుగ్గా సర్దుకుంది.

“లాస్టు వీక్ కూడా మీరు బొమ్మ సరిగ్గా వేయ

లేదు. ఈ నవల్లో హీరోయిన్ ధరించే దుస్తులమీద నేను యెంతో రీసెర్చ్ చేశాను. ఆమె ధరించే దుస్తుల ఆధారంగా ఆమె తత్వాన్ని హీరోద్వారా అంచనా వేయించాను. ఎడిటర్ గారికి చెప్పారు. మొత్తం స్క్రిప్టు మీరోసారి చదవండి. ప్రస్తుతం ఆ పైటని చెరిపేయండి" అంటూ ఆమె జోరుగా వెనక్కి తిరిగి, ఎదురుగా వున్న ఎడిటర్ గదివేపు నడిచింది.

అతను కదిలాడు. ఆమె ఫోటోని తను అడపాదడపా చూశాడు. అయినా పేరు గుర్తు రావడంలేదు. ఆమె రచయిత్రి అనీ, ఆమె సీరియల్ ప్రస్తుతం పత్రిక పాఠకుల్ని వారం వారం ఉత్కంఠలో ముంచెత్తేస్తోందనీ ఇందాకటి సీను చెప్తోంది.

ఇంతసేపూ ఆమెనే చూస్తున్న చాలా కళ్ళు ఇప్పుడు తనమీద పడినట్టు అతను గుర్తించాడు.

"ఏంటి గురూ, కోకిల కావు కావు కావుమంటోంది?" ఆర్టిస్టుకి దగ్గరగా కూచున్న టైపిస్టు తగ్గు స్వరంతో అడిగాడు నవ్వుతూ.

"పైట తీసేయమంటోంది...." నాలుక ఇవతలికి చాపి బ్రష్‌తో తంటాలుపడుతున్న ఆర్టిస్టు మెల్లిగా అన్నాడు.

"ఎవరిది? కొంపతీసి...."

ఆర్టిస్టు తలెత్తి టైపిస్టుని నవ్వుతూ చూశాడు. ఇద్దరూ చిన్నగా నవ్వుకుంటున్నారు.

కోకిల....యస్ కోనపల్లి కోకిల....ఆంధ్రదేశాన్ని ఉప్పెనలా చుట్టేసి పాఠకులను గంగవెర్రులెత్తిం చేస్తున్న రచయిత్రి! అతను 'ఎడిటర్' బోర్డున్న మూసిన గుమ్మం ముందుకి జరిగాడు.

"ఎవరు?" ఎడంవైపునుంచీ ఒక కంఠం విసుగ్గా ప్రశ్నించింది.

అతను తలతిప్పి చూశాడు. టేబుల్ వెనక కూచున్న యువకుడు విసుగ్గా చూస్తున్నాడు.

"ఎవరు?" అతను ఎదురు ప్రశ్న వేశాడు.

యువకుడు ఫుల్ సూట్‌లో వున్న వ్యక్తిని ఎగాదిగా చూశాడు.

"మీరు 'ఎవరు?' మీకు 'ఎవరు' కావాలి?" యువకుడు అక్షరాల్ని ఎగతాళిగా నొక్కాడు. అతని పక్కనే కూచున్న సబ్ ఎడిటర్లు చదువుతున్న కథల్ని మరిచిపోయి కిసుక్కున నవ్వారు.

సూటు వ్యక్తి అతని ముందుకి కదిలాడు. కళ్ళని కప్పిన నల్ల కళ్ళద్దాల్ని తీసేశాడు. రత్నాల్లాంటి కళ్ళతో యువకుణ్ని తీక్షణంగా చూశాడు.

"నువ్వెవరు? రిసెప్షనిస్టువా? సబ్ ఎడిటర్ అనుకున్నా...."

ఏకవచనం యువకుడి మొహానికి ఆగ్రహాన్ని పూసింది.

"వాట్ నాన్సెన్స్.... అనుమతి లేకుండా లోపలికి వెళ్టానికి వీల్లేదు!"

"అనుమతి ఇచ్చే అధికారి ఎవరు?"

"జీ జీ!"

"అలాగా! ఇందాకా ఒక స్త్రీ నిన్ను పూర్తిగా నిర్లక్ష్యం చేస్తూ మహారాణీలా అంతఃపురంలోకి వెళ్ళింది! ఆమెకి కొమ్ములున్నాయా?"

యువకుడు ఉక్రోషంతో చూశాడు. "దటీస్ నన్నాఫ్ యువర్ బిజినెస్! ఇంతకీ మిమ్మల్ని లోపలికి ఎవరు రానిచ్చారు?"

అతను చేతిలోని ఫోల్డర్ని టేబుల్ మీద పెట్టాడు. రెండు చేతుల్నీ టేబుల్ మీద ఆన్చాడు. ముందుకు వంగి ఇంకా కూచునే వున్న యువకుడి మొహంలోకి తదేకంగా చూశాడు.

"నీ టేబుల్ మీదున్న దొంతర్లని చూస్తుంటే తిప్పి పంపే కథల్ని చదివినంత పంకేసే సబ్ ఎడిటర్వి అని అర్థమవుతోంది. గుమ్మం ముందు కాపలా వుండే గులామ్ పని కూడా చేస్తున్నావా? నన్ను ఆటకాయించాలంటే వెళ్ళి నీ ఎడిటర్ గుమ్మంముందు యూనిఫామ్‌లో నిలబడు!"

యువకుడు ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. తోటి ఉద్యోగులంతా పనులు మానేసి తన ముందు జరిగే నాటకాన్ని చూస్తున్నారని అతను గ్రహించాడు.

"షటప్!" యువకుడు పైకిలేస్తూ గర్జించాడు. "రమణయ్య యెక్కడ చచ్చాడు?" పక్కకి తిరిగి అరిచాడు.

"ఓహో! రమణయ్య పని నువ్వు చూస్తున్నావా? మిస్టర్ వెనకటికి చాకలి ఇంట్లో మూటలు మోసిన గాడిద కుక్క చేయాల్సిన పనిచేసి నడ్డి విరగ్గొట్టించుకున్న కథ గుర్తుందా?" అతను నవ్వుతూ అడిగాడు.

యువకుడు ఉక్కిరిబిక్కిరవుతూ గుడ్లురిమి చూసే ప్రయత్నం చేశాడు. అతను తేరుకునేలోగా నలుగురు సబ్ ఎడిటర్లు టేబుల్ దగ్గరకు చేరుకున్నారు.

"ఏమిటండీ గొడవ?" అద్దాలేసుకున్న సీనియర్ సబ్ ఎడిటర్ ప్రశ్నించాడు.

సూట్ వ్యక్తి అతన్ని చిరునవ్వులో చూశాడు. "గొడవా? ఏం లేదే! ఉందంటే మా మిత్రుడు

చెప్పాలి!"

"ఇంతకీ మీరెవరు? ఏం కావాలి?"

"నేనెవరో చెప్పినా మీ కర్ణాలకీ అర్థంకాదు. ఇంక నాకు మీ గురువు—సంపాదకరావు కావాలి!"

"ఓహ్....ఎడిటర్ గారా? ఆయన సంగీతరావుగారు."

"అతని పేరు యేదైనా నాకు అభ్యంతరంలేదు. అతను తక్షణం నన్ను చూడాలి!"

"ముందు మీరు ముందు గదిలో కూచోండి. ఎడిటర్ గారితో పనేమిటో చెప్పండి. ఆయనకి చెప్తాం. ఆయన అపాయింట్ మెంట్ ఇస్తే, చూడండి...."

"అనుకున్నప్పుడు, అనుకున్న వ్యక్తిని చూడ్డం నా అలవాటు. అపాయింట్ మెంటిచ్చేదాకా ఆగే అలవాటు నా రక్తంలో లేదు!" అతను నవ్వుతూ అన్నాడు.

"అది కుదరదు. మీ అలవాటు మార్చుకోవాలి. అదీగాక లోపల ఆయనతో యెవరో వున్నారు. ఒకరితో వుండగా మరొకర్ని ఆయన ఎంటర్ టైన్ చేయరు...." సీనియర్ సబ్ ఎడిటర్ హుందాగా చెప్పుకుపో తున్నాడు.

"ఓహ్....గూటిలో కోకిల వున్నప్పుడు మరో పక్షి, మరో మానవుడు వెళ్ళగూడదా? చెప్పరేం?" అంటూ అతను ఫోల్డర్ అందుకుని ఎడిటర్ గది గుమ్మంవేపు తిరి గాడు. మూసిన గుమ్మంముందు ఆగి వెనక్కి తిరిగి, గుంపుగా నిలబడ్డ నలుగుర్ని చిరునవ్వుతో చూశాడు.

"కాకి గూడులోకి ప్రవేశించిన కోకిల గుడ్డుపెట్టే దాకా తిరిగిరాదు! మనం చప్పుడుచేసి రప్పించాలి!" అంటూ అతను తలుపుమీద చేత్తో దబదబ బాదాడు.

నలుగురూ కంగారుగా మొహాలు చూసుకోడం అతనికి

నవ్వు తెప్పించింది. అతని చెయ్యి డోర్ హాండిల్ని పట్టుకని నిర్లక్ష్యంగా తిప్పింది. తలుపుని బలంగా తోస్తూ అతను లోపలికి దూరాడు. తలుపుని వదిలేసి, స్తంభంలా నిలబడ్డాడు.

అఖిలాంధ్ర పాఠకుల్ని వారం వారం అదరగొట్టేస్తూ, అత్యధికంగా అమ్ముడైపోతున్న 'హారతి' పత్రిక సంపాదకుడు సంగీతరావు తన కుర్చీలో లేడు. తన టేబుల్ ముందున్న కుషన్డ్ కుర్చీలో మెత్తగా, వొత్తుగా వాలి కూచున్న కోకిల దగ్గరగా, టేబుల్కి ఆని నించున్నాడు. అంతసేపూ ఎటో తిరిగి వున్న వాళ్ళ తలలు గుమ్మంవైపు తిరిగి వున్నాయి. ఆమె మొహంలో కంగారూ, విసుగూ, అతని మొహంలో ఆగ్రహం వ్యక్తమవుతున్నాయి.

"హూ ఈజ్ దట్? గెటౌట్!" ఎడిటర్ సంగీతరావు గర్జించాడు.

అతను చిరునవ్వుతో సంగీతరావుని చూస్తూ వుండిపోయాడు. లావుగా, పొట్టిగా వున్న ఆకారం. గుండ్రటి మొహం. వెనక్కి అణగదువ్విన క్రాపుని మధ్యపాపిడి రెండుగా చీలుస్తోంది. అధికారం, గర్వం రెండూ అతని కళ్ళకి తగిలించిన అద్దాల్లా వున్నాయి.

"మీతో కొంచెం మాట్లాడాలి...." గుమ్మం దగ్గర్నుంచీ కదల్తూ అన్నాడతను.

"మొదట బైటికెళ్ళి, వెయిట్ చేయండి. విజిటింగ్ కార్డు పంపించండి. ఎప్పుడు లోపలికి రావొచ్చో తెలియజేయబడుతుంది. అప్పుడు రండి. ఆ 'కొంచెం' యేదో మాట్లాడండి!" సంగీతరావు విసుగ్గా, ఎగతాళిగా అన్నాడు.

అతను వాళ్ళిద్దరికీ దగ్గరగా ఆగాడు. నవ్వుతూ కోకిల

వేపు చూశాడు. చూపుల్ని సంగీతరావువైపు తిప్పాడు.

"విజిటింగ్ కార్డూ, అపాయింట్ మెంటూ వగైరా గొడవలేం లేకుండా ఈవిడ లోపలికి వచ్చిందిగా?"

"నాన్ సెన్స్! దటీస్ నన్నాఫ్ యువర్ బిజినెస్! గెటౌట్!" సంగీతరావు అరిచాడు.

"ఐ థింక్ ఎవ్విరి థింగ్ ఈజ్ మై బిజినెస్! సంగీతరావ్, నేను బైటికెళ్తే, త్వరలో నువ్వూ బైటికెళ్ళిపోతావ్; పర్మనెంట్ గా!" అతను నవ్వుతూ అన్నాడు. సంగీతరావు ఆగ్రహాన్ని అణచుకుని మాట్లాడేలోగా మళ్ళీ అన్నాడు. "నీకు కొన్ని భయంకరమైన రహస్యాలు చెప్పడానికి పనిగట్టుకొచ్చాను. ఆ రహస్యాలి ఇతర్లువిని, అక్కడా ఇక్కడా కోకిల గానంచేస్తే నువ్వు సజీవంగా సమాధి ప్రవేశం చేస్తావ్. అంచేత.."

"షటప్!" సంగీతరావు హుంకరించాడు. బుస కొడుతూ తన కుర్చీవైపు నడిచి టేబుల్ కింది చేతిని చాపాడు.

"సంగీతరావ్, కాలింగ్ బెల్ నొక్కకు! ఇందాకా నన్ను ముందు హాల్లో ఆపడంలో విఫలమైన నీ శిష్యులు ఇక్కడ్నుంచీ నన్ను బైటికి పంపలేరు! అరిట్టుడు తన హీరోయిన్ పైటని లాగేయలేదంటూ నీకు చాడీ చెప్పడానికి వచ్చిన ఆశేషపాఠకుల అభిమాన రచయిత్రిని సాగనంపు. రాత్రికి ఆమెని ఎట్లాగా ఆమె గూడులో కల్సుకుంటావ్ గా! అప్పుడు అంతా చెప్పుకోవచ్చు!"

"షటప్! యూ లూనటిక్ బాస్టర్డు! ఐ విల్...."

"అతనెవరో ఎందుకు వచ్చాడో, ఏం కావాలో కనుక్కోండి మొదట!" అంతవరకూ మౌనంగా కూచున్న కోకిల అంది.

ఎడిటర్ సంగీతరావు యజమాని ఈల విన్న అల్సేషియన్‌లా మారిపోయాడు. ఆమెవైపు క్షణకాలం చూసి, చూపుల్ని యెదురుగా నించున్న వ్యక్తి వేపు తిప్పాడు.

"ఆల్ రైట్ ... ఎవర్నువ్వు? ఎందుకొచ్చావ్?"

అతను చిన్నగా నవ్వాడు. "అంతా వివరంగా, సీరియల్‌లా చెప్తాను. నీ రెండు చెవులు మాత్రమే వినాలి. అంచేత...." కోకిలవైపు చూస్తూ ఆగాడతను.

"నథింగ్ డూయింగ్! యూ విల్...."

"ఆవేశపడకు సంపాదకరావ్! తెలుగు వారపత్రిక సంపాదకుడివైన నువ్వు నోరు తెరిస్తే ఇంగ్లీషు ముక్కలే దొర్లుకొస్తున్నాయ్. "ఫలానా రచయిత్రి అపూర్వ సృష్టి. త్వరలో 'ధారావాహిక సీరియల్'గా ప్రారంభం!" అంటూ పోయిన వారం ఫుల్ పేజీల్ అనౌన్స్ చేయించిన నువ్వు ఇంగ్లీషు మాట్లాడుతూంటే నాకు ముచ్చెమటలు పోసేలా వున్నాయ్...."

"వాట్ నాన్సెన్స్...."

"ఆవేశపడకండి. ఆ విషయం నేను కూడా తరవాత మీకు గుర్తుచేశాను. 'ధారావాహికం' అంటే చాలని చెప్పాను.... నేను వెళ్తాను. అతని పనేమిటో చూడండి" కోకిల మెల్లిగా పైకి లేచింది. అలవాటు తప్పకుండా కిందికి జారిపోయిన పైటని కొంచెం అలస్యంగా అందుకుని గుమ్మంవైపు కదిలింది.

'రాత్రికి ఆమె గూటిలో కల్సుకుంటావుగా!' అన్న తన మాటని చక్కగా అర్థం చేసుకున్న కోకిల తెలివితేటల్ని అతను చిరునవ్వుతో మెచ్చుకున్నాడు. చిన్న

చప్పుడుతో తలుపు మూసుకుంది.

“చెప్పు! ఎవర్నువ్వు?” ఎడిటర్ సంగీతరావు కంఠం ఆగ్రహంతో, చిరాకుతో పదునెక్కింది.

గుమ్మం వైపు తిరిగిన అతను మెల్లిగా వెనక్కి తిరిగాడు. చిరునవ్వుతో అతన్ని చూస్తూ కోకిల ఖాళీ చేసిన కుర్చీలో కూచున్నాడు. కోటు జేబులోంచి పాకెట్ తీసి సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ సంగీతరావు మొహంలోకి తదేకంగా చూశాడు.

“సంగీతరావ్, అయామ్ శివరామ్....”

# 4

సంగీతరావు అతన్ని హీనంగా, ఎగతాళిగా చూశాడు. “షిహా.. ప్రింటయిన ప్రతీ కథా, ప్రతీ సీరియల్ భాగం అత్యద్భుతంగా వున్నాయంటూ నాగాలేకుండా మా పత్రికకి ఉత్తరాలు రాస్తున్న శివరామ్ నువ్వేనన్నమాట!”

శివరామ్ చిన్నగా నవ్వాడు. “ఆ మహత్తర కార్యం చేస్తోంది నేను కాదనీ, ఉత్తరాలు రాయడంలో ఎక్స్‌పర్టయిన నీ సబ్ ఎడిటర్ అనీ నీకు తెలుసు!”

సంగీతరావు గుడ్లురుముతూ చూశాడు. “అయితే నువ్వెవరు? హూ ది హెల్ ....?”

“హోల్డాన!” శివరాం అడ్డు తగుల్తూ వారించాడు. “నేను ఉత్తరాల రచయితని కాను. ఇన్వెస్టిగేటివ్ నవలల పేరుతో నాలుగేసి నెలలకొకటి చొప్పున నవలలు ప్రచురిస్తూ, ప్రతిసారీ ఒక సరికొత్త ఇన్వెస్టిగేటివ్ రచయితని బలిమీదికి వదిలి పాఠకుల్ని నంజుకు తినేస్తున్న నువ్వు నేను రాసిన ‘సరికొత్త ఇన్వెస్టిగేటివ్ నవల’ని సీరియల్ గా వేసుకుంటావేమో కనుక్కోడానికి వచ్చాను.”

'అదా సంగతి' అన్నట్టు సంగీతరావు బుర్రని సాక్షి ప్రాయంగా ఊగించాడు. "చాలా శ్రమ తీసుకున్నావ్. థేంక్స్. సబ్ ఎడిటర్‌కి నీ రాత అందజేయ్. తగినన్ని స్టాంపులు పెట్టానుకుంటాను. నువ్వు ఇంటికి చేరుకునే సరికి, పోస్ట్‌మన్ దాన్ని నీకు భద్రంగా అందిస్తాడు! నా...."

శివరాం పగలబడి నవ్వుతూ అతన్ని ఆటంకపరిచాడు. ముందుంచుకున్న ఫోల్డర్ని అతని ముందుకి గిరాటేశాడు. నవ్వాపి, అతన్ని ఎగతాళిగా చూశాడు. "సంగీతరావ్, అది పక్కా పరిశోధనాత్మక నవల. చదవడం ప్రారంభిస్తే, ఆపవ్! ఒక్క పేజీతో అది నిన్ను బంధించేస్తుంది. పాఠకుల్ని కట్టిపడేసే అక్షరాల సంకెళ్ళ సమూహం అది! తీరిగ్గా చదువుతానంటే, రేపు కల్సుకుంటాను...."

"నాన్ సెన్స్!" సంగీతరావు గర్జించాడు.

"హోల్డాన్!" శివరాం అతనికన్నా బిగ్గరగా అరిచాడు. "నీ ముందు పడున్న ఇన్వెస్టిగేటివ్ రచన అక్షరాల —— డైనమైట్. ఇర్వింగ్ వాలెస్, మెక్లేన్స్, హెరాల్డు రాబిన్స్ వగైరా అమెరికన్ రైటర్స్ తమ రచనల్ని ఏజెంట్స్ ద్వారా వేలంవేసి పబ్లిషర్స్‌కి ఇస్తారు. ఆ అలవాటు ఇంకా అభివృద్ధి చెందుతూనే వున్న మనదేశంలో లేకపోయినా కూడా, నా రచనని నేను వేలం వేయగలను! ఇతివృత్తం ఇదీ అంటూ చెప్పి, సినాప్సిస్ చదవగానే అరడజను ఆంధ్రా మ్యాగజీన్స్ పందాలేసుకుని తోసేస్తాయి. ముఖ్యంగా సంగతి తెలిసిన మరుక్షణం నీ శత్రు పత్రిక 'బాంధవి' అక్షరలక్షలిచ్చి నా రచనని తన్నుకుపోతుంది...."

"డెన్ గెటౌట్! సెల్ యువర్ మక్ టు బాంధవి!"

సంగీతరావు హుంకరించాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. ముందుకి వంగి ఫోల్డర్ని తీసుకున్నాడు. మెల్లిగా లేచినిలబడ్డాడు. ఎగతాళిగా సంగీతరావుని చూశాడు.

"సంగీతరావ్, నేను ఆలాపిస్తున్న 'రాగం' ఏమిటో కనుక్కోడానికి నువ్వు ప్రయత్నించడంలేదు. ముఖ్యంగా తెలుగు వారపత్రిక సంపాదకుడైన నువ్వు పూర్తిగా ఇంగ్లీషులోనే మాట్లాడుతున్నావ్. ఇంగ్లీషు నవలల్ని చదివి,—నీ సంస్థద్వారా పాఠకులకి పరిచయంచేసి, నంబర్ వన్ రచయితలుగా, రచయిత్రులుగా అమాయకుల నెత్తిన రుద్దుతూ పబ్లిసిటీ ఇచ్చి తయారుచేసిన వాళ్ళ చేత ఇంగ్లీషు నవలల్ని తెలుగు భాషలో అందిస్తున్న నువ్వు సహజంగా ఇంగ్లీషులోనే మాట్లాడతావ్! ఆల్ రైట్.."

"నాన్ సెన్స్!" సంగీతరావు అరిచాడు.

"ఆవేశపడొద్దు. ఇందాకా నీ ముందు వాలి వసంత గానం సాగించిన కోకిల ప్రస్తుతం సీరియల్‌గా అందిస్తున్న నవల ఆమె కడుపున పుట్టింది కాదనీ, ఇర్వింగ్ వాలెస్, హెన్రీడెంకర్, సిడ్నీ షెల్డన్—ఈ ముగ్గురి మూడు నవలల సారాంశం కలబోసి తయారుచేసిన సరికొత్త తెలుగు థ్రిల్లర్ అనీ నాకు తెలుసు! అదాలా వుంచుదాం.

"నా రచనని కన్నెత్తి చూడ్డానికి నిరాకరించావ్. వెళ్తాను. నీ పబ్లిషర్ లక్ష్మీకాంత్‌ని కల్సుకుంటాను. సినాప్సిస్ వినిపిస్తాను. అంత గొప్ప రచనని చదవకుండా తిరగ్గొట్టిన నీమీద అతని ఆగ్రహం నీ ఆశలా పేట్రేగి పోతుంది. ఆ క్షణంలో నువ్వు అతని సముఖానికి పిలవబడతావ్. రచనని పూర్తిగా చదవకుండానే లక్ష్మీకాంత్

కోటేస్తాడు. ఎంత కావాలంటాడు. ధర చెప్తాను. పారితోషికంతో బాటు నిన్ను బర్తరఫ్ చేస్తూ జారీచేసే ఆర్డరు కాపీ కూడా కావాలంటాను....”

“గెట్....ఔట్ !”

శివరాం అతని కళ్ళల్లోకి ఎగతాళిగా చూశాడు. “నేను బైట అడుగు పెడితే తెల్లారేసరికి బ్యానర్ హెడ్‌లైన్ వార్తయిపోతావ్ సంగీతరావ్!”

హుంకరించడానికి తెరిచిన సంగీతరావు నోరు మెల్లిగా మూసుకుంది. అతని మొహంమీద ఎర్రగా అవుపిస్తున్న ఆగ్రహంతో యేదో అనుమానం చేరింది. రెప్పవేయకుండా శివరాం కళ్ళల్లోకి తదేకంగా చూశాడతను.

“త్వరలో కణుకుతూ కుప్పకూలిపోయే నిన్ను చూస్తూంటే నాకు ఇప్పుడే జాలేస్తోంది; సంగీతరావ్! నీకోసం, ఒక ముక్క చెప్తాను. రచయిత గంగాప్రసాద్ నీకు గుర్తున్నాడా? అతను నాకో స్టేట్‌మెంట్ రాసిచ్చాడు. నీ అధికారాన్నీ, పెక్కువీ క్షణకాలం మరిచిపోయి నా రచన సినాప్సిస్—సంక్షిప్త వివరణ—చదివితే నీకంతా అర్థమవుతుంది. తరవాత....”

సాలోచనగా కుర్చీలో కూచుంటున్న సంగీతరావుని చూస్తూ శివరాం ఆపేశాడు. గంగాప్రసాద్ పేరు అతని కనుచూపుల్ని దగ్గరగా లాగి ముడేస్తోంది.

“ఆల్‌రైట్....నీ స్క్రిప్టు చదివే ఓపిక నాకు లేదు. సినాప్సిస్, సినాప్సిస్ అంటూ బొబ్బలెడుతున్నావ్. అదేమిటో చూస్తాను........” సంగీతరావు దర్పంగా అన్నాడు.

శివరాం నవ్వుతూ కుర్చీలో కూచున్నాడు. ఫోల్డర్

తెరిచి, ఒక దళసరి కాగితాన్ని తీసి అతని ముందుకి విసిరాడు. సంగీతరావు అప్రయత్నంగా అందుకుని, చదవడం ప్రారంభించాడు. అతని మొహాన్ని చదువుతూ శివరాం సిగరెట్ వెలిగించాడు.

సంగీతరావు తలని తొండలా కొంచెం పైకిలేపాడు. మెల్లిగా మళ్ళీ కిందికి వాల్చాడు. మూడుసార్లు తలని అలా పైకీ కిందికీ ఆడించి, పూర్తిగా పైకెత్తాడు. అతని కళ్ళు శివరాం మొహంలోకి అర్థంకానట్టు చూశాయి. అయోమయం. ఆందోళనా, ఆగ్రహం అతని రెండు కళ్ళనీ మూడు పొరల్లా ఆవరించుకున్నాయి.

“ఏమిటిది?” అప్రయత్నంగా అడిగాడతను.

సంగీతరావు కంఠస్వరంలో దూరిన మార్పుని శివరాం సంతృప్తితో గమనించాడు. పెదాల మధ్య వున్న సిగరెట్ని మెల్లిగా ఇవతలికి తీశాడు. నోటినిండుగా లాగిన పొగని సుండ్రటి, లావుపాటి చక్రంలా నిర్లక్ష్యంగా అతనివైపు రువ్వాడు. శిరచ్ఛేదం చేయడానికి దూసుకొస్తున్న విష్ణుచక్రంలా తనవేపు తేలివస్తున్న పొగచక్రం నుండి అసంకల్పితంగా తలని పక్కకి వాల్చాడు సంగీతరావు. తెల్లటి పళ్ళని చూపుతూ శివరాం చిరునవ్వు నవ్వాడు.

“అది నీ జీవితచరిత్ర సారాంశం, సంపాదకరావ్!”

శివరాం మాటలు తనకి వినిపించనట్టు సంగీతరావు అయోమయంగా చూశాడు. రెప్పలు తాటించడం మరిచిపోయిన అతని అనిమిష నేత్రాల్లోకి శివరాం చిలిపిగా చూశాడు.

“రచయితల జీవితచరిత్రలు మనదేశంలో కొల్లలుగా దొరుకుతాయి. సంపాదకుల జీవితచరిత్రలు బొత్తిగా

లేవు. సాహిత్యంలోని ఆ లోటు తీర్చడానికి ఈ శివరాం నీ జీవితచరిత్ర రాశాడు, సంగీతరావ్!"

"ఈ చెత్తంతా ఎక్కడ సంపాదించావ్?" తగ్గు స్వరంలో పలికిన సంగీతరావు కంఠం ఆశ్చర్యాన్నీ, ఆగ్రహాన్నీ ఇతరలకి చిమ్మింది.

శివరాం పకపక నవ్వాడు. "చెత్త! కరెక్ట్! ఈ చెత్తా, ఇంకా నేను పోగుచేసిన చెత్తా నిన్ను చిత్తు చిత్తు చేస్తాయి. అది కేవలం సినాప్సిస్ మాత్రమే. ఫుల్ లెంగ్త్ నవల నిన్ను పూర్తిగా ఆకట్టుకుంటుంది. అవి అక్షర—అయస్కాంతాలు. ప్రారంభిస్తే పూర్తిగా చదివేదాకా కన్నార్పలేవు. క్రిస్కప్టుని కింద పెట్టలేవు. నీ ఇంగ్లీషులో చెప్పాలంటే నా రచన 'అన్ పుట్ డౌనబుల్!' అంచేత...."

సంగీతరావు చేతిలోంచి తనవైపు చూసుకొన్న కాగితాన్ని చూస్తూ శివరాం ఆపేశాడు. రెప్పలెత్తి అతన్ని ఆశ్చర్యంగా చూశాడు! సంగీతరావు కటాలున పైకి లేచాడు. గుడ్లురుముతూ శివరాంని బెదిరింపుగా చూశాడు

"టేక్ దట్ రబ్బిష్ అండ్ గెట్ లాస్ట్!"

శివరాం మౌనంగా ఆ కాగితాన్ని తీసి ఫోల్డర్లో ఇరికించాడు. సిగరెట్ పీకని గదిమూలకి రువ్వి కొత్త సిగరెట్ వెలిగించాడు. కుర్చీలో వెనక్కి వాలి, సంగీతరావుని తదేకంగా చూశాడు.

"సంగీతరావ్. నా సినాప్సిస్ నీకు అర్థమైనట్టులేదు. ఎదటి మనిషి తెలివితనాన్ని నేను క్షమిస్తాను. అందుకే నీకు మరికొన్ని వివరాలిస్తాను...." శివరాం ఆగి, అతన్ని అర్థమైందా అన్నట్టు చూశాడు. అతను నోరు తెరిచే

లో గా, కంఠస్వరం పెంచి ప్రారంభించాడు:

"పదమూడేళ్ళగా, ఆ ఎడిటర్ సింహాసనంలో తిష్ఠ వేసి, నువ్వు ఏకచ్ఛత్రాధిపత్యంగా 'హారతి' పత్రికని ఏలుకుంటున్నావు. ఈ పదమూడేళ్ళలో నీ మేధస్సు చాలామంది రచయితల్నీ, రచయిత్రుల్నీ తయారుచేసి పాఠకులమీదికి వదిలేసింది. వీళ్ళంతా తమని నీ శిష్య కోటిగా చెప్పుకుంటూ అచ్చులో పేరుచూసుకునే తీట వదిలించుకున్నారు.

తరవాత, సంక్రాంతి నవలల పోటీ, ఉగాది నవలల పోటీ, దీపావళి నవలల పోటీ, వినాయక చవితి నవలల పోటీ, పత్రిక జన్మదినం నవలల పోటీ వగైరా పేర్లతో యేడాదిలో అరడజను తక్కువ కాకుండా నవలల పోటీల్ని నిర్వహించావు. ప్రతిసారీ కొత్త కలాలకి బహుమతులు ప్రకటించావు. బ్రహ్మాండమైన పబ్లిసిటీ ఇస్తూ ఆ నవలల్ని సీరియల్స్‌గా ప్రచురించావు. కానీ, దురదృష్ట మేమిటంటే. నువ్వు ఒక రచయితకు కూడా బహుమతి పైకం ఇవ్వలేదు...."

"నాన్‌సెన్స్!" సంగీతరావు గర్జించాడు. "నీకు పిచ్చి పట్టింది! అకౌంట్స్ వింగ్‌లో చూస్తే తెలుస్తుంది. బహుమతి మొత్తాలు ముట్టినట్టు రచయితలూ, రచయిత్రులూ ఇచ్చిన స్టాంప్డ్ రసీదులు...."

"హోల్డాన్!" శివరాం నవ్వుతూ వారించాడు. "అందుకు సందేహం లేదనుకో! పాపం వాళ్ళు ఆ రసీదులు ఇచ్చారు - చెక్కులూ తీసుకున్నారు. అయితే, ఆ చెక్కుల మొత్తాన్ని రొక్కంగా, రహస్యంగా నీకు సమర్పించారు ఉదాహరణకి గంగాప్రసాద్ కేసుతీసుకో. అతని నవలకి ప్రథమ బహుమతి—పదివేలు—లభించింది.

చెక్కు ఇవ్వబడింది. చెక్కు జారీ అయ్యేముందే నువ్వు అన్నీ సంప్రదింపులూ జరిపావు; రహస్యంగా. ఫలితంగా ఇవాళ రాత్రి అతను నీకు పదివేలు హార్డ్ క్యాష్ సమర్పించాడు; రేపు నీ ఆఫీసు పంపిన చెక్కు తీసుకున్నాడు.

ఇలాగే ద్వితీయ బహుమతి మొత్తం ఆరువేలూ, తృతీయ బహుమతి మొత్తం నాలుగూ—అంతా కలిపి ఒక్కో పోటీకి ఇరవై వేలు నువ్వు స్వాహా చేశావు. ఒక్కో ఏడాదిలో ఐదుకి తక్కువ కాకుండా పోటీలు నిర్వహించావు. అంటే యేడాదిలో అయిదు ఇరవైలు-లక్షరూపాయలు ఈజీగా జేబులో వేసుకున్నావ్...."

"నో! ఇదంతా...."

"నోరు మూసుకో, కాసేపు!" శివరాం గర్జించాడు. "తరవాత నీ సంపాదన—మాస్టర్ ప్లాన్‌లోని రెండో దశ: నువ్వు రికమెండ్ చేసే పబ్లిషర్‌కే సీరియల్ని నవలగా అమ్మాలని కండిషన్ పెట్టావు. ఎదురు కట్నం ఇచ్చి నవలల్ని అచ్చేయించుకుని, సాహితీచరిత్ర పుటల్లో సువర్ణాక్షరాలతో తమ పేర్ని శాశ్వతం చేసుకోవాలన్న [illegible] ఈ రచయితలంతా నీ ప్లాన్‌కి బలి అయిపోడానికి గుడ్డిగా ఒప్పేసుకున్నారు. ఉదాహరణకి నీ గంగాప్రసాద్‌నే తీసుకుందాం. అతని నవల సీరియల్‌గా పూర్తయ్యాక దాన్ని 'నవలానికేతన్' పబ్లిషర్‌కి అమ్మించావు. ప్రతిఫలంగా ఆ పబ్లిషర్ నుండీ, గంగాప్రసాద్‌కి వెళ్ళే రెమ్యూనరేషన్‌లో అరవై పర్సెంట్ కొట్టేశావ్!"

"నో! యూ...."

"నోనోనో అంటూ నువ్వు గొంతు చించుకుంటూ వుంటానంటే నాకు అభ్యంతరంలేదు. ఈ సంగతి

ప్రారంభించగానే, 'నో' అనకుండా "ఇంకా?" 'తరవాత?' అంటూ ఉత్సాహంలో అడిగే నీ జాతి వ్యక్తులు చాలామంది వున్నారు. ముఖ్యంగా నీ గర్భశత్రువు, 'రంగవల్లి' వారపత్రిక సంపాదకుడు కూలపాణి....." శివరాం ఆగి, దమ్ములాగాడు. రంగులు మారుతున్న సంగీతరావు మొహాన్ని చిరునవ్వుతో చూస్తూ మళ్ళీ ప్రారంభించాడు.

"నేను తయారుచేసిన చిత్తు — అంచనా ప్రకారం యేడాదిలో లక్షాన్నరకి తక్కువ కాకుండా నువ్వు ఆర్జించావు. రెండువేలా రెండువందల నెలసరి జీతం, ఒక భార్యా నలుగురు పిల్లలూ వున్న నీకు జీతం మాత్రమే ఆదాయం కాదన్న సత్యాన్ని నీ బంగళా, నీ భార్య మోస్తున్న బంగారు సరుకూ, మూడు బ్యాంకుల్లో వున్న లాకర్సూ నిరూపిస్తున్నాయి. గంగాప్రసాద్, సుబ్బేశ్వరరావు, రమణీకుమారి వగైరా రచయితలూ, రచయిత్రులూ నాకు రాసియిచ్చిన స్టేట్ మెంట్సూ ఈ కుంభకోణాన్ని నిరూపిస్తాయి. ముఖ్యంగా, నీ కాకిగూడులో కూచుని కూస్తూ, ఇంకా గుడ్లు పెట్టని కోకిల భర్త — త్వరలో ఆమెనుండీ విడాకులు తీసుకోబోతున్న కోకిల భర్త — రాసిచ్చిన స్టేట్ మెంట్ నీ నిజస్వరూపాన్ని లోకానికి చూపిస్తుంది!"

"ఇది అన్యాయం — కోకిలాదేవికి పారితోషికం ముట్టింది!" సంగీతరావు అప్రయత్నంగా అరిచాడు.

"నిస్సందేహంగా!" శివరాం నవ్వుతూ అన్నాడు. "ఆమె రచనకి పారితోషికంతో పాటు. నీ అర్జనలో వాటాగూడా ఆమెకి ముట్టుతూనే వుంది! నీకోసం నలుగురు పిల్లల్ని కని, నలభై యేళ్ళు నిండకుండానే

అమ్మమ్మలా అయిపోయిన నీ భార్యలో లోపించిన సౌందర్యాన్నీ, ఉషారునీ, ఉద్రేకాన్నీ, ప్రేమనూ కోకిలలో చూసుకుంటున్న నువ్వు ఆమె నవలలూ, కథలూ, పాఠకులు అడగని ప్రశ్నలకి సమాధానాలూ, అందచందాలకి చిట్కాలూ, చివరికి వంటలూ—వార్పులూ—ప్రచురిస్తూనే వున్నావ్. పత్రిక సర్క్యులేషన్ ఆకాశంలో వున్నంతకాలం నీ పబ్లిషర్ నిన్ను యేమీ అనడు. కానీ, నేను ఈ సీరియల్ని వేరేపత్రికలకీ, రంగవల్లి సంస్థ ప్రారంభించిన దినపత్రికకీ అమ్మేస్తానంటే అతను కొంచెం ఆలోచిస్తాడనుకుంటాను...."

సంగీతరావు కళ్ళు తెరుచుకునే కలగంటున్న వ్యక్తిలా కదలకుండా, నోరు మెదపకుండా కూచున్నాడు. అతనిలో భయం, ఆశ్చర్యం సంకులసమరం సాగిస్తున్నాయని నుదురుమీద ప్రత్యక్షమైన చెమట బిందువులు స్పష్టం చేస్తున్నాయి. నిండుకుండలా తొణక్కుండా కూచున్న సంగీతరావుని శివరాం ఆశ్చర్యంతో చూశాడు. అతనికి డోస్ చాలలేదా?

"నిజం చెప్పు: నువ్వెవరు?" సంగీతరావు గొంతు పెక్కుంటున్నట్టు ప్రశ్నించాడు.

శివరాం అతన్ని నవ్వుతూ చూశాడు. తన ఆందోళనని బైటపడనీకుండా దాచుకోడంలో సంగీతరావు ఆరితేరినవాడిలా వున్నాడు. అతను చెమటలు కక్కకపోతే మరేం ఫర్వాలేదు; అతను కక్కాల్సింది వేరే వుంది!

"మరిచిపోయావా? అయాం శివరాం...."

"పేరు కాదు; వృత్తి...."

శివరాం చిన్నగా నవ్వాడు. "చెప్పినా కూడా, స్వా

వృత్తి యేమిటో నీకర్థం కాదు. నేను వచ్చిన పని చెప్తాను. దాన్నిబట్టి నా వృత్తి యేమిటో నువ్వు ఊహించుకో!"

"నువ్వొచ్చిన పనేమిటో నాకు తెలుసు!" సంగీతరావు అతన్ని తీక్షణంగా చూస్తూ అన్నాడు. "నువ్వు ఓడిపోయిన రచయితవని నేను ఊహించగలను. ఫస్టుక్లాస్ రచనల్ని మాత్రమే ప్రచురించే నా పత్రిక 'హారతి' నీ రచనల్ని అంగీకరించినట్టులేదు. ఎలాగో దబాయించి నీ రచనల్ని అచ్చేయించాలనుకున్నావ్. పాఠకులకి నచ్చే కథలు రాయడం చేతకాని నువ్వు యేమి చేస్తావో మాట్లాడు, వాగుతూ, నన్ను బెదిరిస్తున్నావ్! వంటగదుల్లోకీ, పడకగదుల్లోకీ తొంగిచూస్తూ చెత్తంతా ఊహించుకుంటూ.."

శివరాం నవ్వు సంగీతరావు ఉపన్యాస కచ్చేరీకి అడ్డు తగిలింది. శివరాం నవ్వు ఆపగానే సంగీతరావు అందుకున్నాడు.

"నన్ను బ్లాక్ మెయిల్ చేసే ప్రయత్నం చేసి, నీ నవలని పబ్లిష్ చేయించుకోవాలనుకుంటున్నావ్!"

శివరాం అతన్ని చిరునవ్వుతో చూశాడు. "సంగీతరావ్, బాగా ఊహించావ్. శోహార్లు! ఎంతైనా వార్తలు చదవకుండా ఊహించి, సంపాదకీయాలు రాసే చాతచక్యం వున్నవాడివి!"

"ఆల్ రైట్. ఇలాంటి దౌర్జన్యాన్ని నేను సపోర్టు చేయను. రచయితగా డెస్పరేట్ అయిపోయిన నిన్ను ప్రోత్సహిస్తాను. నీ నవలని ప్రచురిస్తాను. అయితే మరో నెలన్నర నువ్వు ఆగాలి. అయిదు సీరియల్స్‌కన్నా యెక్కువ వేయలేం...."

శివరాం ఘొల్లున నవ్వుతూ వుండిపోయాడు. సంగీతరావు అర్థం కానట్టు చూశాడు.

"ఇంటికి ఇద్దరు రచయితలూ, ఇద్దరు రచయిత్రులూ వున్న ఈ ఆంధ్రదేశంలో శివరాం స్వయంగా చెయ్యి చేసుకుని రచనలు చేయాల్సిన అవసరంలేదు! పైగా నేను ఫిక్షన్ రాసే వ్యక్తిని కాను. నేను రాసేవన్నీ కఠిన సత్యాలు! నువ్వూ, నీ పాఠకులూ కఠిన సత్యాల్ని తట్టుకోలేరు!" శివరాం నవ్వుతూ సిగరెట్ పీకని గది మూలకి విసిరాడు. "సంగీతరావ్, శృతిమార్చు! కొత్త పాట పాడు!"

"ఓకే, శివరాం, నీ రచనకి తగిన పారితోషికం ముందే చెల్లించబడేలా చూస్తాను. మంచి పబ్లిషర్...."

"సంగీతరావ్, శృతేకాదు; రాగం, పాట కూడా మార్చు! ఈ ఫోల్డర్లో వున్న రచన ధారావాహిక నవల కాదు; అది నీ ఆత్మధారావాహిక నవల! దాన్ని నువ్వు కొనుక్కోగలవ్. కానీ, ప్రచురించలేవు! కావాలంటే నీకు దాన్ని అమ్ముతాను. వద్దంటే వెళ్ళిపోతాను. అర డజను పత్రికలకి అన్ని వాక్యాల్తో అమ్మేస్తాను! నువ్వు ఇవ్వలేని డబ్బు వాళ్ళిస్తారు. నువ్వు చేయలేని ప్రచురణ వాళ్ళు చేస్తారు. దాంతో నీ గతం బైటపడుతుంది. వర్తమానం సర్వనాశనం అవుతుంది. భవిష్యత్తు పూర్తిగా మాయం అయిపోతుంది. త్వరలో నీ యజమాని ప్రారంభిస్తున్న దినపత్రిక సంపాదకత్వం నీ చెయ్యి జారిపోతుంది. రాజకీయ నాయకుల్నీ, వ్యాపారుల్నీ బ్లాక్ మెయిల్ చేసి మేడలు కట్టే, మేటలు వేసే సువర్ణావకాశం నీ చేతుల్లోంచీ జారిపోతుంది. తరవాత...."

"స్టాప్!" సంగీతరావు బొంగురుగా అరిచాడు. "అందరికీ లేని తీట నీ కెందుకు? ఎవరో ఏదో ఇచ్చారంటే—అది ఆయా వ్యక్తులు తమ ఇష్టాలతో ఇచ్చు

ఉన్నారు. రచయితలుగా పరిచయం అయ్యారు. వాళ్ళ మానాన వాళ్ళు...."

"బతుకుతున్నారు; పాఠకులుగా; రాణించలేని రచయితలుగా! నీ పత్రిక పరిచయం చేశాక, వాళ్ళల్లో యెవరి రచనల్ని యే పత్రిక తరవాత సీరియల్ గా వేసే సాహసం చేసిందో చెప్పతో చూద్దాం!" శివరాం నవ్వుతూ అడ్డుతగిలాడు. "అయినా అదంతా నాకు అనవసరం, అది వాళ్ళ తీట! అయితే, పారితోషికం ఎగ్గొట్టి, చెత్త రచనల్ని బాగున్నాయంటూ ఆకాశాని కెత్తి, పాఠకుల ప్రశ్నల్ని సబ్ ఎడిటర్స్ చేత రాయించి విరుద్ధభావాల్ని కల్పించి, నానా గలాభా చేసి, ఆ సీరియల్స్ ని పాఠకుల నెత్తిన రుద్దుతూ బ్రెయిన్ వాష్ చేసి, సర్క్యులేషన్ పెంచుకున్నావ్. బూతూ, వయొలెన్సూ, పరిశోధన పేరుతో చెత్తా, రాయించి పాఠకుల్ని డమ్మీలుగా, ఇచ్చింది మింగే పాపాయిలుగా తయారు చేశావ్! పాఠకుల్లో బలహీనతలు పుట్టించి వాళ్ళకీ, రచయితల బలహీనతల్ని ఆధారంగా చేసుకుని వాళ్ళకీ అన్యాయం చేశావ్ ...."

"ఎవడో యెవరికో చేసిన అన్యాయం గురించి అడగడానికి నువ్వెవరు? హూ ది హెల్ ఆర్ యూ?" సంగీతరావు హుంకరించాడు.

శివరాం అతని దొంగకళ్ళలోకి తదేకంగా చూశాడు. "సోదర మానవులకి జరిగిన అన్యాయాన్ని నాకు జరిగిన అన్యాయంగా భావించేవాణ్ని!"

"నాన్ సెన్స్!"

"ఎప్పుడు, ఎక్కడ, ఎవరికి అన్యాయం జరిగినా సమయం చూసి సమర్థవంతంగా ఎదిరించే సగటు మాన

వున్నా, సంగీతరావ్!" శివరాం కంఠం నగారాలా గంభీరంగా ధ్వనించింది.

"డోంట్ బోస్టు! యూ ఆర్ డర్టీ బ్లాక్ మెయిలర్!" సంగీతరావు బూతులిట్టు లెవెల్లో అరిచాడు.

శివరాం పకపక నవ్వాడు. "ఇప్పటికి నా వృత్తికి ఒక పేరు కనిపెట్టగలిగావ్! ఈ బ్లాక్ మెయిలర్ని కొను గోలు చేయాలంటే నువ్వు కొంత సొమ్ము ఖర్చుచేయాల్సి వుంటుంది...."

"ఎంత? మొరుగు! గిరా చేస్తాను!" సంగీతరావు హుంకరించాడు.

"వెరీగుడ్. తొణక్కుండా కూచుంటే మెసేజ్ అర్థంకాలేదేమో అనుకున్నా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఎంత?" సంగీతరావు గర్జించాడు.

"నీ కష్టార్జితంలో నాకు వాటా అక్కర్లేదు. మనిషి చెమటని దోచుకునేవాణ్ణి కాను నేను. ఎగ్గొట్టి బహుమతులూ, పుస్తకరూపంలో వచ్చే సందర్భాల్లో నువ్వు ప్రచురించిన సీరియల్స్ మీద గుంజుకున్న కమిషన్ లూ, నా అంచనా ప్రకారం యేడాదికి లక్షన్నరో ఎంతో అన్నాను. అంకెల్లో భిన్నాలుంటే క్యాల్క్యులేట్ చేయడం నాకు ఇబ్బంది. అంచేత ఇద్దరికీ అనుకూలంగా రెండేసి లక్షలనుకుందాం...."

"యూ కాంట్...."

"షటప్!" శివరాం గద్దించాడు. "సో ఏడాదికి రెండులక్షల చొప్పున పదమూడేళ్ళకి ఇరవైఆరు లక్షలు. ఈ ఇరవైఆరూ నీకు తేరగా వచ్చిన రొక్కం. దీనికి అపరాధం—రచయితల్ని మోసం చేశావుగా?—కొంత,

ప్లస్ కోకిల భర్తకి ద్రోహం చేసినందుకు ఇంకొంత మొత్తం.... సే.... ఫోర్టీలాక్స్...."

"నో ఓకే....!" సంగీతరావు బిగ్గరగా అరిచేశాడు.

శివరాం అతన్ని నవ్వుతూ చూశాడు. "భారత రచయితల సంక్షేమసమాఖ్య తరఫున ఈ శివరాం రచయితల్నీ, రచయిత్రుల్నీ—నువ్వు టోపీ వేసిన వాళ్ళని-కలుసుకున్నాడు. నువ్వు పాఠకులకి బ్రెయిన్ వాష్ చేసినట్టే ఆ రచయితలకి బ్రెయిన్ వాష్ చేశాడు. వాళ్ళంతా సమాఖ్య సహకారంతో కోర్టుకి వెళ్ళడానికూడా సిద్ధంగా వున్నారు. సమాఖ్య తరఫునా, దగాపడిన రచయితల తరఫునా ఈ శివరాం కోర్టులో లాయరుగా వ్యవహరిస్తాడు. నిన్ను పచ్చడికింద రుబ్బేస్తాడు! అది గుర్తుంచుకో!"

మొట్టమొదటిసారిగా సంగీతరావు ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. ఏసీని పూర్తిగా నిర్లక్ష్యంచేస్తూ అతని మొహాన్ని చెమట పూర్తిగా తడిపేస్తోంది.

"శి....వ....రా....ం....అంత.....లేదు....." అసంకల్పితంగా వున్నాడతను.

శివరాం చిన్నగా నవ్వాడు. "ప్రస్తుతం నీ జేబులో లేకపోవచ్చు. బ్యాంకుల్లో, ఇంట్లో దాచుకున్నావ్ గా? వెంటనే బయల్దేరు. ఎక్కడెక్కడికి వెళ్తావో వెళ్ళు. సరిగ్గా రెండు గంటల్లో నిన్ను ఇక్కడే కలుసుకుంటాను. అన్నట్టు....ఇక్కడొద్దు. నీ జీవిత చరిత్ర ఫోటోకాపీలన్నీ మోసుకురాలేను. రెండుగంటలకి ఫోన్ చేస్తాను. 'డాక్యుమెంట్స్ తయారుగా వున్నాయ్!' అంటాను. ఆ డాక్యుమెంట్స్ ఎన్నో చెప్తాను. అది నిజంగా వాటి సంఖ్యకాదు. నా హోటల్ గది నంబరు. అక్కడికి

చూసుకుని, చూసుకోరా. నాది నాకు ఇచ్చేయ్; నీది నువ్వు పట్టుకెళ్ళు!"

ఎండి, వణుకుతున్న పెదవుల్ని బలవంతాన కంట్రోల్ చేసుకుంటూ సంగీతరావు గుటకలు మింగాడు. "శివరాం పది..... టెన్ ..... ఇవ్వగలను.....ఇచ్చేస్తాను.....నన్ను మరిచిపో...."

శివరాం పాలోచనగా, కన్సిడర్ చేసేవాడిలా తల పంకిస్తూ చూశాడు. సంగీతరావు ఆశగా, ఆత్రంగా చూస్తున్నాడు.

"ఓకే ...సంగీతరావ్.....ఎదటి మనిషి ప్రాధేయ పడితే నా హృదయం కరిగిపోతుంది. ఆల్ రైట్ ....పది! పదిలక్షలు సూట్ కేస్ లో సర్ది రెండు గంటల్లో తిరిగి వస్తాను. ఎందుకంటే, నీ జీవిత చరిత్ర కాపీలన్నింటినీ మోసే అవసరం వుండదు. అమాటకొస్తే, ఈ కాపీని ఇక్కడే, ఇప్పుడే వదిలేస్తాను!"

సంగీతరావు రెప్పలు టపటప కొట్టుకున్నాయి. నమ్మకం, అపనమ్మకం అతని రెండు కళ్ళల్లో దాగుడు మూతలాడుతున్నాయి రెండు క్షణాల తిర్వాత అతను అప్రయత్నంగా నోరు తెరిచాడు.

"అంటే ...అంటే....తతిమ్మా....కాపీలు "

శివరాం కులాసాగా నవ్వాడు. "హాట్సాఫ్! తెలివైన ఘటానివే! తతిమ్మా కాపీలు ఇతర్లకి అమ్ముతాను. పోటాపడతారు! ఒక్కో ఎడిటర్ కి ఒకొక్క కాపీ! అలా చేస్తే నాకు అరవై దాకా వస్తుంది! నువ్వేలాగా పదిని మించి ఇవ్వలేనన్నావుగా!"

"యూ బాస్టర్డ్! స్కౌండ్రల్! రాస్కెల్! బ్లాక్

మెయిలింగ్ బ్లాక్! యూ....యూ....సన్....అఫ్..."

"షటప్! యూ సన్నాఫ్ ఎ గన్....అయాం సారీ యూ సన్నాఫ్ ఎ పెన్! కలం పట్టిన వీరసంపాదకుడివిగా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

సంగీతరావు ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. కటాలున శివరాం నవ్వు ఆపేశాడు. "సంగీతరావ్, నీకు ఇంకా తిక్కకుదర్లేదు. తనున్న స్థితిని గర్వంతో నిర్లక్ష్యంచేసే మనిషిని నేను అసహ్యించుకుంటాను. అంచేత పథకం మార్చుకున్నా. హోటల్ అంబాసిడర్ అనెక్స్‌లో నలభై ఆరో గదిలో నేనుంటాను. సరిగ్గా రెండేరెండు గంటలు, నూటఇరవై నిమిషాలు చూస్తాను. నిర్ణయించిన పారితోషికంతో నువ్వు ఒంటరిగా ప్రత్యక్షం కావాలి. ఒంటరిగా రావడానికి భయంవేస్తే పోలీసుల్ని తోడు తెచ్చుకో! నాకేం అభ్యంతరంలేదు....తరవాత.. నలభై వున్నాయో లేదో చెక్ చేస్తాను. అంతదాకా నువ్వు రిసెప్షన్‌లో వేచివుంటావు. నలభై సరిగ్గా వుంటే, నిన్ను నా గదికి పంపమని రిసెప్షన్‌కి చెప్తాను. నువ్వు వస్తావ్. అక్షరాలుగా మారిన నీ బతుకుని భద్రంగా పట్టుకెళ్తావ్!"

"శి....వ....రా....ం...."

"కాదు కూడదంటూ నోరు తెరిస్తే. కదిలిపోతాను. తిన్నగా మరో టోకు వర్తకుడు—రంగవల్లి సంపాదకుడు వున్నాడుగా? అతన్ని కల్సుకుంటాను...." శివరాం ఆగి, మరో సిగరెట్ వెలిగించాడు.

సంగీతరావు రెండు చేతుల్తో మొహం తుడుచుకున్నాడు. ఉబ్బినట్టున్న మొహాన్ని శివరాంవైపు కొద్దిగా పైకెత్తాడు. ఉన్నట్టుండి వణకడం ప్రారంభించిన రెండు

చేతుల్ని వొళ్ళోకి [illegible]ంచుకున్నాడు.

"ఓకే... బాస్టర్డు నలభై ....పారేస్తాను. అన్ని కాపీలు ఇస్తానన్న గ్యారంటీ ఏమిటి?"

శివరాం అతన్ని తమాషాగా చూశాడు. "చిట్టంత మనిషిని నేనుండగా నీకు గ్యారంటీ దేనికి సంగీతరావ్!"

"డోంట్ జోక్! ఏమిటి గ్యారంటీ?" సంగీతరావు ఉరిమాడు.

"నో గ్యారెంటీ!" శివరాం సాదాగా అన్నాడు. "నీ చరిత్ర నన్ను మొట్టమొదటిసారిగా రచయితగా మార్చింది. నా మొదటి రచనను అచ్చులో చూసుకోవాలని లేకపోయినా, కనీసం వ్రాతప్రతినైనా అడపా దడపా చదువుకోవాలన్న కోరిక ఇప్పుడిప్పుడే నాలో పుట్టుకొస్తోంది. ఒరిజినల్ దగ్గరుంచుకుని, జిరాక్స్ కాపీలన్నీ పూర్తిగా నీకే ఇచ్చేస్తాను. భవిష్యత్తులో నువ్వు మళ్ళీ విజృంభించి, ఆవేశంలో కంచె దాటితే దాన్ని తిరగేస్తాను. మరో నాలుగు పేజీలూ, ఒకటో, రెండో అఫిడవిట్లూ చేస్తాను. బోల్డన్ని కాపీలు తీసి, పైసా అడక్కుండా అందరికీ — అవసరమైన వ్యక్తులకీ — బహూకరిస్తాను. ఆ వ్యక్తుల్లో పోలీసుల్ని చేరుస్తాను!"

"నో! ఇది అన్యాయం! ఘోరం! దారుణం!" సంగీతరావు బొబ్బెట్టాడు.

"సంగీతరావ్, మళ్ళీ కంచె దాటుతావా?" శివరాం సూటిగా చూస్తూ ప్రశ్నించాడు.

"....నీకు....వాగ్దానం చేస్తున్నా....దాటను! అన్నీ ఇచ్చేయ్!" సంగీతరావు వణికే కంఠంతో అన్నాడు.

శివరాం చిరునవ్వు నవ్వాడు. "ఇంకేం? నువ్వు కంచె దాటకపోతే, నేనూ మాటతప్పను! మొదట్నుంచీ

అంటున్న మాట ప్రకారం కాపీలు అన్నీ—అన్నీ—ఇచ్చేస్తా... ఒరిజినల్ అట్టి పెట్టుకుంటాను...."

"నో.... నే నొప్పుకోను!"

శివరాం ఒక్క వుదుటున కుర్చీలోంచి లేచాడు. ఫోల్డర్ని నిర్లక్ష్యంగా మూసి, చూపుల్ని సంగీతరావు వైపు తిప్పాడు.

"సంగీతరావ్ శ్రోత కోరిన విధంగా పాడనంత కాలం నువ్వు రాణించ లేవు! నా బేరాన్ని నా కాదనీ, నన్నూ మరిచిపో. వెళ్ళు. నీ కోకిలను లోపలికి పంపిస్తాను. కమ్మగా కబుర్లాడుకో!" శివరాం గిరుక్కున గుమ్మం వైపు తిరిగి. జోరుగా కదిలాడు.

"ఆగు!" సంగీతరావు అరిచాడు. శివరాం ఆగి, తిరిగి చూశాడు.

"స్కాండ్రల్, రా. కూచో. ఏం చేయాలో మళ్ళీ చెప్పు.. మరచిపోయాను...."

శివరాం నవ్వుతూ కూచున్నాడు. టేబుల్ మీదున్న కాలింగ్ బెల్ ని నొక్కాడు. తలుపు తోసుకుని ఆదరా బాదరా లోపలికి వచ్చి, సంగీతరావు వైపు భయభక్తులతో, ఆశ్చర్యంతో చూస్తున్న బంట్రోతుని చిరునవ్వుతో చూశాడు.

"మన ఎడిటర్ గారికి ఎయిర్ కండిషన్డ్ గదిలో వడదెబ్బ తగిలింది. ఏసీలో తగిలే వడదెబ్బ చాలా ప్రమాదం. వెళ్ళి రెండు స్ట్రాంగ్ కాఫీ, వేడివేడిగా ఆఘమేఘాలమీద పట్రా!" అన్నాడు శివరాం.

బంట్రోతు అర్థంకానట్టు చూశాడు.

"పరుగెట్టు! పట్టుకురా! శివరాం గదుముతూ ఆజ్ఞాపించాడు.

బంట్రోతు కంగారుగా పరుగెట్టాడు. శివరాం విగ్రహంలా కూచున్న సంగీతరావుని చిరునవ్వుతో చూశాడు "అలిసిపోయాను. కాఫీ తాగి, ఏం చేయాలో మళ్ళీ చెప్తాను!"

## 5

హోటల్ ఉల్లాస్.

212 గదిముందు అతను నిలబడ్డాడు. గదిలో వున్న లత ఏం చేస్తూ వుంటుందో ఊహిస్తూ చిరునవ్వు నవ్వుకున్నాడు. సిగరెట్ పీకని కిందపడేసి, బూటుతో నొక్కేశాడు. అతని చెయ్యి డోర్ హేండిల్ని పట్టుకుంది. తనకోసం ఎదురుచూస్తూ, తన రాకని క్షణాల లెక్కతో ఊహించి ఆమె గొళ్ళెం తీసేసి వుంటుంది. మూడొంతులు గొళ్ళెం పెట్టకుండానే ఉంచివుంటుంది. తనలాగే ఆమెకి ధైర్యం ఎక్కువ. లోకాన్ని చూసి ఆమె భయపడదు! భయం మనిషిని క్షేమంగా ఉంచుతుంది; అలాగే విజయానికీ దూరంగా ఉంచుతుంది అని ఆమెకీ తెలుసు....

తన ఆలోచనల్ని నిజంచేస్తూ లోపలికి కదిలిన తలుపుని పూర్తిగా తోస్తూ అతను గదిలోకి దూరాడు. తలుపు మూసి గొళ్ళెం పెట్టేశాడు. గదుల్లో సాగే కొన్ని నాటకాల్ని లోకం చూడకూడదు!

చేతిని కిందికి లాగుతున్న బరువుని ఓసారి తృప్తికరంగా చూసి, అతను లోపలగదివైపు కదిలాడు. తలుపు తోసుకుంటూ బెడ్ రూంలోకి దూరాడు. తనని చూస్తూ ఆనందంతో ఆమె ఎందుకో కేక పెట్టలేదు. సూట్ కేసుని టేబుల్ మీద పడేసి అతను మంచంవైపు చూశాడు. మంచంమీద ఆమె వెల్లకిలా పడుకుంది. లేత

ఆకుపచ్చరంగు చీరా జాకెట్. చేతుల్ని పక్కల్లో ఉంచుకుని, శాంతియుతంగా పడుకున్న ఆమె రూపం అతనికి క్లియోపాత్రా సినిమా చివర్లోని లిజ్ టేలర్ భంగిమని గుర్తు చేస్తోంది. అయితే ఆ సీన్‌లో లిజ్ టేలర్ — క్లియోపాత్ర మరణాన్ని అభినయించింది. ఇక్కడ ఆమె సజీవంగా ఉంది. నిద్ర నటిస్తోంది. ఉవ్వెత్తుగా కెరటంలా పైకిలేస్తున్న ఆమె పైట ఆ సంగతిని అతనికి చెప్తోంది.

అతను కదిలాడు. చప్పుడు కాకుండా, మెల్లిగా మంచంమీద కూచున్నాడు. కిందికి వొంగి బూట్లు విప్పేశాడు. మంచం కదలిక తెలీకుండా, ఆమెకి నిద్రాభంగం కలగకుండా విశ్రాంతిగా పడుకోవాలనుకుంటూ వెనక్కి వాలే ప్రయత్నం చేశాడు.

తటాలున రెండు చేతులు తీగల్లా అతన్ని చుట్టుకున్నాయి. "హాయ్!" అందామె.

ఆమెమీద అడ్డంగా, వెల్లకిలా పడిన అతను తలతిప్పి ఆమె మొహంలోకి నవ్వుతూ చూశాడు.

"దొంగా! నిద్ర నటించావ్!" అన్నాడు నవ్వుతూ శివరాం.

"ఊ! నటించడం నీకే వొచ్చనుకున్నావా? చూడు ఎలా వోడించానో!" లత నవ్వుతూ అంది.

శివరాం పైకిలేచి, ఆమెవైపు కొద్దిగా తిరిగి కూచున్నాడు.

"డార్లింగ్ ...."

"యస్?"

"చెప్పు!"

"ఏముందిక నువ్వూ నేనూ సేకరించిన ఇన్ఫర్మే

షన్‌తో కలిపిన సంగీతరావు జీవితచరిత్రని సంగీతరావుకే అమ్మేశాను...."

"ఎంతకో?"

"ఎంతో ఎక్కడిది. ఎక్కువడిగితే యిక్కట్లలో చస్తాడని భయమేసింది. ఓ నలభై చాలనుకున్నాను...."

"కేలా?"

శివరాం ఆమెని నవ్వుతూ చూశాడు. "హనీ, వందలూ వేలూ మరిచిపో. రూపాయి విలువ సంగీతరావు సెలెక్ట్ చేసి ప్రచురిస్తున్న కథల, నవలల స్టాండర్డులా దారుణంగా పడిపోయింది! మనం 'వ'కారం ఉపయోగించం. ఎప్పుడూ 'అ'కారమే!"

"గుడ్ గాడ్....నలభై లక్షలు! కక్కాడా?"

"బ్రాందీ, విస్కీ, బీరూ అన్నీ కలబోసి తాగిన వాడిలా కక్కాడు!"

"అంత సులభంగా కక్కాడా?"

"సులభంగా ఎవరూ కక్కలేరు. కళ్ళల్లో నీళ్ళు; గొంతులో మంట, కడుపులో రంగులరాట్నం, చెవుల్లో హోరు....ఇలాంటివన్నీ అనుభవిస్తూ కక్కుతాడు. సంగీతరావూ అలాగే కక్కాడు...."

"డార్లింగ్...."

"వాట్!"

"అతను....సంగీతరావో, సింగీతరావో-ప్రతీకారం..."

శివరాం నవ్వు ఆమెని అడ్డుకుంది.

"ప్రతీ-కారాలూ, మిరియాలూ నూరే స్టేజిలో అతను లేడు! జరిగిన నిర్వాకం గురించి భార్యకు,—చివరికి తోకలకి కూడా చెప్పుకోలేడతను!"

"డార్లింగ్....స్టేట్ మెంట్ ఇచ్చిన రచయితలకి

పాఠకోపకం అందేలా చూస్తున్నావుగా?"

"చూసేశాంగా!" శివరాం నవ్వుతూ అన్నాడు. "స్టేట్ మెంట్స్ ఇచ్చినప్పుడే వాళ్ళకి చేతినుండి పే చేసేశాను. అయితే అందరికీ కాదు. వాళ్ళ నకలల్ని అలా, అలా తిరగేశాను. సత్తా ఉన్నవాళ్ళకి, ఏడుగురికి మాత్రం ఇచ్చేశాను. తతిమ్మా వాళ్ళ కలంకారీతనం దండగ. ఆ చెత్తనంతా ఓపిగ్గా చదివిన కంపోజిటర్స్ కీ, ప్రూఫ్ రీడర్స్ కీ, పాఠకులకీ ఇవ్వాలి నిజంగా! అయితే వాళ్ళెవరో మనం కనిపెట్టలేం. అంచేత మనకి యాభైవేల దాకా ఖర్చయింది. తతిమ్మా పైకం మన నికరాదాయం!"

లత అతన్ని పెద్ద పెద్ద కళ్ళతో చూసింది. "డార్లింగ్... ముందే సంగీతరావునుండి గుంజాలోకముందే ఇచ్చావ్? ఇక్కడ కథ అడ్డం తిరిగివుంటే....?"

శివరాం రెండు చేతుల్తో ఆమె బాబ్డ్ హెయిర్ని సవరిస్తూ బుగ్గల్ని అదిమాడు. "మనం కన్న కథ ఎప్పుడూ అడ్డం తిరగదుగా! ఫలానా వ్యక్తి మనకి ఇవ్వాలని మనం నిర్ణయిస్తే, ఆ ఫలానా వ్యక్తి నిజంగానే ఇస్తాడుగా!"

బుగ్గల్ని నొక్కుతున్న శివరాం చేతుల్ని లత తన చేతుల్తో అదిమింది. "డార్లింగ్.... పదిహేనురోజులుగా ఈ ఊళ్ళో బోర్ కొట్టేసింది!"

"అయితే పైకి లేయ్! నేను సిగరెట్ ముట్టిస్తాను. ఈలోగా డిటెక్టివ్ టెంపో నంబరు డయల్ చేయి. శివరాంగారు మాట్లాడతారని చెప్పు. రిసీవర్ నా చేతికి తగిలించు. సంభాషణ ముగించేలోగా మరో చీర కట్టి సింగారించుకో! వెంటనే బయల్దేరదాం!"

## 89

సిగరెట్ కాలుస్తున్న శివరాంని లత క్షణకాలం చూస్తూ ఉండిపోయింది. సీలింగ్ వైపు పొగ రింగ్ ఊది, శివరాం ఆమెని నవ్వుతూ చూశాడు.

"డార్లింగ్ ...., కెంపోని వదిలేయ్...." అందామె మెల్లిగా.

శివరాం పకపక నవ్వాడు. "ఇంకా పట్టుకోలేదుగా!"

['శివరామ్ అడ్వెంచర్స్' సీరిస్‌లో ఇది 8 వ నవల]

—: ఐపోయింది :—

# టెర్రరిజం

## బొమ్మిడి అచ్చారావు

ఇరాన్ ఇరాక్‌ల మధ్య ఆరని రావణ కాష్ఠం!

శ్రీలంకలో తమిళుల ఊచకోత!

పంజాబ్‌లో ఉగ్రవాదుల స్వైరవిహారం! హత్యలు, దారుణ మారణకాండ!

డార్జిలింగ్‌లో ఘూర్ఖాల తీవ్రస్థాయి చేరిన ఆందోళన, దౌర్జన్య హింసాకాండ.

దేశవిదేశాల్లోని పరిస్థితి ఇలా వుంటే రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లో తీవ్రవాదుల లూటీలు, దహనకాండ, హత్యలు! ఐ.ఏ.ఎస్. ఆఫీసర్ల కిడ్నాపింగ్!

దేశంలో ఏమూల చూసినా ఆందోళనలు, అలజడులు, అల్లర్లు, పరిష్కారంలేని, పరిష్కారం దొరకని సమస్యలు!

ఎటు చూసినా—

టెర్రరిజం! టెర్రరిజం!! టెర్రరిజం!!!

ఉగ్రవాదం! ఉగ్రవాదం!! ఉగ్రవాదం!!!

మనిషి ప్రాణానికి పూచికపుల్లంతయినా విలువ

లేకుండా పోయింది. హింసతో నే తప్ప తమ కోరికలు నెరవేరవనే గుడ్డినమ్మకంతో మనిషి సాటిమనిషిని నిర్దాక్షిణ్యంగా హత్యచేస్తున్నాడు. నెత్తుటి మడుగులో స్నానం చేస్తున్నాడు. మానవత్వం అనేది కేవలం పుస్తకాల వరకే పరిమితమైపోతోంది. నీతి, నిజాయితీ, ధర్మవర్తన అన్నపదాలకి అర్ధమే మారిపోతోంది.

ఏమైపోతోంది? ఈదేశం ఎటుపోతోంది?

మనిషి మనుగడ నానాటికీ దుర్భరమై మరుక్షణం ఏమైపోతుందో ననే భయంతో, బెంగతో, పక్కనున్నవాడ్ని, ఎప్పుడు మీదపడి చంపేస్తాడోనని అనుమానంగా చూస్తూ ప్రతీక్షణం చచ్చి బతుకుతున్నాడు నేటి మానవుడు. తననీడనే శంకించుకుంటున్నాడు!

దీనికి అంతెప్పుడు? మనిషి సుఖసంతోషాలతో, ప్రాణభయం లేకుండా గుండెలమీద చేతులు వేసుకుని హాయిగా నిద్రపోయే రోజెప్పుడు? అసలా రోజు వస్తుందా?

బహుశా, రాదేమో!

రెండుదేశాల మధ్య కలహాలను, యుద్ధాలను ప్రేరేపించి ఆ దేశాలు రెండూ కొట్టుకు చస్తే చెరోదేశాన్ని ఆయుధాలతో ఆదుకొని ప్రపంచయుద్ధాన్ని సృష్టించటానికి సంపన్న దేశాలు, అగ్రరాజ్యాలు ఎదురుచూస్తున్నాయి. అందుకు పరోక్షంగా సహాయపడుతున్నాయి. తమ సత్తా చూపించుకోవాలని తహతహ లాడిపోతున్నాయి. బడుగురాజ్యాల్ని తమ పావులుగా చేసుకుని దారుణమైన చదరంగమాడుతున్నాయి. అది తెలియని అమాయక పావులు తమ అస్తిత్వాన్నే కోల్పోతున్నాయి.

'భగవాన్ నాదేశాన్ని కలకాలం స్వర్గసీమగానే వుండనివ్వు. ఎలాంటి పాపపంకిలం అంటకుండా పునీతనుగా వుండనీ ప్రభూ!'

పేపరు మడచి పక్కన పడేసి, మనసులోనే భగవంతుని స్మరించుకున్నాడు డిటెక్టివ్ కిరణ్—వేదనగా కణతలు రుద్దుకుంటూ.

# 1

మెత్తటి తారురోడ్డుమీద సాఫీగా దొర్లిపోతోంది షెవర్లెట్ కారు.

గోపీనాథ్ కారు నడుపుతున్నాడు. భార్య వెనక సీట్లో హాయిగా నిద్రపోతోంది. ఆమెపక్కనే పన్నెండేళ్ళ కూతురు, తొమ్మిదేళ్ళ కొడుకు గాఢనిద్రలో వున్నారు.

డ్రైవింగ్ సీట్ పక్కసీట్లో పెద్దకొడుకు రవీంద్ర—ఇరవయ్యేళ్ళవాడు—నిద్రపోతూ మధ్య మధ్య లేచి బయటికి చూస్తూ మళ్ళీ నిద్రకొరుగుతున్నాడు.

గోపీనాథ్ కుటుంబంతో తిరుపతి బయలుదేరివస్తున్నాడు. తెల్లారేసరికి తిరుమలలో తను బుక్ చేసిన కాటేజిలో దిగి దర్శనం వగయిరా పూర్తిచేసుకుని సాయంత్రానికి కొండదిగి తమ వూరికి తిరుగుప్రయాణం చేసుకోటానికి ప్లాన్ చేసుకున్నాడు. అందుకే రాత్రి ప్రయాణాన్ని ఎన్నుకున్నాడతను.

అతడు లక్షల్లో వ్యాపారం చేస్తున్నాడు. ఒక్కరోజు అతను షాపులో లేకపోతే కొన్ని వేల రూపాయల వ్యాపారం దెబ్బతింటుంది. అందుకే సాధారణంగా అతను ఇల్లు, ఊరు వదలిపెట్టి వెళ్ళడు.

అయితే ఇప్పుడు దేవుడితో పనొచ్చింది. అందు

లోనూ ఏడుకొండలవాడి పనిమీద వెళుతున్నాడు. అయనలో ఏమాత్రం తేడా రాకూడదు. తేడా వస్తే ఆయన ఊరుకోడు. వడ్డీతో బాటు రాబడతాడు. తనకో కాంట్రాక్టులో కొన్ని లక్షల లాభం వచ్చింది. అందులో పదిశాతం స్వామి హుండీలో స్వయంగా వేస్తానని మొక్కుకున్నాడు.

తమిద్దరి మధ్య ఒప్పందం హుండీలో ఆ మొత్తాన్ని వెయ్యటంతో పూర్తవుతుంది. అందుకు కేవలం ఒకే ఒక రోజు కేటాయించాడు. అందుకే రాత్రి ప్రయాణం, పగలు దర్శనం ఏర్పాటు చేసుకున్నాడు గోపీనాథ్.

రాత్రి రెండున్నర గంటల సమయం! అప్పటికి దాదాపు నాలుగుగంటల నుంచి కార్లో ప్రయాణిస్తున్నారు. మరో రెండు గంటల పైచిలుకు ప్రయాణం ముందుంది. తిరుపతి తెల్లారేలోపల చేరుకుంటే, అన్ని పనులు అనుకున్నట్టు జరుగుతాయి అందుకే మధ్యలో ఎక్కడా విశ్రాంతి తీసుకోకుండా కారు నడుపుతున్నాడు గోపీనాథ్.

అతని కారుకి డ్రైవరున్నాడు కాని అతన్ని ఇలాంటి ప్రయాణానికి వెంట తీసుకు వెళ్ళడు గోపీనాథ్. అందునా లక్షలతో బయల్దేరేటప్పుడు పరాయిమనిషిని నమ్మక పోవటం అతని వ్యాపార లక్షణం!

అందుకే తనే డ్రైవ్ చేసుకుంటున్నాడు. నిద్ర నదుపులో పెట్టడం డబ్బు సంపాదించినంత సులభం అతనికి! అతని అవయవాలన్నీ అతని కంట్రోల్లోనే వుంటాయి. రోజుకి కేవలం నాలుగుగంటలుమాత్రమే నిద్రపోయే గోపీనాథ్ అవసరమైతే ఆ నాలుగంటలుకూడా మెలకువగానే వుండగలడు. శరీరానికి అలా తర్ఫీదు నిచ్చా

డతను. కనీసం అలసిపోయిన మెదడుకికూడా విశ్రాంతి నివ్వడతను.

కారు ఘాట్ రోడ్ మీదుగా పోతోంది. హెడ్ లైటు వెలుతురులో పాము మెలికల్లాగా నల్లగా నిగనిగ లాడుతూ కనిపిస్తోంది రోడ్డు. చుట్టూ జాట్లు విరబోసు కున్న దయ్యాల్లాగా దట్టంగా పెరిగిన చెట్లు! మధ్య మధ్య డేంజర్ కర్వ్స్!

ఓ గంట ప్రయాణం కలిసివస్తుందని ఊళ్ళోనించి వున్న సీదా రోడ్డును వదిలి ఘాట్ రోడ్ మీదుగా వాహనాన్ని మళ్ళించాడు గోపీనాథ్. అతని జీవితంలో గంట విలువ కొన్ని వేల రూపాయలు!

సడన్ బ్రేక్‌తో కారు నాపాడు గోపీనాథ్! నిద్ర పోతున్న భార్య, కొడుకులు, కూతురు చటుక్కున మేల్కొన్నారు ఆ అదరుకి.

గోపీనాథ్ నిర్ఘాంతపోయి పిచ్చివాడిలా రోడ్డుమీదికి చూస్తూ శిలాప్రతిమలా కూచుండిపోయాడు.

రోడ్డుమీద నలుగురు సాయుధులైన వ్యక్తులు పోత పోసిన కంచు విగ్రహాల్లా, మూర్తీభవించిన రాక్షసుల్లా, కరడుగట్టిన కిరాతకుల్లా చేత ఆయుధాలు ధరించి యమ భటుల్లా కనిపించారతనికి.

వాళ్ళని మొదట చూడగానే పక్కనుంచి వేగం పెంచి దూసుకుపోవాలనుకున్నాడు గోపీనాథ్. కాని వాళ్ళు అప్పటికే గన్స్ గురిచేసి కాస్తకూడా దారి వదల కుండా రోడ్డును పూర్తిగా కవర్ చేసేసి నిల్చుని వుండ టంతో గత్యంతరంలేక బ్రేక్ మీదికి కాలును పోనిచ్చాడు.

కారాగిన మరుక్షణం వాళ్ళు నలుగురు కారును చుట్టు

చుట్టేశారు.

"నువ్వు గోపీనాథ్‌వి, అవునా?" అనడిగాడు అందులో ఒకడు. పర్వతంమీదినుంచి బండరాయి దొర్లినట్టు ధ్వనించిందతని గొంతు.

అప్రయత్నంగా తలూపాడు గోపీనాథ్.

నాలుగు గన్స్ అమాంతం పైకి లేచి పొజిషన్‌లోకి వచ్చాయి.

గోపీనాథ్ ప్రమాదాన్ని గుర్తించాడు. వాళ్ళు దారి దోపిడి దొంగలై వుంటారని గ్రహించాడు. ప్రాణంకన్న డబ్బు విలువైనదికాదని గ్రహించలేని అవివేకి కాదతను! ప్రాణముంటే కోట్లు సంపాదించవచ్చు. కాని నోట్లు పెట్టి ప్రాణాన్ని కొనుక్కోలేము.

గోపీనాథ్ వ్యాపారస్తుడు. లక్షల్లో మునిగి తేలుతున్న ఆరితేరిన వ్యాపారి!

"మీకు కావలసింది డబ్బేకదూ. ఇదుగో నాలుగు లక్షలు... తీసుకోండి.... అంతేకాదు నా భార్యాబిడ్డల దగ్గరున్న బంగారం కనీసం రెండు లక్షలు వుంటుంది. టేకిట్!" బ్రీఫ్‌కేసుని గ్లాస్ విండోలోంచి అందించాడు గోపీనాథ్.

అప్పటికే అతని భార్యాపిల్లలు ప్రాణభయంతో బిక్కచచ్చిపోయారు. అతని భార్య, భర్త డబ్బుకి తన వాడి ప్రాణాలను బలిపెట్టేస్తాడేమోనని భయపడింది. కాని అతను ధైర్యంగా డబ్బున్న బ్రీఫ్‌ని దొంగల కందించటం చూశాక తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

చకచక తన నగలు, కూతురి నగలు ఒలిచి దోసిలితో విండో బయటకు చాచింది.

అయితే వాళ్ళ ఊహల్ని, అంచనాలని తారుమారు

చేస్తూ వాళ్ళ చేతుల్లోని గన్స్ కర్కశంగా ధ్వనించాయి.

ఓ గుండు గోపీనాథ్ కపాలంలోంచి, మరోటి అతని కంఠంలోంచి దూసుకుపోయింది.

ఓ గుండు గోపీనాథ్ భార్య దోసిలిని కర్కశంగా చీల్చుకుంటూ ఆమె గుండెల్లోంచి, మరోటి ఉదరకుహరంలోనుంచి ప్రయాణం చేశాయి.

మరో మూడుగుళ్లు గోపీనాథ్ పిల్లల ప్రాణాల్ని బలి తీసుకున్నాయి.

నెత్తురు, నెత్తురు, నెత్తురు!

కారంతా నెత్తుటి మడుగుతో నిండిపోయింది. అంత వరకు తుపాకిగుళ్ళతో మార్మోగిపోయిన ఆ ప్రదేశం ఒక్కసారిగా భీకర మౌనం వహించింది. పెను భూతాల్లా నిలుచున్న చెట్లు జరిగిపోయిన దారుణ మారణకాండకు సాక్షీభూతాల్లా వున్నాయి.

అక్కడంతా ప్రశాంతత!

స్మశాన ప్రశాంతత!!

## 2

ఎందుకో చటుక్కున మెలకువ వచ్చింది అరుణ్ జైన్ కి.

అది మామూలుగా వచ్చే మెలుకువ కాదని, అసాధారణమైన సంఘటనో, అస్వాభావికమైన పరిస్థితో ఎదుర్కోబోతున్నానని అతని సిక్స్త్ సెన్స్ చెపుతోంది.

అలర్టుగా చెవులు రిక్కించి విన్నాడు.

నడవాలో ఎవరో నడుస్తున్న అలికిడి అతనికి లీలగా వినిపించింది.

అరుణ్ జైన్ గుండె ఆగి కొట్టుకున్నది.

ఎవరో అటే మెల్లిగా అడుగులో అడుగు వేసు

కుంటూ వస్తున్నారు.

ఎవరు?

దొంగా? లేకపోతే అర్ధరాత్రి ఇంట్లో ఎవరు జొర బడతారు?

అతనికి ఆ ఆలోచన రాగానే ముచ్చెమటలుపోశాయి. తను వడ్డీ వ్యాపారంమీద, స్మగ్లింగ్ గూడ్సుమీద సంపాదించినదంతా తన గదిలోనే ఐరన్ సేఫ్‌లో దాచుకున్నాడు.

ఆ సేఫ్ తనకి తప్ప మరో వ్యక్తికి తెరవటం దుస్సాధ్యం! దాన్ని తెరవటానికవసరమైన కోడ్ నంబరు తన మెదడులో సంక్షిప్తమై వుంది. చివరికి తన భార్యకి, కొడుక్కి కూడా దాని రహస్యం తెలీదు.

ప్రమాదవశాత్తు తను చనిపోయినా ఆ రహస్యం తనతోనే సమాధి అయిపోతుంది. అయినా తనుపోయాక ఆ సేఫ్‌తో తనకేం పని?

కైన్ పెదాలమీద లీలగా చిరునవ్వు లాస్యం చేసింది. అంతలోనే తనిప్పుడో విపత్కర పరిస్థితి నెదుర్కో బోతున్న నిజం గుర్తువచ్చి అతని ముఖంలో చిరునవ్వు అదిరిపోయి, ఆందోళన భయం ముద్ర వేసుకున్నాయి.

తను విదేశీవస్తువులు స్మగ్లింగ్ చెయ్యటంలో ఆరి తేరిన వాడు. షిప్ నుంచి చిన్న చిన్న నాటు పడవలద్వారా టేప్ రికార్డర్లు, వీడియో కెమెరాలు, వీసీఆర్ లు, వాచీలు ఇంకా ఈ దేశంలో దొరకని అపురూప వస్తువులెన్నో తీరం చేర్చి, కస్టమ్స్ కళ్ళుగప్పి తన గొడౌన్స్‌కి చేర్చి బిజినెస్ చేస్తుంటాడు తను. ఇంతవరకు ఎప్పుడూ ఎవరికీ పట్టుబడ కుండా ఎంతో మెలకువగా తప్పించుకుంటూ వచ్చాడు.

ఎవరిదగ్గరా దొరకని అపురూప వస్తువు తన దగ్గరుం దని ప్రజలు తన షాపుమీదికి ఎగబడగానే దాని రేటు విపరీతంగా పెంచేస్తాడు. అవతలి వ్యక్తి అంతకన్న విప రీతమైన క్రేజ్‌తో దాన్ని తను చెప్పిన ధరకి ఎగరేసుకు పోతాడు.

కేవలం కస్టమర్ క్రేజ్‌ని బట్టి ఆ వస్తువుల ధరలు విప రీతంగా పెరిగిపోతాయి. కస్టమర్ నాడి తనకి బాగా తెలుసు కాబట్టే రూపాయి వస్తువుని పదికి అమ్మి విపరీత లాభాల నార్జించగలిగాడు, గలుగుతున్నాడు.

తన గొడౌన్ మీద చాలాసార్లు దాడులు జరిగాయి. కాని స్వదేశీ వస్తువులు తప్ప విదేశీ వస్తువు లెప్పుడు ఎవ రికీ దొరకలేదు. తను ఒక్కొక్క స్మగుల్డ్ గూడ్స్‌ని ఒకో చోట భద్రపరుస్తాడు. కస్టమర్ తనదగ్గర కొచ్చిన వెంటనే అతను నిజమైన కస్టమరో, లేక కస్టమ్స్‌వాత్రీయో చాలా తేలిగ్గా కనిపెట్టేస్తాడు.

ముందు తన దగ్గర అలాంటి వస్తువు లేవీ దొరకవని చాలా మర్యాదగా సమాధానం చెపుతాడు. నిజమైన కస్టమర్ అయితే వెంటనే తిరిగి వెళ్ళిపోవటానికి సిద్ధం కావటం జరుగుతుంది. అప్పుడతన్ని వెనక్కి పిలిచి ఆ వస్తువు తనకి తెలిసిన మనిషి దగ్గరుందేమో ప్రయత్నిస్తా నంటాడు. కస్టమర్ ఆసక్తి కనపరుస్తే ఫోన్‌లో ఎవరెవ రినో కాంటాక్టుచేసి మాట్లాడతాడు. 'సారీ, అతని దగ్గర కూడా లేదండీ' అంటాడు.

కస్టమర్ ఆసక్తి, ఆ వస్తువుపట్ల మోజు అంతక్రితం కన్న రెట్టింపయిపోతాయి. ఎంతయినా చెల్లించి దాన్ని పొందాలనిచూస్తాడు. అదిగో, అతని ఆ బలహీనతనే క్యాష్ బాగా సొమ్ము చేసుకుంటాడు. కస్టమర్ని మరో

గంటో, రెండుగంటలో పోయాక రమ్మంటాడు. ఏల యితే ప్రయత్నిస్తానంటాడు. గ్యారంటీ ఇవ్వలేనంటాడు.

అయినా కస్టమర్ అతన్ని వదలడు. ఇబ్బంది పెడ తాడు. మొహమాట పెడతాడు. అతను అర్జన్సీ ఫీలయ్యే కొద్దీ అరుణ్ జైన్ బెట్టు చేస్తాడు. బతిమాలించుకుంటాడు. కస్టమర్ ఠంచనుగా తను చెప్పిన టైంకి వచ్చేస్తాడని అత నికి తెలుసు. అతని అంచనా అక్షరాలా జరిగితీరుతుంది. కస్టమర్ కనకవర్షం కురిపిస్తాడు.

కస్టమర్ ఎవరో, కానిదెవరో కని పెట్టడానికి అతని కున్న పద్ధతులతనికున్నాయి. వాటి నతడు తు. చ. తప్ప కుండా అనుసరిస్తాడు. వాటిలో అతనెప్పుడూ విఫల మవ్వలేదు.

అతను వ్యాపారంలో తోటి వ్యాపారిని ఎన్నడూ నమ్మడు. కాని నమ్మినట్టు నటిస్తాడు. నటిస్తున్నట్టు తెలి యనివ్వడు. అది అతనికి వెన్నతో పెట్టిన విద్య. 'నమ్మకం లేకపోతే వ్యాపారం చెయ్యటం కష్టం' అన్న రూలు అతనికి వర్తించదు.

అరుణ్ జైన్‌ను ఆలోచనలనుంచి బయట పడేసింది దగ్గరవుతున్న అడుగుల చప్పుడు.

లంకంత కొంపలో తను, భార్య, కొడుకు—ముగ్గురే! గూర్ఖాలని, పనివాళ్ళని పెట్టుకోడు జైన్. వాళ్ళకి తన గుట్టుమట్లు తెలిసిపోతాయని అతని స్థిరమైన అను మానం!

రెండురోజుల క్రితం తమ స్వస్థలమైన రాజస్థాన్‌లోని ఓ కుగ్రామం వెళ్ళారు భార్యాకొడుకూను. ఓ ముఖ్యమైన పెళ్ళికి హాజరవటానికి! తనూ వెళ్ళాల్సినదే. కాని, ఊపిరితిరగని వ్యాపారం. ఒక్కరోజు కాదుగదా, ఒక్క

గంట తను లేకుంటే కస్టమర్లు చాలా బాధపడిపోతారు!

తను స్మగ్లింగ్ వస్తువులు రహస్యంగా అమ్మితే, వడ్డీ వ్యాపారం పబ్లిగ్గా చేస్తాడు. బంగారు వస్తువులు, వాచీలు, స్కూటర్లు, వెండిగిన్నెలు వగయిరా తాకట్టు పడతాడు. తను వడ్డీ చాలా రీజనబుల్ గా వసూలు చేస్తాడు. తనలాగే ఈనగరంలో వస్తువులమీద అప్పు లిచ్చే షేర్ లు కనీసం ఏభైమందికి పైబడే వున్నారు. వారిలో ముప్పాతికమంది వడ్డీవ్యాపారం వెనక విదేశీ వస్తువుల్ని అమ్ముతున్నవాళ్ళే!

అయితే ఆ సంగతి బహిరంగ రహస్యం! అధికార వర్గాల్లో చాలామందిని డబ్బుతో తాము కట్టిపడేస్తుంటారు. అది కూడా బహిరంగ రహస్యమే! అయితే ఈ బహిరంగ రహస్యాల గురించి ఎవరూ పట్టించుకోక పోవటమే అసలైన బహిరంగ రహస్యం.

అడుగులసవ్వడి దగ్గరపడుతున్నకొద్దీ అరుణ్ జైన్ గుండె స్పందన హెచ్చింది. అప్రయత్నంగా అతని చెయ్యి పరుపుకింద దాచిన రివాల్వర్ మీదికి వెళ్ళింది.

మెల్లిగా దాన్నందుకుని పైకి లేచాడు. తన గది తలుపులు లోపల్నుంచి భద్రంగా బంధించి వున్న సంగతి కన్ఫర్మ్ చేసుకున్నాడు. కిటికీ తలుపుమాత్రం ఒకటి తెరచి వుంది. దాంట్లోంచి చూస్తే నడవా స్పష్టంగా కనిపిస్తుంది.

తన గది తలుపులు ఏబ్యాంకులోని స్ట్రాంగ్ రూం తలుపులకన్న తీసిపోనివిధంగా చాలా బలమైన ఉక్కుతో చేయించాడు. గదిలోపలికి దోమకూడా చొరనియ్యకుండా చాలా పకడ్బందీగా తయారుచేయించాడు.

అందుకే తనకి దొంగలవల్ల ఈనాటివరకూ భయంలేకుండా నిశ్చింతగా జరిగిపోయింది. అదే ధైర్యం జైన్ కి!

అయితే ఆ దొంగ లోపలి కెలా ప్రవేశించాడు? తన ఇంట్లోని తలుపులన్నీ ఉక్కుతో తయారుచేయబడ్డవే మరి! రాత్రి నిద్రపోయే ముందు అన్ని తలుపులు చెక్ చేసి మరీ నిద్రపోతాడు తను. ఆ నిద్రకూడా కోడి కునుకే! చీమ చిటుక్కుమంటే మెలకువ వచ్చేస్తుంది. ఇప్పుడూ అలాగే మెలకువ వచ్చింది.

అరుణ్ జైన్ కిటికీ తలుపు దగ్గరకు చేరుకుని బయటికి, నడవాలోకి తొంగిచూశాడు.

అంతే!

ఒక్కసారిగా నాలుగైదు బుల్లెట్లు అతని కళ్ళలోనించి ముక్కులోనించి నోట్లోనించి గొంతులోనించి ఊహించనంత వేగంగా దూసుకుపోవటం, నిల్చున్నవాడు నిల్చునే ప్రాణాలు వదలటం, దబ్బున అతని భారీ శరీరం నేలను కరచుకోవటం చాలా కాజువల్ గా జరిగిపోయింది.

కిటికీ బయట సాయుధులై నిల్చున్న ఆ నలుగురు ముష్కరులని, అతను, ప్రాణం పోకుండా వుంటే— చూడగలిగివుండేవాడు.

సాయుధులైన ఆ నలుగురు వ్యక్తులు పోతపోసిన కంచు విగ్రహాల్లా, మూర్తీభవించిన రాక్షసుల్లా, కరడు గట్టిన కిరాతకుల్లా, చేత ఆయుధాలున్న యమభటుల్లా వున్నారు.

ఆ తర్వాత అక్కడంతా ప్రశాంతత!

స్మశాన ప్రశాంతత!!

# 3

"నగరంలో ఏమూల చూసినా హత్యలు, దోపిడీలు, దారుణ మారణ కాండలు, గృహదహనాలు చెలరేగి పోతున్నాయి. శాంతిభద్రతలు పూర్తిగా క్షీణించి పోయాయి. ప్రజలు భయభ్రాంతులై పోతున్నారు. అర చేతుల్లో ప్రాణాలు పెట్టుకుని క్షణక్షణం గండంగా గడుపుతున్నారు. ప్రభుత్వాన్ని, మన పోలీసు శాఖను దుమ్మెత్తిపోస్తున్నారు. మన అసమర్థతను వేలెత్తి చూపుతున్నారు. ఇది మనందరికీ పరీక్షాసమయం. మన శక్తి సామర్థ్యాలను నిరూపించుకోవలసిన సమయం. మన పరువు మర్యాదల్ని డిపార్టుమెంటు ప్రతిష్ఠను నిలబెట్టుకో వలసిన సమయం. మీలో ప్రతిఒక్కరు చిత్తశుద్ధితో పని చేసినప్పుడే మనమీ గడ్డుపరిస్థితి నెదుర్కొని దుండగుల్ని అణగదొక్కి శాంతిభద్రతల్ని పునరుద్ధరించగలుగుతాం...." తన గంభీర ఉపన్యాసాన్ని ఆపి అక్కడ సమావేశమై వున్న పోలీసు ఉన్నతాధికారుల్ని కలియ చూశాడు కమీషనర్ ఆఫ్ పోలీస్.

ఆ గదిలో ఆయనతోబాటు పోలీసు శాఖలోని అత్యున్నతాధికారులైన ఎ.సి.పి, డి.జి.పి, తక్కిన అధికారులు, ఇంటలిజెన్స్ డిపార్టుమెంటుకి చెందిన ఉన్నతాధికారులు, వారి సిబ్బంది సమావేశమై ఉన్నారు.

కమిషనర్ గొంతులో ధ్వనించిన పట్టుదల, కమాండ్ ఆవేదన అక్కడున్న ప్రతి అధికారిమీద ప్రభావం చూపాయి.

అందరు చెవులు రిక్కించి వింటున్నారు. కమిషనర్ వైపు కళ్ళప్పగించి శ్రద్ధగా చూస్తున్నారు.

కమిషనర్ గంభీరస్వరం ఆ హాల్లో మరోసారిమార్మో

గింది.

"గత పదిరోజులుగా నగరంలో పదమూడు హత్యలు జరిగాయి. దాదాపు అందరు డబ్బున్న కోటీశ్వరులే. ఏదో విధంగా సంఘంలో పేరు సంపాదించుకున్నవాళ్ళే. అయితే ఈ హత్యలు డబ్బుకోసం జరిగినవికావని ఘంటాపథంగా మనకి తెలిసిపోయింది. ఎవరి దగ్గర్నుంచి ఒక్క పైసా కూడా హంతకులు తీసుకుపోలేదు. బీరువా తాళాలు వేసినట్టే వున్నాయి. ఎక్కడి వస్తువు అక్కడ. ఎక్కడి సొమ్ము అక్కడ అతిభద్రంగా వున్నాయి. అంటే, హంతకులకి డబ్బాశలేదు. వాళ్ళ హత్యలు, దారుణాలు ఏదో ప్రయోజన మాశించి చేస్తున్నారని అనుకోవాల్సి వస్తోంది.

"ఈ హత్యలతోబాటు నాలుగు గిడంగులు, మూడు పెద్ద ఫర్నిచర్ షాపులు తగలపెట్టబడ్డాయి. నగర శివార్లలో ఓ ప్రయివేటు వ్యక్తి నడుపుతున్న ఓ ఫ్యాక్టరీమీద దుండగులు బాంబులువేసి నామరూపాలు లేకుండా ఫ్యాక్టరీని నాశనం చేసేశారు. అయితే, బాంబువెయ్యటానికి ముందు లోపల పనిచేస్తున్న వర్కర్సుని, సిబ్బందిని, ఖాళీచేసి బయటకు వెళ్ళిపోవలసిందిగా హెచ్చరికలు చేసి మరీ బాంబు వేశారు. అంటే వాళ్ళ కక్ష ఫ్యాక్టరీ యజమానిమీదే గాని, తక్కిన సామాన్యుల మీద కాదని అర్థమవుతోంది. ఈ హత్యల్ని, విధ్వంసాన్ని బట్టి ఆలోచిస్తే దుండగులకి పెట్టుబడిదారీవ్యవస్థమీదే పగ ప్రతీకారం వున్నట్టు తెలుస్తోంది."

ఎ. సి. పి లేచి నిలుచుని. "యు ఆర్ రైట్ సర్! వాళ్ళు సామాన్యుల జోలికి పోవటంలేదు. ఎదురుగా లక్షల కోట్ల రూపాయలు కనిపించినా వాటిని ముట్టడం

లేదు. అంతా క్షణాలమీద పూర్తి చేసుకొని వెళ్ళి పోతున్నారు. నగరాన్ని, నగరంలోని ధనికుల్ని, శాంతి భద్రతల్ని ఇంతగా అల్లకల్లోల పరుస్తున్న ఈ టెరా యిస్ట్స్ని అంతుచూస్తాం సర్!" అన్నాడు ఉద్రేకంగా.

కమీషనర్ తలూపి, "ఇప్పటికే మన అసమర్థతమీద ప్రతిపక్షాలు అస్సెంబ్లీలో పెద్ద దుమారం లేవదీశారు. ప్రభుత్వం మనమీద చాలా ఒత్తిడి తెస్తోంది. నగరం లోని పోలీసు బలగం చాలదంటే జిల్లాలనుంచి కూడా బలగాన్ని రప్పిస్తామంటున్నారు హోంమంత్రి. అయితే జిల్లాలలో కూడా ఈ దుండగులు తమ ఆగడాలు మొద లెట్టినట్టు వార్తలందాయి. కాకినాడలోని ఇద్దరు సేఠ్స్ని నిర్దాక్షిణ్యంగా చంపేశారు. అరుణ్ జైయిన్ అనబడే ప్రసిద్ధ వడ్డీవ్యాపారిని దారుణంగా చంపారు. మరో సేఠ్ పట్వారి లాల్ కూడా వడ్డీ వ్యాపారే! అలాగే రాజమండ్రి, విజయవాడ, తిరుపతి, వైజాగ్, ఖమ్మం, కర్నూలు, అనంతపూర్ మొదలైన ముఖ్యమైన పట్టణాల్లో కూడా అలాంటి సంఘటనలు జరిగాయి. వాటిలో కలుపుకుంటే హతుల సంఖ్య ఎనభై నాలుగుకి పెరిగింది. అంతేకాదు గోపినాథ్ అనబడే ఓ ప్రముఖ పారిశ్రామిక వేత్తని తిరుపతి వెళుతుండగా గిద్దలూరు సమీపంలోని ఘాట్ రోడ్ వద్ద కుటుంబసమేతంగా చంపేశారు. ఆయన ఈ నగరానికి చెందిన వాడే!.... ఇలా చెప్పాలంటే యెన్నో దారుణమరణకృత్యాలు. యూ షుడ్ బి ఎ షేమ్డ్ ఆఫ్ అవర్ ఇనెబిలిటీ" ఉద్రేకపూరితంగా అన్నాడు.

పోలీసాఫీసర్లు ఆయన మాటలకు సిగ్గుపడుతున్నట్టుగా

తలలు దించుకున్నారు.

కమీషనర్ అంతలోనే ఉద్రేకాన్ని అణచుకుని, "నా మాటలు మీకు బాధ కలిగించి వుంటే... అయామ్ సారీ....బట్ ఇటీజ్ నేకెడ్ ట్రూత్! ఒన్ కెనాట్ డినై ఇట్! ఈ క్షణంనించి మనం ఆ తీవ్రవాదుల్ని సమూలంగా నాశనం చెయ్యటానికి కంకణం కట్టుకుందాం. ఉయ్ మస్ట్ కేచ్ దెమ్ ఎలైవ్ ఆర్ డెడ్!" అన్నాడు.

"ఉయ్ స్వేర్ సర్! మేము తప్పక ఆ దుండగుల్ని ప్రాణాలతోగాని శవాలుగాగాని పట్టుకుంటాం. ఈ క్షణంనించీ ఆ పనిమీదే వుంటాం!" అందరు ముక్త కంఠంతో శపథం చేశారు.

కమిషనర్ ముఖంలో, సంతృప్తి, తన స్టాఫ్ పట్ల అభిమానం—ప్రకటితమయ్యాయి.

"లెటజ్ హోప్ ది బెస్టు!" అన్నాడు కమిషనర్.

## 4

అతను నడుపుతున్న జీప్ ఊరి పొలిమేరల్లో ఆగింది.

సమయం రాత్రి పదకొండున్నర గంటలు.

అతను కాసేపటి వరకు అలాగే నిశ్చలంగా కూచుండిపోయాడు. జేబులోనించి కింగ్ సైజ్ ఫిల్టర్ సిగరెట్ ప్యాక్‌నించి ఓ సిగరెట్ తీసి పెదాలమధ్య సుతారంగా ఆనించి లైటర్‌తో వెలిగించి రెండు దమ్ములు గుండెల నిండా పీల్చుకొని రిలాక్సయ్యాడు.

ఉండీ వుండీ హైవేమీద లారీలు వేగంగా దూసుకుపోతున్నాయి. రోడ్ క్లియర్‌గా వుండటంతో లారీ డ్రైవర్లు పట్టపగ్గాల్లేనట్టు కాలిని ఏక్సిలేటర్ మీద అదిమిపెట్టి లారీలను గాల్లో పోనిస్తున్నారు. చక్రాల మోత ఆ నిశీధిలో మారుమోగుతోంది.

ఆ వ్యక్తి యెవరికోసమో ఎదురుచూస్తున్నట్టు అసహనంగా సిగరెట్ పీక బయటకు విసిరేసి డ్రైవింగ్ సీట్ లోనించి బయటకి దిగి జీప్ వానుకుని నించున్నాడు.

అతను అజానుబాహుడు. జీన్స్ పాంటులో నైలాన్ స్లాక్ ఇన్‌సర్టు చేశాడు. చారల స్లాక్ అది! మనిషి ముఖంలో ఎక్కడా సౌమ్యత సరళత్వం లేవు. బుగ్గమీద ఎప్పుడో లోతైన గాయమైన దానికి రుజావుగా మచ్చ పొడవుగా సాగింది కోరమీసాలు అతని ముఖానికి అదనపు క్రూరత్వాన్ని ఆపాదిస్తున్నాయి.

అతను పాంటుజేబునోసారి తడుముకున్నాడు. ఎత్తుగా ఒత్తుగా తగిలిన రివాల్వర్ స్పర్శకు తృప్తిగా తలాడించాడు. ఎడమచెయ్యి తిప్పి టైం చూసుకున్నాడు. రేడియం డయల్ లోని చిన్న ముల్లు పన్నెండు మీదికి పెద్ద ముల్లు పదకొండుమీదికి చేరి త్వరలో నే ఒకటై పోవాలని ఆరాటపడుతున్నాయి.

అతను ఓపిగ్గా కాచుకున్నాడు.

అతని నిరీక్షణ ఫలించలేదు. మరో సిగరెట్టు పెదాల మధ్య అతికించి అగ్ని సంస్కారం చేశాడు.

చుట్టుపక్కల ఒక్కసారిగా చీకట్లు అలరించుకున్నాయి. అతను అప్రయత్నంగా తలపైకెత్తి ఆకాశం లోకి చూశాడు.

అంతదాకా వెలుగును ప్రసరించిన నక్షత్రాలు మాయమయ్యాయి. తెల్లటి మేఘాలు ఆకాశాన్ని కమ్మేశాయి. యే క్షణంలోనైనా వర్షించే లా కనిపిస్తున్నాయి. అప్పుడే చల్లటి గాలి వీచటం ప్రారంభమయ్యింది.

అతను సిగరెట్‌ను విసుగ్గా విసిరికొట్టి డ్రైవింగ్ సీట్లో కూచుని జీప్ స్టార్టు చేసి ముందుకురికించాడు. సర్రా

సరి సిటీ లోపలకు దారితీశాడు.

అతను రెండు కిలోమీటర్లు ప్రయాణించేసరికి దారి కడ్డంగా ఓ వేన్ కనిపించింది. అతను పక్కనుంచి వెళ్ళే అవకాశంలేదు. తప్పనిసరిగా అతను జీప్ నాపుచేశాడు.

అంతే! ఒక్కసారిగా నలుగురు సాయుధులైన వ్యక్తులు అతన్ని చుట్టుముట్టారు!

మరుక్షణం ఆ వ్యక్తి జేబులోంచి రివాల్వర్ తీయబోయాడు. కాని నలుగుర్లోను ఒకడు అతని ప్రయత్నాన్ని విఫలం చేశాడు. తనచేతినున్న డబుల్ బారల్ గన్ని సూటిగా ఆ వ్యక్తి గుండెలకానించి కర్కశంగా నవ్వాడు.

అతను వాళ్ళ నలుగురివైపు సూటిగా చూశాడు. నలుగురి చేతిల్లోను గన్స్ వున్నాయి. వాళ్ళు నలుగురు పోతపోసిన కంచువిగ్రహాల్లా, మూర్తీభవించిన రాక్షసుల్లా, కరుడుగట్టిన కిరాతకుల్లా, చేతి ఆయుధాలు ధరించిన యమభటుల్లా కనిపించా రతనికి.

“కోన్ హోతుమ్?” కంచువిగ్రహాల్లో ఒకటి గర్జించింది.

అతను వెంటనే సమాధానం చెప్పలేదు. గన్ బారెల్ అతని గుండెమీద మరింతగా అదుముకుంది. ఆ గన్ తాలూకు కంచువిగ్రహం రక్తం చిందే కళ్ళతో అతని వంక చూసి “జవాబ్ దో కోన్ హో తుమ్?” అన్నాడు రెట్టించే స్వరంతో.

అప్పటికీ అతను నోరు మెదపలేదు.

“మూంహ్ ఖోలో, నహీంతో గోలీ మార్ దూంగా!” మరో కంచువిగ్రహం కంచుగంటలాంటి గొంతు ప్రతిధ్వనించింది.

అతను పరిస్థితి విషమిస్తున్న విషయం గ్రహించాడు. స్వచ్ఛమైన హిందీలోనే వాళ్ళకు సమాధాన మిచ్చాడు. "నేనో రిటైర్డు మేజర్ ని. రామచంద్రాపురం లోని బి హెచ్ ఇ ఎల్ క్వార్టర్సులో ఓ స్నేహితుడ్ని అవసరంగా కలిసి వస్తూన్నాను."

"అయితే ఆ మాట చెప్పటానికింత సేపు నోరు మెదప కుండా మూగనోము పట్టావేం?" హిందీలోనే అడిగా డొకడు.

"మిమ్మల్ని చూడగానే భయం వేసింది. నాకేదైనా హానిచేస్తారేమోనని సంకోచంతో వెంటనే సమాధానం చెప్పలేకపోయాను. నన్ను నా దారిన పోనివ్వండి" అన్నాడతను.

కంచువిగ్రహాలు పగలబడి నవ్వాయి.

"నువ్వు చెప్తున్నది పూర్తిగా అబద్ధం. నువ్వు నిజంగా మేజర్ గా పనిచేసిన వాడివే అయితే, ఇలా పిరికివాడిలా మాట్లాడవు. సైన్యంలో పనిచేసినవాడు ఒకే లక్ష్యానికి కట్టుబడి వుంటాడు. "డూ ఆర్ డై" అన్నదే ఆ లక్ష్యం. అందులోనూ రిటైరైన మేజరంటే పులిలా వుంటాడు. సో, నువ్వు ఎక్స్ సర్వీస్ మన్ కాదు. మర్యాదగా చెప్పు, నువ్వెవరో...."

"నన్ను నమ్మండి. నిజంగా నేను రిటైర్డు మేజర్ నే! బిలీవ్ మీ!"

"ఊహుఁ....నమ్మం. నిన్ను దాదాపు గంటనుంచి కనిపెట్టి చూస్తున్నాం. సిటీ అవుట్ స్కర్టులో జీపుని చాలాసేపు ఆపి ఎవరికోసమో ఎదురుచూశావు. తర్వాత మళ్ళీ సిటీవైపు వస్తూన్నావు. ఎవరా వ్యక్తి? ఎందుకోసమా నిరీక్షణ? అసలు నువ్వెవరు? ఈ ప్రశ్నలో ఏ ఒక్క

దానికి సమాధానం చెప్పకపోయినా నువ్వు ప్రాణాలతో మిగిలి వుండవు...."

అతను యేదో చెప్పటానికి నోరు తెరిచాడు.

ఇంతలో అటుగా యేదో వాహనం వస్తున్న సూచనగా హెడ్ లైట్స్ వెలుతురు కనిపించింది. ఆ నలుగురిలో ఒకడు జీప్ స్టార్టు చేసి పక్కగా తీసి పెట్టి ఇంజన్ ఆఫ్ చేశాడు.

అది లారీ! రివ్వున దూసుకుపోయింది.

ఈ లోపల తక్కిన ముగ్గురు వ్యక్తులు అతని జీప్ లో దేనికోసమో వెతికారు. వాళ్ళ కళ్ళు మెరిశాయి. జీపులో రెండు నాటుబాంబులు, ఓ రివాల్వర్, ఓ గన్ కనిపించాయి. అతనేం చెప్పకుండానే వాళ్ళ నలుగురికీ అతనెవరో తెలిసిపోయింది.

అందులో నాయకుడిలా వున్న వ్యక్తి సూటిగా తన తుపాకీ అతనికి గురిచేసి, "ఇంతసేపూ రిటైర్డ్ మేజర్ నని మమ్మల్ని నమ్మించాలని ప్రయాసపడ్డావు. నువ్వు డెకాయిట్ వని మాకు రుజువులతోబాటు తెలిసిపోయింది. ఎక్కడో లూటీ చెయ్యటానికి ప్లాన్ చేసుకున్నావు. నీ ప్లాన్ లో భాగంగా మరో వ్యక్తో, వ్యక్తులో నీతో సహకరిస్తారు. వాళ్ళకోసమే నువ్విప్పటిదాకా యెదురు చూశావు. అవునా?" అని గద్దించాడు.

అతను తడబడ్డాడు. యేదో చెప్పాలనుకుని మళ్ళీ ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

"నువ్వేం చెప్పనవసరంలేదు. దేశాన్ని అల్లకల్లోలం చేస్తున్న టెర్రరిస్టుల్లో నువ్వు ఒకడివని మాకర్థమై పోయింది. ఇప్పుడు చెప్పు, నువ్వేదైనా రాజకీయ పార్టీకి చెందినవాడివా? దేశాన్ని అల్లకల్లోలం చెయ్యాలని

ఎందుకు ప్రయత్నిస్తున్నావు? ఏమాశించి ఈ పని చేస్తున్నావు? డబ్బుకోసమా? లేక ప్రభుత్వాన్ని కూలదోయడానికా? కమాన్ మాకు నిజం కావాలి. అబద్ధం చెపితే నాలుక చీల్చేస్తాను" హుంకరించాడు నాయకుడు.

అప్పటికతనికి ధైర్యం వచ్చినట్టుంది. "మీరందరు యే ప్రయోజనాన్ని ఆశించి ఈ ఆందోళనకి పూనుకున్నారో నేనూ అదే ఆశించి ఈ పనికి సిద్ధపడ్డాను" అన్నాడు కూల్‌గా.

నాయకుడు త్రుళ్ళిపడి చూశాడు. సూటిగా అతని ముఖంలోకి చూసి, "మేం టెర్రరిస్టుల్లా కనిపిస్తున్నామా నీకు? ఏ ఆధారంతో నువ్వీ నిర్ణయానికొచ్చావో తెలుసుకోవచ్చా?" అన్నాడు సీరియస్‌గా.

అతను మందహాసం చేశాడు. తాపీగా జేబునించి సిగరెట్ ప్యాకెట్ తీసి సిగరెట్టు పెదాలమధ్య సుతారంగా అతికించాడు. లైటర్‌తో వెలిగించుకుని రెండు దమ్ములు లాగి నాయకుడివైపు చూశాడు.

అంతవరకు ఆ నలుగురు వ్యక్తులు తుపాకులు అతని గుండెకు గురిపెట్టి అసహనంగా చూస్తున్నారు.

అతను విలాసంగా సిగరెట్ కాల్చుకుంటూ "నాకుందే ఆధారాలు నాకున్నాయి. ఒకే వృత్తిలో వున్న వాళ్ళకి ఒకరి గురించి మరొకరికి తెలియకుండా వుంటుందా? అయితే ఆధారాలడిగినప్పుడు చెప్పాలి కదా!?....నంబర్ వన్, తిరుపతి వెళుతున్న గోపినాథ్ కుటుంబాన్ని ఘాట్‌రోడ్ దగ్గర నిర్దాక్షిణ్యంగా దారుణంగా చంపింది మీరే! నంబర్ టూ...అరుణ్ జైన్‌ని ... కపాలంలోకి గుళ్ళు పంపించి అతన్ని పైలోకానికి పంపించింది మీరు....కపాలంలోకి గుళ్ళు చాలా, ఇంకా

కావాలా?" అన్నాడు.

నాయకుడి ఎడమచేతి పిడికిలి బలంగా బిగుసుకుంది. ఆ క్షణమే అతన్ని పట్టుబెట్టాలని ఆవేశపడుతున్న తన అనుచరులు ముగ్గుర్ని చూపులతోనే వారించాడు.

సరిగ్గా అప్పుడే వాతావరణంలో మార్పు వచ్చింది. టపటపమంటూ చినుకులు పడి ఒక్కసారిగా వడగళ్ళ వానగా మారిపోయింది.

నాయకుడు సూటిగా క్రూరంగా అతనివైపు చూసి, "నీలాంటి ఓ దారిదోపిడీ దొంగ మా ఆశయాల్ని కించ పరుస్తూ మా గురించి అవమానకరంగా మాట్లాడటమా? నీకేం పనిష్మెంటివ్వాలో మా బాస్ నిర్ణయిస్తారు. మా ఉద్యమాన్ని అడ్డుపెట్టుకుని నీలాంటి రెకాయిట్స్ ప్రయోజనం పొందుతున్నారు. అధికంగా లాభం చేసు కుంటున్నారు. ఓ పవిత్రమైన ఆశయంతో మేమిలా ఆందోళనని ఓ యజ్ఞంలా నిర్వహిస్తున్నాం. నీలాంటి స్వార్థపరులు దాన్ని పక్కదారి పట్టించాలని ప్రయ త్నిస్తూ కేవలం డబ్బుకోసం దోపిడీలు చేస్తూ సంచులు నింపుకుంటున్నారు. మాకు డబ్బుకాదు కావలసింది. ఈ వ్యవస్థ...." అని ఏదో చెప్పబోయి హఠాత్తుగా ఆగి పోయాడు.

తక్కిన ముగ్గురు అనుచరులు నాయకుడి కాలుతొక్కి అతను మరి మాట్లాడకుండా ఆపారు. లేకుంటే ఆవేశంలో అతను యేదో చెప్పేసి వుండేవాడు.

అతను చెవులు దొరబెట్టి వింటున్న వాడల్లా నాయ కుడు ఆగిపోవటంతో చాలా నిరాశపడిపోయాడు.

వర్షం ఉధృతంగా తయారయింది.

నాయకుడి ఆదేశంతో అతన్ని వాళ్ళు ముగ్గురు తమ వేన్‌లోకి ఎక్కించారు.

మరుక్షణం వేన్ ముందుకు పరుగె త్తింది.

"నన్ను....నన్నెక్కడికి తీసుకుపోతున్నారు? నన్నేం చేయబోతున్నారు?" గట్టిగా కేకలు పెట్టాడతను.

"చెప్తాం........ఇంతకీ నీ పేరేమిటి?" అడిగాడు నాయకుడు.

"బల్‌బీర్!" అన్నాడతను.

"ఈ పేరైనా నిజం చెప్పావని నాకనిపించడంలేదు" అన్నాడు నాయకుడు వ్యంగ్యంగా.

బల్‌బీర్ సమాధానం చెప్పలేదు.

వేన్ శరవేగంతో దూసుకుపోతూనే వుంది. వర్షం కుండపోతగా కురుస్తోంది.

# 5

"హలో, డిటెక్టివ్ కిరణ్ వున్నారా?" అడిగాడు క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్. అతని గొంతులో ఆందోళన ఆత్రుత స్పష్టంగా ధ్వనించాయి.

"వారు లేరండీ. ఏదో కేసు విషయంలో ఎవిడెన్స్ కోసం కలకత్తా వెళ్ళారు."

శ్రీనివాస్ సమాధానం విని హతాశుడై పోయాడు. "ఎవరు, వదినగారేనా మాట్లాడుతున్నది?" అడిగాడు శ్రీనివాస్.

"ఎస్. అయామ్ బిందుకిరణ్ స్పీకింగ్."

"నమస్తే భాభీ! బ్రదర్ యెప్పుడు తిరిగొస్తారో చెప్పగలరా, ప్లీజ్!"

"సాధారణంగా వివరాలు నాతో చెప్పరు. ఆ సమయానికి ఓ ముఖ్యమైన కేసు హియరింగ్‌తో బిజీగా

వుండటంవల్ల నేను కూడా ఆయన్ని వివరాలడగలేదు" చెప్పింది లాయర్ బిందు.

"బ్రదర్ నాతో చెప్పకుండా దూరప్రాంతాలకు వెళ్ళరే!....అతను రాగానే నాకు అర్జంటుగా రింగ్ చెయ్యమని చెప్పండి. నేను వెంటనే అక్కడికొస్తాను. చాలా ముఖ్యమైన టాప్ ప్రయార్టీ కేసు గురించి చర్చించాల్సి వుంది" అభ్యర్థించాడు శ్రీనివాస్.

"ష్యూర్ ష్యూర్" అన్నది బిందు.

"థాంక్యూ భాభీ!" చెప్పాడు శ్రీనివాస్ ఫోన్ పెట్టేస్తూ.

అతను బాగా డీలా పడిపోయాడన్నందుకు సూచనగా బాగా అలసటగా, నీరసంగా కనిపిస్తున్నాడు. టెన్షన్తో కణతలు నొక్కుకుంటూ కుర్చీలో అసహనంగా కదులుతున్నాడు.

అప్పటికి మూడు అత్యవసర సమావేశాలు ఏర్పాటు చేసి, అన్ని కేడర్ అధికారుల్ని ముఖ్యంగా క్రైం బ్రాంచ్ని దడదడలాడించాడు కమీషనర్ ఆఫ్ పోలీస్. టెర్రరిజాన్ని అరికట్టలేకపోతున్న తమ అసమర్థతని తీవ్రంగా విమర్శించాడు. లాస్టు వార్నింగ్లు కూడా ఇవ్వటం అయిపోయింది.

రేపట్నుంచి మెమోలు సస్పెన్షన్ వంటి డిసిప్లినరీ ఏక్షన్స్ తీసుకుంటానని కూడా హెచ్చరించాడు. ఉద్యోగం మాటెలా వున్నా పరువు ప్రతిష్టకి సంబంధించిన సమస్య ఎదురయ్యింది.

ఇలాంటి విపత్కర పరిస్థితుల్ని ఎదుర్కోవటంలో ఎన్నోసార్లు సాయపడ్డ డిటెక్టివ్ కిరణ్ సమయానికి

సిటీలో లేకపోవటం తన దురదృష్టం!

శ్రీనివాస్ తల విదిలించాడు.

సరిగ్గా అప్పుడే సార్జంట్ శివం లోపలికొచ్చి శ్రీనివాస్కి శాల్యూట్ చేసి టైపు చేయబడ్డ ఓ కాగితం అందించాడు.

దాన్ని చదువుతూనే అదిరిపడ్డాడు శ్రీనివాస్.

అది కమిషనర్, డి.జి.పి. సంయుక్తంగా పంపిన అర్జంటు సర్క్యులరు.

గతరాత్రి నగరంలోని నలుగురు కోటీశ్వరులు హత్య చేయబడ్డారు. అయితే ఇవి గతంలో జరిగిన హత్య లాంటివి కావు. గతంలో కేవలం టెర్రరిస్టులు ప్రాణాలు తీసి వెళ్ళిపోయేవారు. డబ్బు జోలికి పోయేవారు కాదు. ఈ నాలుగు హత్యలు కేవలం డబ్బుకోసమే జరిగాయి. ఒక్కోచోట పదిహేను లక్షలకి తక్కువ కాకుండా క్యాష్, బంగారు నగలు పెద్ద పెట్టున దోచుకోబడ్డాయి. దాదాపు పన్నెండుమందిని తీవ్రంగా గాయపరిచి పారిపోయారు దుండగులు. డిపార్టుమెంటంతా అలర్టుగా వుండాల్సిన స్పెషియల్ పొజిషన్ గురించి ఆ సర్క్యులర్లో వివరించబడింది స్టాఫ్కి. సామూహిక శిక్ష విధించబడుతుందనే హెచ్చరికతో, ఓ అత్యవసర సమావేశానికి హాజరు కావలసిందిగా పిలుపు!

శ్రీనివాస్ లేచి అటెన్షన్లో నిలబడిపోయాడు. డి.జి.పి, కమిషనర్ తనముందు నిలిచివున్నట్టే అనిపించిందా సర్క్యులర్ని చూస్తూంటే.

ఇంతవరకూ జరిగిన టెర్రరిస్టుల కార్యక్రమాల్లో కేవలం ప్రాణాలు మాత్రమే పోయాయి. అసలు ఆ డెకాయిట్స్ ఉద్దేశమేమిటో, ఏ ప్రయోజనాన్ని ఆశించి

వాళ్ళ టెర్రరిజానికి దిగారో స్పష్టమైన అవగాహన లేకుండా పోయింది. ఇప్పుడు కేసు కొత్త మలుపు తిరిగింది.

ఆ టెర్రరిస్టుల నడ్డుపెట్టుకుని, డెకాయిట్స్ విచ్చలవిడిగా చెలరేగిపోతున్నారన్నమాట! బహుశా ఈ దోపిడీ దొంగలకీ, ఆ టెర్రరిస్టులకి ఏమీ సంబంధముండి వుండదు. ఇవి కేవలం డబ్బుకోసం జరిగిన హత్యలు! ఇప్పుడు కేసు మరింత కాంప్లికేటెడ్ గా తయారయ్యింది.

దీన్నెలా పరిష్కరించేటట్టు? డిపార్టుమెంట్ ప్రెస్టేజ్ కి సవాలుగా నిలిచిన ఈ కేసును తామందరు సమిష్టిగా కృషిచేసి పరిష్కరించగలరా? ఏమో....! ఈ అత్యవసర సమావేశంలో ఎవరి అదృష్టం ఎలా వుందో!? ఎవడి ఉద్యోగానికి తిలోదకాలు వదులుకోవలసి వుందో!

శ్రీనివాస్ హేట్ తగిలించుకుని, క్షణాల్లో జీప్ మీద కమీషనర్ కార్యాలయానికి దూసుకుపోయాడు.

## 6

బల్బీర్ బోనులో పడ్డ పులిలా రాత్రంతా నిద్ర లేకుండా గడిపాడు.

గతరాత్రి ఒంటిగంటకి పదినిమిషాలుండగా తన నీ స్థావరానికి తీసుకొచ్చారు టెర్రరిస్టులు. హోరున వర్షం కురుస్తుండగా తనని తీసుకొచ్చిన వేన్ గోల్కొండ కంటోన్మెంట్ ప్రాంతాల ఆపి, డ్రైవింగ్ చేస్తున్న వ్యక్తి ఓ పాడుపడ్డ ఇంట్లోకి వెళ్ళి అయిదునిమిషాల తర్వాత వచ్చాడు.

వస్తూనే నాయకుడికేదో చెప్పాడు.

వెంటనే తన నెత్తిమీద సమ్మెటపోటులాంటి దెబ్బ పడింది. తుపాకీ బట్ తో కొట్టిన దెబ్బ అది! వెంటనే

తనకి స్పృహ తప్పిపోయింది.

మెలకువ వచ్చి చూసేసరికి తనీ చెరసాలవంటి గదిలో చీకటికోణంలో బంధింపబడి వున్నాడు. బయట వర్షం కురుస్తూనే వుండాలి! కాని వర్షం చప్పుడు ఏమాత్రం వినిపించటంలేదు.

అసలు అది ఏదైనా భూగృహమో, లేక ఏదో పాత భవనం అంతర్భాగమో అర్థంకావటంలేదు. అయితే అక్కడ మొకకవాసన అదోరకమైన హితవు కాని వాసన వస్తున్నాయి. నేలంతా చెమ్మగా, చిరాగ్గా వుంది. పంది కొక్కులు ఎలుకలు విచ్చలవిడిగా తిరుగుతున్నాయి.

బల్‌బీర్ పచార్లు చేస్తూ అక్కడి పరిస్థితిని ఊహిస్తున్నాడు. అది బహుశా ఏదో భూగృహమే అయ్యుండాలి. సందేహంలేదు.

ఆ నలుగురు టెర్రరిస్టులు ఏమైనట్లు? తననిక్కడ వదిలి ఎక్కడికి వెళ్ళారు? అసలీ స్థావరం ఏప్రాంతంలో వుంది?

బల్‌బీర్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఆలోచనలమధ్య తెల్లవారిపోయింది.

వాచీ చూసుకున్నాడు. ఉదయం ఏడు గంటలుకావస్తోంది.

సరిగ్గా అప్పుడే తానున్న చీకటిగది బయట ఏదో శబ్దమయ్యింది.

బల్‌బీర్ చెవులు రిక్కించి విన్నాడు.

అతని చేతులు వెనక్కి విరిచి కట్టబడివున్నాయి. కాళ్ళు మాత్రం కట్టకుండా వదిలేశారు. తన జేబులో దాచిన రివాల్వర్ దుస్తుల్లోను, షూసాక్స్‌లోను దాచిన డాగర్స్ టెర్రరిస్టులు వశంచేసుకున్నారు.

బల్‌బీర్ తలెత్తి చూశాడు.

ఎదురుగా అజానుబాహుడైన వ్యక్తి నిల్చునివున్నాడు. తనని రాత్రి తెచ్చి బంధించిన నలుగురిలో ఇద్దరు, అతని వెంట వున్నారు.

అజానుబాహుడైన వ్యక్తి మారువేషంలో వున్నట్టు ఇట్టే గ్రహించాడు బల్‌బీర్.

అతను పొడవాటి మోకాళ్ళు దాటే అంగీ వేసుకున్నాడు. షుర్వా కాళ్ళ నంటిపెట్టుకుని వుంది. కాళ్ళకు మొఖమల్ ఆకు చెప్పులు ధరించాడు. నెత్తిన కుచ్చు తలపాగా వింతకాంతులు వెదజల్లుతోంది. గడ్డం నల్లగా ఒత్తుగా నిగనిగలాడుతోంది. కోరమీసం. కుడిబుగ్గ మీద పెద్ద పులిపిరికాయ! అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వెలుగుతున్నాయి. ఖరీదైన విస్కీ వాసనతో కలిసిన అతి ఖరీదైన ఇంటిమేట్ పరిమళం అదోరకమైన వాసనలను వెదజల్లుతోంది.

అతను బల్‌బీర్ వంక కోరగా చూసి నవ్వాడు. బల్‌బీర్ నవ్వలేదు. సీరియస్‌గా అతనివైపే చూస్తున్నాడు. అతని కళ్ళలోకి చూసి గుర్తుపెట్టుకోవటానికి ప్రయస్తున్నాడు.

“వెల్‌కం మై డియర్ కిరణ్ సాబ్!” అన్నాడతను వెకిలిగా నవ్వుతూ.

బల్‌బీర్ ఉలిక్కిపడ్డాడు. ఎంతో సన్నిహితులు కూడా దగ్గర్నుంచికూడా తనని గుర్తుపట్టలేని విధంగా చాలా పకడ్బందీగా మేకప్ చేసుకున్నాడు. కాని, ఈ వ్యక్తి చాలా సులువుగా గుర్తుపట్టేశాడే!

“నాకెలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నావు కదూ, డిటెక్టివ్ సాబ్... ఈ ఖలీఫా బల్లికడుపులో వున్న బిడ్డ

పేవుల్ని లెక్కపెట్టగల సమర్థుడు. నిన్ను, నీ వేషాన్ని కనిపెట్టలేననుకున్నావా?" అన్నాడు గర్వంగా.

ఖలీఫా! ఇది కూడా పెట్టుడు పేరే అయ్యుంటుంది. మారువేషానికి మారుపేరు! తన బల్‌బీర్ పేరులాగా.

కిరణ్ సూటిగా అతని కళ్ళలోకి చూశాడు. "వెల్. నేనెవరో బాగానే తెల్సుకున్నావ్. నేను కూడా నువ్వే అకృత్యాల కెందుకు పాల్పడుతున్నావో తెలుసుకున్నాను...." ఒక్షణం ఆగాడు.

ఖలీఫా పొట్టపట్టుకుని చాలాసేపు నవ్వుతూ వుండిపోయాడు.

కిరణ్ చాలాసేపు సహనం వహించాడు. చేతిలో రివాల్వర్ వుంటే ఆ బాస్టర్డ్‌ని కాల్చి పారెయ్యాలనుకున్నాడు.

ఇంతలో ఖలీఫా నవ్వాపి, "మిస్టర్ డిటెక్టివ్, నేనెవరో ఏం చేస్తుంటానో నీకు తెలీదు. ప్రస్తుతం ఈ దేశంలో ముఖ్యంగా రాష్ట్రంలో—ఇంకా ముఖ్యంగా ఈ రాజధానిలో ఎందుకీ అలజడులు, హత్యలు చెలరేగిపోతున్నాయో అసలే తెలీదు. వీటి వెనక ఎవరి హస్తం హస్తాలు! అందాం—వున్నాయో మొదలే తెలియదు. తెలుసునని బుకాయించినంతమాత్రాన నమ్మేస్తాననుకున్నావా? నీ కేమీ తెలియదని నాకు తెలుసునని నీకు తెలీదు. పూర్ ఫెల్లో!" అన్నాడు.

కిరణ్ ముఖం జేవురించింది. ఖలీఫావంక తీవ్రంగా చూస్తూ, "ఇలా తెర వెనుక నక్కి కూచుని మారువేషాలతో నిన్ను నువ్వు దాచుకొని దొంగబతుకు బతికేకన్నా ధైర్యంగా 'నేనే ఈ హత్య చేశాను' అని చెప్పగల ఖలేజా నీకుందా? వుంటే, పబ్లిగ్గా జనం మధ్య కొచ్చి

చాటిచెప్పు. ఏ ప్రయోజనంకోసం మీ అరాచకత్వం సృష్టిస్తున్నావో ప్రకటించు. నీ టరమ్స్ ఏమిటో ప్రభుత్వానికి నివేదించు. అదీ మగాడు చేయాల్సిన పని. ఇలా దొంగ దెబ్బ తీయటం దొంగబతుకు బతకటం పిరికివాళ్ళ లక్షణం!" అన్నాడు.

ఖలీఫా వెంట వున్న అనుచరు లిద్దరు ఒక్కసారిగా తుపాకులు కిరణ్ గుండెకు గురిచేసి ట్రిగ్గర్ నొక్కబోయారు. ఖలీఫా ఒక్క కనుసైగతో వాళ్ళని వారించి, "అతను కంగారుపడ్డాడని మనం తొందరపడకూడదు. నిదానం ప్రధానం!....ఆఁ, ఏమిటి డిటెక్టివ్, ఉపన్యాసం దంచుతున్నావు!? నేను పిరికివాడినా? తెర వెనుక దాక్కున్నానా? చూద్దువుగాని, అతి త్వరలో నే తెరముందుకు వస్తాను. అయితే అప్పటికి ప్రస్తుతం అధికారంలో వున్న పార్టీ సోదిలోకి కూడా రాకుండా పోతుంది. రాబోయే పార్టీ నూటికి నూరు పాళ్ళు మాదే అవుతుంది. అప్పుడు ప్రజల నుద్దేశించి బ్రహ్మాండమైన బహిరంగ సభ ఏర్పాటుచేసి మరీ మా ఆశయాలని మేం సాధించిన విజయాలని ఏకరువు పెడతాం, సరేనా?" అన్నాడు.

కిరణ్ కి అతని పాలిసీ కొంచెం కొంచెం అర్థమవుతోంది. ఇంకా అతన్ని రెచ్చగొడితే అసలు నిజాలు బయటపడతాయి. ఆవేశంలో అతను నోరు జారటం ఖాయం!

కిరణ్ అతనివైపు అలవోకగా చూసి, "నేనెవర్నో తెల్సుకున్నావు. ఇక నేను జీప్ లో ఎందుకు తిరుగుతున్నానో ఎవరికోసం ఎదురుచూస్తున్నానో చెప్పగలవా?" అన్నాడు.

"వై వాట్? నువ్వు నాకోసం లేదా నాలాంటి వాళ్ళ కోసం నిఘా వేసి చూచున్నావు. ఎవరో ఒకరు ఎదురుపడక పోతారా, ఫాలో అయి అసలు విషయం తెల్సుకోవాలని దృఢనిశ్చయింలో వున్నావు. నిన్ను నియమించినది కమి షనరాఫ్ పోలీస్. ఏమై రైట్?" ఖలీఫా కర్ణ కఠో రంగా నవ్వాడు.

కిరణ్ విస్మయంగా చూశాడతనివంక. నిజంగానే ఖలీఫా అసాధ్యుడు. ఎంతో టాప్ సీక్రెట్‌గా జరిగిన సమావేశం గురించి అతని కెలా తెలిసింది? కమిషనర్ తనని ప్రత్యేకంగా కల్సుకుని పరిస్థితిని వివరించి ఈ పెద్ద రిస్కుల ఆమాకి తెల్సుకోవలసిందిగా కోరాడు. అటు పోలీసుల ఖ భవనాల్లోగాని, తన భవనంలోగాని కాకుండా ఓ స్నేహితుడి ఇంట్లో సమావేశం ఏర్పాటు చేయబడింది.

అలాంటి రహస్యసమావేశం గురించి కూడా తెల్సు కొన్న ఖలీఫా సామాన్యుడు కాదు. రియల్లీ చంద్రపుల్. తను కావాలనే సిటీ వాలి మేరల్లో నిఘా వేసి వున్నాడు మేకర్ వేషంలో. అది కూడా ఖలీఫా కరెక్టుగా ఊహిం చాడు. తన ప్లాన్ మొదటిసారిగా ఫెయిలయింది. కిర ణ్‌కి అవమానమనిపించింది.

ఈ ఖలీఫా అసలు స్వరూపం తెల్సుకోవాలి. ఏ ప్రయోజనాన్ని ఫలితాన్ని ఆశించి అతనీ ఘోరాలకి పాల్పడుతున్నాడో తెల్సుకోవాలి. తనమీద ఎంతో నమ్మకంతో ప్రభుత్వం తన భుజస్కంధాలమీద మోపిన ఈ కార్యభారాన్ని దిగ్విజయంగా నెరవేర్చాలి. ఈ ఖలీ ఫాతోపాటు ఇంకా ఎంతో మంది ఈ రాకెట్‌లో భాగ స్వాములై వుంటారు. వాళ్ళందర్నీ పట్టి ప్రభుత్వాని కప్ప

గించాలి. ఈ బృహత్కార్యం నెరవేర్చటంలో తన ప్రాణం పోయినాసరే. లెక్క చేయడు!

కిరణ్ రక్తనాళాల్లో దేశభక్తి ఉరకలెత్తి ప్రవహిస్తోంది. అతని గుండె వందేమాతరం అంటూ ప్రతిస్పందిస్తోంది. ఈ ఉగ్రవాదుల దురాగతాల వెనక ఏ విదేశీ హస్తముందో, ఏ శత్రుదేశాల ప్రోద్బలముందో గుట్టు రట్టు చెయ్యాలి.

కిరణ్ గుప్పెళ్ళు బిగుసుకున్నాయి. అతని దవడ కండరం అదిరింది.

"మాట్లాడకుండా బిగుసుకుపోయావేం డిటెక్టివ్? నేను చెప్పింది హండ్రెడ్ పర్సెంట్ రైట్. అంతేకాదు, నువ్వేం ఆశించి ఇక్కడికొచ్చావో అది నెరవేరదని చెప్పటానికి చింతిస్తున్నాను. ఎందుకంటే నువ్విక్కడ్నుంచి ప్రాణాలతో బయటకు వెళ్ళలేవు కాబట్టి!" పకలబడి నవ్వాడు ఖలీఫా అతని అనుచరులిద్దరు అదో పెద్ద జోక్ అన్నట్టు పొట్టచెక్కలయ్యేలా నవ్వారు.

అంతే!

ఒక్కసారిగా వాళ్ళ ముగ్గురు చేతుల్లోని తుపాకులు కిరణ్ గుండెల్లో గుళ్ళు కక్కటానికి ఆయత్తమయ్యాయి.

సరిగ్గా అదే సమయంలో కిరణ్ కాలితో నేలని గట్టిగా అదిమిపెట్టడం, అతని షూ సోల్ కిందినుంచి మూడు డాగర్స్ అతివేగంగా రిలీజ్ కావటం, అవి సూటిగా ఖలీఫా చేతిలోను, అతని అనుచరుల చేతుల్లోను నాటుకోవటం, వాళ్ళ చేతుల్లోని తుపాకు లెగిరి అవతల పడటం, వాళ్ళు ముగ్గురు ఒకేసారి స్పృహ తప్పి నేల కూలిపోవటం—చాలా వేగంగా జరిగిపోయింది.

# 7

కిరణ్ ఒక్కఅంగలో గది బయట ఉరికాడు. డాగర్స్ చివరపూసిన మత్తుమందు ప్రభావం కేవలం రెండుగంటలుమాత్రమే వుంటుంది. ఈలోపల తనీ స్థావరంలోని గుట్టుమట్లు, అనుపానులు తెలుసుకోవాలి. ఇంకా ఇలాంటి డెకాయిట్స్ ఎంతమంది వున్నారో ఎలాంటి అకృత్యాలకి దారుణాలకి పాల్పడుతున్నారో స్వయంగా తెలుసుకోవాలి.

కిరణ్ తన చేతులకు కట్టినతాళ్ళను కాలిషూకున్న నైఫ్ని బయటకు లాగి నడుము వెనక్కి విల్లులా వంచి, బంధింపబడ్డ చేతుల్ని నైఫ్మీదికి అవలీలగా ఆనించి క్షణాల్లో కోసేసి బంధవిముక్తుడయ్యాడు.

ఒక్కసారి ఒళ్ళంతా బద్ధకంగా విరుచుకున్నాడు. ఇంకా అప్పటికీ మారువేషం చెక్కుచెదరకుండా వుంది. తనిప్పుడు మేజర్ బల్బీర్.

కిరణ్ పొడవుగా వున్న నడవాలో చప్పుడుకాకుండా నడిచాడు. తనకి తెలిసి ఇంకా ఇద్దరు డెకాయిట్స్ వుండాలి. వాళ్ళు యిక్కడే యెక్కడో ఉండొచ్చు. వాళ్ళతోబాటు ఇంకా ఎవరెవరో ఉండినా ఉండొచ్చు.

కిరణ్ రెండడుగులు వెనక్కివేసి ఖలీఫా దుస్తుల వెతికి, రివాల్వర్ బయటకు తీశాడు. అది తన రివాల్వర్ కాదు. అయినా ఫరవాలేదు. మేగజైన్లో గుళ్ళు లోడ్ చేయబడి వున్నాయి!

చేతిలో రివాల్వర్ ధరించి ముందుకు జరిగాడు కిరణ్.

అది నేలమాళిగ కాదు. ఎప్పుడూ ఉపయోగించని పాడుబడ్డ ఇల్లు. ఏ ప్రాంతమో తెలీదుగాని, విడిగా విసిరేసినట్టున్న ఇల్లది. దాంట్లో గోడలు పడిపోకుండా

ఉన్న గదులు రెండే రెండు. ఒకటి అంతకితం దాకా తనకి చెరసాలగా మారిన గది. రెండోది తాళం పెట్టబడివుంది. ఆ తాళం బాగా తుప్పుపట్టిపోయి ఉంది. అంటే ఆ గది చన్నాళ్ళ కితమే మూతబడిపోయిందన్న మాట! ఆ ఇంట్లో చూడటాని కింకేమీ కనిపించలేదు.

కిరణ్ కి చాలా ఆశ్చర్యంగా ఉంది. ఖలీఫా పనికట్టుకుని ఆ పాత ఇంట్లోని గదిలో తనెందుకు బంధించినట్టు? తనెవరో తెలిసిపోయాక కూడా తనని చంపకుండా అంతవరకు ఎందుకుంచినట్టు? తనని చంపటానికి పనిగట్టుకుని మరో ఇద్దరు అనుచరులతో అక్కడికెందుకొచ్చినట్టు? ఇందులో ఏదో మెలిక ఉంది.

కిరణ్ మస్తిష్కం తీవ్రంగా పనిచేస్తోంది. వెనక్కి తిరిగి మళ్ళీ ముగ్గురూ నేలకూలిన చోటికొచ్చాడు. ఖలీఫా దుస్తుల్లో వెతికాడు. దేనికోసమో తెలీదు కాని, ఏదోక విషయం తెలియకపోదనే నమ్మకంతో వెతికాడు.

అతని అన్వేషణ వ్యర్థం కాలేదు. ఖలీఫా దుస్తుల్లో రిమోట్ కంట్రోల్ వంటి సాధనం కనిపించింది. దాంతోబాటు ఓ తాళం చెవి కూడా దొరికింది.

అప్పుడే దాదాపు ఓగంట గడిచిపోయింది. మరో గంటలో వాళ్ళు ముగ్గురు స్పృహలోకి వచ్చేస్తారు. ఈలోపల ఈ రిమోట్ కంట్రోల్ సంగతి తేల్చుకోవాలి.

కిరణ్ ఆ సాధనంవైపు పరీక్షగా చూశాడు. చిన్న సైజు కాలిక్యులేటర్ లా వుంది. దాంట్లో అంకెలకి బదులు XA, YB, ZC అనే ఇంగ్లీషు అక్షరాల జంటలున్నాయి. మధ్య మధ్య +, ×, — వంటి మేథమేటిక్స్ సింబల్స్ కూడా ఉన్నాయి. వాటికి మధ్యలో 8 అంకె ఒక్కటి

మాత్రం ఉంది.

కిరణ్ చాలాసేపు ఆ సింబల్స్ వైపు దీర్ఘంగా చూస్తూ ఉండిపోయాడు. అతనికేమీ తట్టలేదు. తల విదిలించాడు. తన చేతిలోని తాళంచెవి వైపు పరీక్షగా చూశాడు. అప్పుడతని మెదడులో వైబ్రేషన్స్ ప్రారంభమయ్యాయి.

ఆ రిమోట్ కంట్రోల్ కుడివైపు ఆ తాళంచెవి పట్టే రంధ్రముంది.

కిరణ్ చెవిని ఆ రంధ్రంలోకి చొప్పించబోయి అంతలోనే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. దానివల్ల యేదైనా ప్రమాదం సంభవిస్తే....!?

కిరణ్ ఆ సాధనం పైభాగంలో వెలుగుతున్న రెడ్ లైటుకింద OFF అన్న అక్షరాలు గుర్తించాడు. కింది భాగంలో 'ON' అన్న అక్షరాలు చూశాడు.

అతనికేదో అర్థమైనట్లే అనిపించింది. 'ON' అని ఉన్నచోట చిన్న బొడిపెలా ఉబ్బెత్తుగా వుంది. దాని పైన మెల్లిగా ఒత్తాడు. ఆకుపచ్చ లైటు వెలిగింది. అదే సమయంలో ఎర్రలైటు ఆరిపోయింది.

ఎక్కడో సర్ ....ర్ ...మంటూ ఏదో పక్కకు జరిగిన శబ్దం వినిపించింది.

కిరణ్ చురుగ్గా ఆ శబ్దం వినవచ్చినవైపు చూశాడు.

నేలమీద రెండడుగుల పొడవు, రెండడుగుల వెడల్పు ఉన్న చతురస్రాకారంలో జాగా ఏర్పడింది.

కిరణ్ ఆశ్చర్యాన్నణచుకుని చూశాడు. కిందికి మెట్లున్నాయి. నేలమాళిగ దర్శనమిచ్చింది.

కిరణ్ ఒక్క క్షణమేదో ఆలోచించి మరుక్షణం మెట్లగుండా దిగువకు దిగాడు. సమతలమైన ప్రదేశం దొరికేవరకు మెట్లు కొనసాగాయి. కిరణ్ నేలమీద

పాపం పోయాడు.

అదో పెద్ద హాలు. ఆ హాల్లో ఓ అంగుళం కూడా ఖాళీ లేకుండా తుపాకులు, రివాల్వర్లు, హేండ్ గ్రనేడ్స్, తూటాలు మొదలైన మారణాయుధాలు నిండిపోయి ఉన్నాయి. ఓ మూలగా పొడవాటి కత్తులు, పొట్టికత్తులు, చాకులు, సైజార్ల వంటి ఆయుధాలు గుట్టలుగా పేర్చబడి ఉన్నాయి.

కిరణ్ కళ్ళకదో పెద్ద ఆయుధాగారంలా కనిపించింది. అంతరాకా జరిగిన దారుణ మారణకాండ, సంభవించిన జననష్టం, ఆస్తినష్టం, అల్లకల్లోలాలు, అన్నీ కళ్ళముందు రీళ్ళలా తిరిగాయి. అతనిలో ఆవేశం పెల్లుబికింది. ఆ క్షణమే హేండ్ బాంబ్స్ వేసి ఆ గిడ్డంగిని సర్వనాశనం చెయ్యాలన్నంత ఉద్రేకాన్ని కష్టంమీద నిగ్రహించుకున్నాడు.

తనిప్పుడు ఆవేశపడి లాభంలేదు. ఇలాంటి స్థావరాలింకా ఎన్ని వున్నాయో వాటినెవరు నడుపుతున్నారో- ఈ టెర్రరిస్టుల పుట్టుపూర్వోత్తరాలేమిటో పూర్తిగా తెలుసుకోకుండా తొందరపడకూడదు.

కిరణ్ ఆ హాలును దాటి నాలుగడుగులు వేసేసరికి పక్కనే మరో గది కనిపించాయి. గదులు లోపల్నుంచి గడియపెట్టబడి ఉన్నాయి. మెల్లిగా నెట్టి చూశాడు. తెరుచుకోలేదు.

గదులు దాటి మరో నాలుగడుగులు వేశాడో లేదో "హేండ్సప్" అన్న కర్కశమైన గొంతు వినిపించింది.

చప్పున తలతిప్పబోయాడు కిరణ్. అయితే అతని తలకి రివాల్వర్ మొన చల్లగా ఆనుకొందప్పటికే. కిరణ్ మెదడు తీవ్రంగా పని చేస్తోంది. తను శత్రువులకి మళ్ళీ

చిక్కిపోయాడు. ఇప్పుడేమాత్రం వెనుదీసినా అమూల్యమైన అవకాశం శాశ్వతంగా చేజారిపోతుంది.

కిరణ్ చాలా వేగంగా ఎడమకాలునెత్తి శత్రువు డొక్కలో వెనక నుంచి తన్నాడు. సరిగ్గా అది టార్గెట్ ని ముద్దు పెట్టుకుంది. 'హమ్మ' అంటూ చిన్నగా మూలిగి నేలకరిచాడు వెనకాలున్న వ్యక్తి.

కిరణ్ మెరుపు వేగంతో వెనక్కి తిరిగి అతనిమీదికి మళ్ళీ దాడిచేశాడు. పిడికిలి బిగించి పొట్టలో గుద్దాడు.

అంతే! ఆ వ్యక్తి కిక్కురుమనకుండా నేల కూలిపోయాడు. మరో అరగంటవరకు అతనికి మెలకువరాదని కిరణ్ కి తెలుసు. ఆ వ్యక్తి రాత్రి తనని వేటాడిన నలుగుర్లోను మూడో టెర్రరిస్టు. తన అంచనా కరెక్టయితే నాలుగో టెర్రరిస్టు కూడా పక్కనే ఉండొచ్చు.

కిరణ్ చాలా ఎలర్టుగా ముందుకడుగు వేశాడు. అక్కడ మరో గది వుంది. ఆ గదిలో ఓ పొడవాటి బల్ల ఉంది. ఆ బల్లమీద ఓ కంప్యూటర్ వంటి సాధనముంది.

కిరణ్ తన దగ్గరున్న రిమోట్ కంట్రోల్ లాంటి సాధనంలోని 'XA' అన్న జంట అక్షరమున్న బటన్ నొక్కాడు.

కంప్యూటర్ తెరమీద పన్నెండు పేర్లు వరసగా ప్రత్యక్షమయ్యాయి. అందులో గోపినాథ్ అరుణ్ జైన్.. ఇంకా తదితరుల పేర్లున్నాయి.

కిరణ్ కర్థమయ్యింది. ఆ లిస్టులోని వ్యక్తులందర్నీ టెర్రరిస్టులు ఇదివరకే చంపేశారు.

కిరణ్ 'YB' అన్న మీట నొక్కాడు. మరో లిస్టు తెరమీద ప్రత్యక్షమయ్యింది. అందులో కూడా పన్నెండు పేర్లున్నాయి. అవికూడా టెర్రరిస్టుల చేతుల్లో ప్రాణాలు

పోగొట్టుకున్న కోటీశ్వరుల పేర్లే.

కిరణ్ 'ZC' బటన్ నొక్కాడు.

మరో పన్నెండు పేర్లు ప్రత్యక్షమయ్యాయి.

మొట్టమొదటనే తన పేరుండటం చూసి ఉలిక్కి పడ్డాడు కిరణ్.

అంటే ఇది మూడో 'హిట్ లిస్టు' అన్నమాట! ఇప్పటివరకు ఇందులో యెవరి ప్రాణాలు పోలేదు. ఈ 'హిట్ లిస్టు' తన చావుతో ఆరంభం కాబోతున్నదన్న మాట! లిస్టులోని తక్కిన పదకొండు పేర్లని మనసులోనే మననం చేసుకున్నాడు కిరణ్.

తర్వాత 'C' అన్న బటన్ నొక్కాడు కిరణ్. తెర మీది లిస్టు చెరిగిపోయింది.

కిరణ్ '8' అంకె బటన్ నొక్కాడు.

తెరమీద ఓ మనిషి ప్రత్యక్షమయ్యాడు. అతన్ని చూస్తూనే కిరణ్ పక్కలో బాంబుపడ్డట్టు అదిరిపడ్డాడు.

అతను బులిస్తాన్ దేశ ప్రెసిడెంట్ హిటాక్సి!

అంటే....బులిస్తాన్ దేశం మన దేశంలో టెర్రరిజాన్ని సృష్టించటానికి పరోక్షంగా ప్రోత్సహిస్తోందన్నమాట! ఈ ఆయుధాలన్నీ రహస్యంగా ఆ దేశంనించే మన దేశానికి సరఫరా అవుతున్నాయా? ఇంత పెద్ద ఎత్తున ఈ రాకెట్‌ను నడుపుతున్నదెవరు? మన దేశాన్ని అరాచకం చెయ్యటానికి ఇంత కుట్ర జరుగుతున్నదా?

అకస్మాత్తుగా కిరణ్‌కి గుర్తువచ్చింది. రెండో హిట్ లిస్టులో వున్న కోటీశ్వరులతోబాటు రక్షణ శాఖలో కీలకమైన పోస్టుల్లో పనిచేస్తున్న అత్యున్నతాధికారుల పేర్లు కూడా వున్నాయి. అయితే టెర్రరిస్టులు కావాలనే కోటీశ్వరుల్ని ఎన్నుకొని ముందీ దేశాన్ని ఆర్థికంగా

నిర్వీర్యం చేయాలని ప్లాన్ చేశారా? ఆ కోటీశ్వరులు పోతే వాళ్ళ వారసులు ఆ వ్యాపారాల్ని కొనసాగిస్తారు కదా! ఏం కోరి ఈ టెర్రరిజాన్ని కోటీశ్వరులకోసం ప్లాన్ చేశారు?

కిరణ్ తల విదిలించాడు.

ముందటి హిట్ లిస్టుని మళ్ళీ ఫోకస్ చేశాడు. అందులోని నాలుగు పేర్లు అతన్ని ఆకర్షించాయి. భారత రాయబార కార్యాలయానికి చెందిన ఉన్నతాధికారుల పేర్లవి! అవి మామూలు హత్యలుగా ప్రజలు, ప్రభుత్వం పొరబడింది. ఎందుకంటే ఆ హత్యలు నిజంగా హత్యలుగా కాక, కేవలం ప్రమాదవశాత్తూ జరిగిన మరణాలుగా అందర్నీ భ్రమింప చేశారు టెర్రరిస్టులు.

పోలీసుశాఖ యావత్తు టెర్రరిస్టులు కావిస్తున్న మారణకాండమీదే దృష్టి కేంద్రీకరిస్తున్నారుగాని, కీలకమైన పోస్టుల్లో ఉన్న అధికారుల గురించి ప్రత్యేక శ్రద్ధ వహించకపోవటానికి కారణం తేలిగ్గానే గ్రహించాడు కిరణ్.

అసలు టెర్రరిస్టుల ధ్యేయం దేశాన్ని అల్లకల్లోల పరచటంతో బాటు, కీలకమైన పదవుల్లో ఉన్న అత్యున్నతాధికారుల నంతమొందించటం కూడా!

కిరణ్ ఆలోచనల్ని భగ్నం చేస్తూ కంప్యూటర్ నించి వార్తాప్రసారంలాగా బీప్.... బీప్....మంటూ సిగ్నల్స్ వచ్చాయి.

బులిస్తాన్ భాషలో సందేశాన్ని స్తున్నాడు బులిస్తాన్ ప్రెసిడెంటు. పక్కనే ఉన్న టేప్ రికార్డర్ ఆటోమాటిక్‌గా, ఆన్ కావటం, మెసేజ్ రికార్డయిపోవటం తెరమీది ప్రెసిడెంట్ చిత్రం మాయమైపోవటం అంతా

క్షణాల్లో జరిగిపోయింది.

కిరణ్ తన వాచీ బటన్‌ని బయటికి లాగాడు. అది హైలెవ్ ఏరియల్. దానికి పోలీస్ కమిషనర్ ఆఫీసులోని ఎమర్జన్సీ సెల్‌తో కనెక్షన్స్ వున్నాయి.

కిరణ్ చాలా వేగంగా తను చూసిన మూడో హిట్ లిస్టులోని పేర్లను కమిషనర్‌కి చెప్పి, తనున్న పరిస్థితిని, తక్కిన వివరాల్ని చాలా వేగంగా చెప్పాడు. తర్వాత తనున్న ప్రాంతం ఏ ఏరియాలో ఉందో తెలియదని, కాని తనని లొకేట్ చెయ్యటం కష్టంకాదని, హైలెవ్ ఏరియల్‌ని ఆన్‌లో వుంచుతానని దాన్నించి వచ్చే సిగ్నల్స్‌నిబట్టి తనున్న ప్రదేశాన్ని తెలుసుకొని వెంటనే బలగంతో చేరుకోమని చెప్పి మెసేజ్ ముగించాడు.

సరిగ్గా అప్పుడే అతని చెవిపక్కగా ఝుర్‌మంటూ ఓ బుల్లెట్ దూసుకుపోయింది.

## 8

కిరణ్ చాలా వేగంగా నేలమీదకి ఒరిగిపోయి వెనక్కు తిరిగి చూశాడు.

ఈలోపల మరో బుల్లెట్ శత్రువు రివాల్వర్‌నించి రిలీజ్ కావటం, అది కూడా వ్యర్థంకావటం జరిగిపోయింది.

కిరణ్ రివాల్వర్ ప్రయోగించాడు. అది శత్రువు చేతిలోని రివాల్వర్‌ని ఎగరగొట్టింది. అప్పుడు చూశాడు కిరణ్ ఆ వ్యక్తిని.

నాలుగో టెర్రరిస్టు! రాత్రి చూసిన నలుగుర్లోని వ్యక్తి!

రక్తం ఓడుతున్న చేతిని రెండో చేత్తో అదిమిపట్టి

మహా వేగంగా కిరణ్ మీదికొచ్చి పొట్టేలులా అతన్ని కుమ్మాడు తలతో — నాలుగో టెర్రరిస్టు!

కిరణ్ చాలా ఎలర్టుగా ఉన్నాడు. ఆ వ్యక్తిని మెడమీద రివాల్వర్ మడమతో బలంగా కొట్టాడు. అతను చిన్నగా మూలిగి తలవాల్చేశాడు.

కిరణ్ ఆ గదిలోనించి బయటికి రాబోతూ, ఏదో గుర్తొచ్చినవాడిలా మళ్ళీ వెనక్కి వచ్చి టేప్ రికార్డర్ డోర్ తెరిచి, కాసెట్టుని తీసి జేబులో వేసుకున్నాడు. ఖలిస్తాన్ ప్రెసిడెంటు స్వయంగా జారీచేసిన ఆజ్ఞల్ని ఆ కాసెట్ మోస్తోంది.

కిరణ్ తలుపులు లోపల మూసి వున్న ఆ రెండు గదుల్నీ బలవంతాన తెరిచి లోపలకు ప్రవేశించాలని నిర్ణయించుకున్నాడు.

ముందుగా ఓ గదిముందు నిలబడి రివాల్వర్‌ని రెండు తలుపుల మధ్యకు గురిచూసి కాల్చాడు. శబ్దం చేస్తూ లోపలి గడియలు తుత్తునియలై పోయాయి. తలుపులు తెరుచుకుని లోనికడుగు పెట్టాడు కిరణ్.

లోపల కాళ్ళు చేతులు విరిచికట్టబడివున్న ఇద్దరు వ్యక్తులు కనిపించారు.

కిరణ్ వాళ్ళని సమీపించి, “ఎవరు మీరు?” అనడిగాడు. వాళ్ళనెక్కడో చూసినట్టు అనిపించింది.

వాళ్ళిద్దరు మంచినీళ్ళు కావాలని సైగ చేశారు. కిరణ్ నీళ్ళకోసం అటు ఇటు చూశాడు. అక్కడ నీరు లేదు. తను కంప్యూటర్ ఉన్న గదిలో ఫ్రిజ్ చూశాడు.

కిరణ్ వేగంగా వెళ్ళి ఫ్రిజ్ తెరిచి రెండు మంచినీళ్ళ సీసాలతో ఆ గదిలోకి వచ్చాడు.

చల్లటి నీరు తాగగానే వాళ్ళు నోరు తెరిచారు.

"హేమిద్దరం సి.బి.ఐ.కి చెందిన ఏజెంట్స్‌. మమ్మల్ని ఖలీఫా యిక్కడ బంధించి సీక్రెట్ ఏజెన్సీ గురించిన రహస్యాలు చెప్పమని ఒత్తిడిచేస్తున్నాడు" చెప్పారు వాళ్ళు.

"పక్క గదిలో ఎవరైనా వున్నారా?" అడిగాడు కిరణ్ — వాళ్ళు తమకు తెలియదన్నారు.

కిరణ్ వెంటనే వాళ్ళని బంధవిముక్తుల్ని చేసి "నాతో రండి!" అంటూ బయటకు పరుగెత్తాడు.

రెండో గదిని కూడా రివాల్వర్ సాయంతో తెరిచి లోనికడుగు పెట్టాడు. అక్కడ మరో ముగ్గురు అధికారులు బంధింపబడి ఉన్నారు. కిరణ్ వాళ్ళని కూడా విడిపించి వాళ్ళు రక్షణశాఖ సెక్రటేరియట్‌కి సంబంధించిన అధికారులని, వాళ్ళనుంచి కూడా రహస్యాలు సేకరించాలని ఖలీఫా బృందం ప్రయత్నిస్తున్నట్టు తెల్సుకున్నాడు.

కిరణ్ హాల్లో ఉన్న ఆయుధాలని వాళ్ళ అయిదుగురికి ఇచ్చి, ముందుకు కదిలాడు.

అయితే హాల్లో పడిపోయి వున్న ఔట్రరిస్టు ఎప్పుడు స్పృహలోకి వచ్చాడో తెలీదు, రివాల్వర్‌తో వాళ్ళ కెదురుగా నిలిచాడు. అతని రివాల్వర్ నించి గుళ్ళు రిలీజ్ అయ్యేలోపల కిరణ్ చేతిలోని రివాల్వర్ అతని గుండెల్లో గుళ్ళు కక్కింది.

ఔట్రరిస్టు నేల వాలిపోయాడు!

కిరణ్ తనవంత క్రితం బంధించిన గది దగ్గరకు అయిదుగురు ఆఫీసర్లతో వెళ్ళటానికి సిద్ధమయ్యేంతలో మెట్లమీద చప్పుడయ్యింది.

ఖలీఫా, అతని ఇద్దరు అనుచరులు నేలమాళిగలోకి

చొచ్చుకుని వచ్చేస్తున్నారు.

సి.బి.ఐ. ఆఫీసర్లు ఆందోళనగా చూశారు కిరణ్ వంక.

కిరణ్ యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా రివాల్వర్ని చేతిలో ఫర్మ్‌గా పట్టుకొని, ఎలర్టుగా ఉండమని ఆఫీసర్స్‌కి కళ్ళతోనే సందేశమిచ్చాడు.

"హేండ్సప్ మిస్టర్ ఖలీఫా!" అన్నాడు వాళ్ళు ముగ్గురూ ఆఖరి మెట్టు దిగిన వెంటనే, కిరణ్.

ఖలీఫా అతని హెచ్చరికని లక్ష్యపెట్టలేదు. రివాల్వర్ నించి గుళ్ళు రిలీజ్ చెయ్యబోయాడు.

కిరణ్ చేతిలోని రివాల్వర్ గర్జించింది. సి.బి.ఐ. ఆఫీసర్లు కూడా తక్కిన ఇద్దరు టెర్రరిస్టుల్ని గాయపరిచారు.

ఖలీఫాతో బాటు తక్కిన ఇద్దరు చేతులు పైకెత్తి నిల్చుని కిరణ్ వైపు చూస్తున్నారు. ఖలీఫా చూపుల్లో విషం చిందుతోంది.

సరిగ్గా అప్పుడే మెట్లమీద బూట్ల శబ్దం వినిపించింది. ఆ వెను వెంటనే సాయుధులైన పోలీసు సిబ్బంది వేగంగా మెట్లు దిగి నేలమాళిగలోకి అడుగు పెట్టారు. వారిముందు క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్!

"ఇన్‌స్పెక్టర్, అరెస్టు దెమ్!" అన్నాడు కిరణ్.

ఖలీఫాను, అతని ఇద్దరు అనుచరుల్ని బంధించాక, కంప్యూటర్ గదిలో ఉన్న మూడో అనుచరుణ్ని కూడా బంధించారు. నాలుగో టెర్రరిస్టు అప్పటికే చనిపోయాడు.

కిరణ్ ఖలీఫాని సమీపించి అతని నల్లని నిగనిగలాడే గడ్డాన్ని పీకేశాడు!

"చక్రవర్తి!" అన్నారు సి.బి.ఐ. ఆఫీసర్లు విస్మ

యుంగా....చక్రవర్తి రక్షణ శాఖలోని అతి కీలకమైన అధికారి!

"మిస్టర్ చక్రవర్తీ, ఈ తాళాన్ని ఈ రిమోట్ కంట్రోల్ రంధ్రంలో దూరిస్తే ఏమవుతుంది?" అడిగాడు కిరణ్ ఖలీఫా వైపు చూస్తూ.

"ఈ భూగృహమంతా క్షణాల్లో ధ్వంసమైపోతుంది" అన్నాడు ఖలీఫా ఉరఫ్ చక్రవర్తి.

తనా కీని హోల్లో పెట్టకుండా ఏ అదృశ్యశక్తి ఆపిందోగాని, చాలా పెద్ద బ్లాస్టింగ్ తప్పిపోయింది, అనుకున్నాడు కిరణ్ మనసులో.

ఆ తర్వాత—

పోలీసు కమిషనర్, డి.జి.పి, మొదలైన అత్యున్నతాధికారుల సమావేశంలో డిటెక్టివ్ కిరణ్‌కి ఘన సన్మానం జరిగింది.

చక్రవర్తి ఇచ్చిన ఇన్ఫర్మేషన్‌తో నగరంలోను, దేశంలోని వివిధ ప్రాంతాల్లోను టెర్రరిజాన్ని సృష్టిస్తున్న టెర్రరిస్టుల్ని, వారి సపోర్టర్లని సమూలంగా అరెస్టుచేసింది పోలీసుశాఖ. ఖలిస్తాన్ దేశానికి తొత్తులుగా వ్యవహరిస్తున్న స్వదేశీ దేశద్రోహుల్ని సమూలంగా ఏరిపారేసింది భారత ప్రభుత్వం.

—:అయిపోయింది:—

సీరియల్

# రాక్షసహేళ

వాణిశ్రీ

(గత సంచిక తరువాయి)

వారంరోజులపాటు మందుకొడుతూ మత్తులోనే వుండిపోయాడు. కొండ శిఖరంనుంచి అగాధంలోకి దొర్లిపోయినట్లయింది అతని పరిస్థితి.

బావమరది అవతారకృష్ణ యెంతో ఓదార్చాడు. కష్టాలు కలకాలం వుండదన్నాడు. బ్రిడ్జికూలిపోవడం సీరియస్ విషయమైనందున ముఖ్యమంత్రి స్వయంగా జోక్యం చేసుకోవలసి వచ్చిందనీ, ఈ బ్లాక్ లిస్టు తాత్కాలికమైందనీ, దర్యాప్తుచేస్తున్న రిటైర్డు సి.ఐ.ని మేనేజ్ చేద్దామనీ యెన్నో చెప్పాడు.

అయితే చిరంజీవిరావు మానసికంగా క్రుంగిపోయాడు. సంపాదించినదంతా తిరిగి అందులోనే ఇరుక్కుపోయింది. సొసైటీలో ధైర్యంగా తిరగడానికి సిగ్గుగా వుంది. ఇక ఆ టౌన్‌లో పనీపాటా లేకుండా తిని, తిరగాలి. అలా లేజీగా వుండడం అతని తత్వానికి విరుద్ధం.

"జరిగేది యేదో జరిగిపోయింది. ప్రస్తుతానికి నీ కంట్రాక్ట్సులో భాగం ఇవ్వు" అని అడిగాడు చిరంజీవిరావు.

అవతారకృష్ణ నిర్మొహమాటంగా చెప్పాడు.

"వద్దు బావా! లేనిపోని గొడవలు వస్తాయి. బ్లాక్

లిస్టులో ఉన్నవాడిని పార్ట్‌నరుగా చేర్చుకుంటే నా కంపెనీనికూడా బ్లాక్ లిస్టులో చేర్చే ప్రమాదం వుంది. పరిస్థితులు అసలే బాగాలేవు. కావాలంటే డబ్బు ఇస్తాను."

చిరంజీవిరావుకి కోపం ముంచుకొచ్చింది.

బ్రిడ్జి కాంట్రాక్టులో అత తారకృష్ణ పార్ట్‌నర్. సైట్‌లో వుండి కట్టించినవాడూ అతనే. అధికారులతో లాలూచీపడి సిమెంట్ అంతా అమ్ముకున్నదీ వాడే!

ఇప్పుడు తనవరకు వచ్చేసరికి తప్పుకుంటున్నాడు. పేపర్ మీద యెక్కడా అతను పార్ట్‌నర్ అని లేనందున బైటపడ్డాడు. లేకపోతే వీడూ బ్లాక్ లిస్టులో చేరిపోయేవాడే!

నాందేడ్‌లో దివాలాతీసి బికారిలా తిరుగుతూ అప్పులవాళ్ళతో తిన్నులు తింటుంటే, చెల్లెలు రాసిన లెటర్ చూసి కరిగిపోయి ఇక్కడికి తీసుకొచ్చి ఆదరించాడు. ఇంతటి వాడిని చేశాడు. ఇప్పుడు ఆపదలో వున్న తనకు సహాయం చెయ్యడానికి సందేహిస్తున్నాడు.

చిరంజీవిరావుకి అవన్నీ తలపుకి వచ్చి పిచ్చెక్కిపోయింది. ఇద్దరూ మాటా, మాటా అనుకున్నారు. రేపు ఆ దర్యాప్తులో కంట్రాక్టర్ దగ్గర యేదైనా డబ్బు వసూలు చెయ్యాల్సివస్తే నువ్వు సగం ఇవ్వాల్సి వస్తుందని చిరంజీవిరావు హెచ్చరించాడు. నాకేం పట్టిదని అత తారకృష్ణ అన్నాడు. ఇవ్వకపోతే నీ అంతు తేలుస్తాననీ, చంపి పాతిపెడతాననీ చిరంజీవిరావు ప్రతిజ్ఞ చేశాడు.

బావా, బామ్మరుదులు బద్ధ విరోధులయ్యారు.

బహిరంగంగా తిట్టుకోసాగారు.

టౌన్‌లో హైసర్కిల్ వాళ్ళకి ఈ విషయాలన్నీ

తెలిసి నవ్వుతున్నారు.

"కాగల కార్యం గంధర్వులే తీర్చారు అంటారు చూడు అలా జరిగింది" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

విజయ ఆనందపడింది.

# 20

బంగాళాఖాతంలో వాయుగుండం పడింది.

తీరాన్ని దాటింది.

కుండపోతగా వర్షాలు కురుస్తున్నాయి.

పెనుగాలులకు కరెంట్ స్తంభాలు మెలికలు తిరిగి పోయాయి.

జయపూర్ లో కరెంట్ లేదు.

అంధకార బంధురంగా వుంది.

వీధుల్లో నే జనసంచారం లేదు.

అర్థరాత్రి పన్నెండు అయింది.

వాన విసురుగా ముఖానికి కొడుతోంది.

కిరణ్ నల్లటి జర్కిన్ వేసుకున్నాడు. నల్లటోపీ, నల్లటి రెయిన్ బూటు. అతను నడుస్తుంటే చప్పుడు కావడంలేదు. చీకట్లో నీడలా కదిలిపోతున్నాడు.

ఆ సమయంలో అతన్ని యెవరైనా చూసినా దెయ్యం అనుకుని హడిలిపోవాల్సిందే.

నది ప్రక్కనే ఫాతిమా బిల్డింగ్ దగ్గర ఆగాడు. నది ప్రహరీ గోడకు ఆనుకుని ప్రవహిస్తోంది.

ప్రహరీ గోడకు అక్కడక్కడా సిమెంట్ తో పోత పోసిన కిటికీలు బిగించి వున్నాయి. ఆ డిజైన్స్ లోనుంచి లోపల అంతా కనిపిస్తోంది.

వరండాలో అల్సేషన్ కుక్క పడుకుని వుంది.

వర్షం లేకపోతే లోపల అంతా తిరుగుతూ వుండేది.

వాన కురుస్తున్నందువల్ల అది వరండాలోనే వుండిపోవలసి వచ్చింది.

కిరణ్ షర్టు లోపలనుంచి గన్ తీశాడు. అందులో ట్రాంక్విలైజర్ బులెట్స్ వున్నాయి.

కుక్కకి గురిచూసి ట్రిగర్ నొక్కాడు.

సూటిగా తగిలింది.

“భౌ....భౌ....” అంది.

ఎలర్టుగా లేచి నిల్చుంది.

కాని యెంతోసేపు నిలబడలేకపోయింది. మత్తు మందు ప్రభావానికి లొంగి, పడిపోయింది.

కిరణ్ గోడ దూకాడు.

కుక్కని కాళ్ళు పట్టుకుని పైకి ఎత్తాడు. గోడదగ్గర వరకు తీసుకెళ్ళాడు.

గిరగిర తిప్పి బలంగా గోడ అవతలకి విసిరేశాడు.

‘ధబ్’మని శబ్దం వచ్చింది.

‘గుడ్ బై’ అనుకున్నాడు.

కొద్ది క్షణాల్లో కుక్క తుది శ్వాస వీలుస్తుంది నీళ్ళలోనే. నదిలో కళేబరం కొట్టుకుపోయి సముద్రంలో కలుస్తుంది.

కిరణ్ ఒక్కొక్క అడుగే వేసుకుంటూ బిల్డింగ్ చుట్టూ తిరిగాడు. తలుపులన్నీ మూసి వున్నాయి. కిటికీలు క్లోజ్ చేశారు. లోపలకు వెళ్ళడానికి దారి కనిపించడంలేదు.

డాబాపైన ఒక్కటే గది.

అదే అవతారకృష్ణ స్వర్గం.

డ్రైనేజి గొట్టం ఒక్కటే కనిపించింది పైకి వెళ్ళే మార్గం. ప్రహరీగోడ ఎక్కి, గొట్టం పట్టుకుని ఎగ ప్రాకాడు. పైకి చేరుకున్నాడు. కిటికీలు తెరిచివున్నాయి.

షెడ్స్ వుండడంవల్ల యెంత జల్లు పడినా లోపలకు వర్షం పడదు. ఏ.సి.లో అలవాటుపడిన వాళ్ళకి కరెంట్ లేకపోయేసరికి కిటికీలన్నీ తెరిచి పడుకున్నారు.

తొంగి చూశాడు.

లోపల డ్రెస్సింగ్ టేబుల్ మీద బ్లూ కలర్ గ్లాస్ గల చిన్న కిరోసిన్ బెడ్ లాంప్ వెలుగుతోంది.

దోమ తెర లోపల ఫాతిమా, అవతారకృష్ణ నిద్ర పోతున్నారు. నడుము క్రింద భాగం కప్పుకున్నారు. పైన ఆచ్ఛాదనలేదు ఇద్దరికీ. ఆమె గుండెల్లో ముఖం పెట్టుకుని పడుకున్నాడు అతను.

కిరణ్ ఆలోచిస్తున్నాడు.

తలుపు కొడితే 'ఎవరు?' అని అడుగుతారు.

ఏం చెప్పాలి?

'మీ అమ్మాయికి సీరియస్‌గా వుందని చెప్పాలి!'

వాడు షాక్ తిని మరో ఆలోచనలేకుండా తలుపు తెరుస్తాడు. వచ్చినవాడు పైకి ఎలా వచ్చాడనే అనుమానం రాదు.

తలుపు నెట్టాడు.

గమ్మత్తుగా తెరుచుకుంది.

లోపల బోల్టు పెట్టుకోవడం మరిచిపోయారేమో? లేక అలవాటులేదేమో? బైట భయంకరమైన కుక్క కాపలా కాస్తోంది. అడుగుపెడితే ప్రాణాలుతీస్తుందని ధైర్యం అయివుండొచ్చు.

లోపలకు ప్రవేశించి బోల్టు వేశాడు.

బెడ్ దగ్గరకు వెళ్ళి తీక్షణంగా చూశాడు.

ఇద్దరూ గాఢనిద్రలో వున్నారు. వాతావరణం అంత హాయిగా వుంది. సమ్మర్ ఇంకా పూర్తిగా పోకముందే

తుఫాన్ వస్తే ప్రాణానికి తృప్తిగా వుంటుంది.

ఫాతిమా ముఖం అందంగా కనిపిస్తోంది.

ఆమె గుండెలు ఆకర్షణీయంగా వున్నాయి.

కొన్ని క్షణాలు వివశుడై చూస్తూ నిల్చున్నాడు. ఆమెను నగ్నంగా చూస్తే ఎలా వుంటుందో ఊహించు కున్నాడు. పాలరాతి వీనస్ శిల్పంలా వుంటుందనిపించింది.

ఆకాశం గట్టిగా వురిమింది.

అతను ఎలర్టు అయ్యాడు.

దోమతెర పైకి ఎత్తాడు. షర్టులోనుంచి క్లోరోఫాంలో తడిపిన కర్చీఫ్ తీసి ఆమె ముక్కు దగ్గర పెట్టాడు. ఆమె ఊపిరి చేతికి తగుల్తోంది.

ఒక్క నిముషం తర్వాత ఆమె బుగ్గమీద చెయ్యి వేశాడు. భుజం కదిపాడు. చలనంలేదు. మందు పని చేసిందని తెలుసుకున్నాడు.

సోఫాలో కూర్చుని రిలాక్స్ అయ్యాడు.

అవతారకృష్ణ అదృష్టవంతుడు. ఆఖరి రాత్రి గూడా ప్రియురాలి కౌగిలిలో సేదదీరి వస్తున్నాడు.

అతనికి నవ్వొచ్చింది.

వాచీ చూసుకున్నాడు.

ఒంటి గంటకు ఇరవై నిముషాలు తక్కువ.

కిరణ్ లేచి ఫ్రిజ్ తీశాడు. వాటర్ బాటిల్ చల్లగా లేదు మామూలుగా వుంది. కరెంట్ లేదని అప్పుడు గుర్తొచ్చింది. బాటిల్ ఎత్తి మంచినీళ్ళు త్రాగాడు.

అతను మనిషిని యెప్పుడూ చంపలేదు. ఇదే మొదటి సారి. అందుకు మెంటల్‌గా ప్రిపేర్ అవుతున్నాడు.

విజయకోసం తనీ హత్య చేయాల్సి వచ్చింది.

ఇదొక్కటే కాదు. ఇంకా చేస్తాడు గూడా!

ఎన్ని చేసినా చట్టానికి పట్టుబడగూడదు. పోలీసు లకు యేమాత్రం అనుమానం రాకూడదు. అది తన జీవి తాశయం. ఒకరకంగా ఎక్కడ పొరపాటు జరిగినా జీవితం నాశనం.

శత్రువులు చచ్చిన తర్వాత విజయ, తను హాయిగా జీవితాన్ని అనుభవించాలి. తనకు ఆ నమ్మకం వుంది. అందుకు తన చదువు, తెలివితేటలు, అనుభవం పణంగా పెట్టి సాధిస్తాడు.

కిరణ్ లేచి నిల్చున్నాడు.

లాంప్ వత్తి పెద్దది చేశాడు.

గదిలో వెలుతురు ఎక్కువైంది.

బెడ్ దగ్గరికి వెళ్ళాడు. వాళ్ళు కప్పుకున్న దుప్పటి లాగేశాడు. ఇద్దరూ నగ్నంగానే వున్నారు. ఫాతిమా పాలరాతి శిల్పంలాగే వుంది. ఆమె శరీరం కాంతులీనుతూ వుంది. రోజ్ ఫెర్ ఫ్యూమ్ ఆమె ఒంటినుంచి గుభా ళిస్తోంది.

అవతారకృష్ణగూడా కదల్లేదు. బాగా తాగివున్నా డేమో దున్నపోతులా నిద్రపోతున్నాడు. నగ్నంగా, నల్లగా కనిపిస్తున్న అతని శరీరం అసహ్యంగా కనిపిం చింది అతనికి. ఫాతిమా ప్రక్కన వీడు బంగారం ముద్ద దగ్గర బొగ్గు రాయిలా వున్నాడు. ఆమె ఎట్లా భరిస్తోందో వీడిని అనుకున్నాడు. డబ్బు మహిమ అనుకుని సమాధాన పరుచుకున్నాడు.

బూటుతో పొట్టమీద తన్నాడు.

వుహూం... చలనం లేదు అతనిలో.

పొట్టమీద కాలు పెట్టి నొక్కాడు గట్టిగా.

అప్పుడు మూలిగాడు.

"లేరా!....లే...." అన్నాడు కిరణ్.

అతను మెల్లిగా కళ్ళు తెరిచి చూశాడు.

ఎదురుగా నల్లటి డ్రెస్‌లో కనిపిస్తున్న కిరణ్‌ని చూసి భయపడ్డాడు. కళ్ళు నులుముకుని చూశాడు. తను నగ్నంగా వున్న సంగతి గుర్తొచ్చి కంగారుపడ్డాడు.

"ఎవరున్నువ్వు?" అన్నాడు తడారిపోతున్న గొంతుతో.

మంచం దిగబోతుంటే "డోంట్ మూవ్!" అన్నాడు కిరణ్. అతని చేతిలో గన్ గురిపెట్టబడివుంది.

"ఏం కావాలి నీకు?" హీనస్వరంతో అడిగాడు అవతారకృష్ణ.

"నీ ప్రాణం కావాలి."

నవ్వాడు కిరణ్.

"నన్ను చంపకు. నీకు యెంతకావాలంటే అంత డబ్బు ఇస్తాను."

కిరణ్ పకపక నవ్వాడు.

"ఎంత డబ్బుంది నీ దగ్గర?"

"పది లక్షలు వుంది."

"సరిగ్గా చెప్పు!"

"పాతిక లక్షలుంది."

"నో....నిజం చెప్పడంలేదు నువ్వు."

"కోటి ఉంది. కాని అదంతా డబ్బు రూపంలో లేదు. బంగారం, బిల్డింగ్‌లు, భూములు ఉన్నాయి."

"గుడ్ ఇప్పుడు నిజం చెప్పావు."

"చెప్పు నీకెంత కావాలో. నా ప్రాణాలు తియ్యకు. ప్లీజ్" అన్నాడు అవతారకృష్ణ వణికిపోతూ.

"నేను చెప్పినట్లు చెయ్యి."

"చేసా!"

"బెడ్ మీద నుంచి లేచి అక్కడ నేలమీద కూర్చో!"

అవతారకృష్ణ దుప్పటి వంటికి చుట్టుకోబోయాడు.

"నో....అలాగే వెళ్ళాలి. సిగ్గుపడుతున్నావా? ఎందుకు? పుట్టినప్పుడు బట్ట కట్టలేదు, పోయేటప్పుడు అది వెంటరాదు."

"నన్ను చంపుతావా?"

"చెప్పినట్లు చెయ్యి."

"అతను సిగ్గుతో ముంచుకుపోతూ బెడ్ దిగివెళ్ళి నేలమీద నిల్చున్నాడు.

"కూర్చో!" చెప్పాడు కిరణ్.

అతను కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పు. సరిగ్గా ఇరవై ఏళ్ళ క్రితం సంగతి. ఆనందపురంలో నీ ఫ్రెండ్ జమీందారు బ్రహ్మాజీని డబ్బు అడగడానికి వెళ్ళావు. నీ వెంట నీ ఫ్రెండ్స్ ముగ్గురున్నారు. నువ్వు పదిలక్షలు అప్పు అడిగావు. హైదరాబాద్‌లో నువ్వు అప్పుడు స్టీల్ వ్యాపారం చేస్తున్నావు. బ్రహ్మాజీ ఏలూరు వెళ్ళి డబ్బు డ్రాచేసి నీకు ఇచ్చాడు. తిరిగి అంతా ఆనందపురం వస్తున్నారు. అప్పుడు ఏం జరిగింది?"

అవతారకృష్ణ నోరు తెరుచుకుని ఆశ్చర్యంతో వింటున్నాడు. ఎవరు ఇతను? ఇదంతా ఎలా తెలుసు?

కిరణ్ పాంటులోనుంచి కత్తి తీశాడు. పన్నెండు అంగుళాల పొడుగ్గా, తెల్లగా మెరుస్తోంది అది.

"చెప్పు!"

కత్తితో భుజంమీద గీశాడు సన్నగా.

కెవ్వుమన్నాడు అతను. కత్తితో గీసినచోట నెత్తురు కారింది.

"చంపక చెప్తాను."

"ఊఁ.... చెప్పు."

"అదంతా అడవి ప్రాంతం. దారిలో దొంగలు రాళ్లు అడ్డం పెట్టారు. కారు ఆగగానే దాడిచేశారు. బ్రహ్మాజీ చేతిలో ఉంది డబ్బున్న సూట్ కేసు. అది తీసుకో బోయారు. అతని భార్య మెడలో నగలు లాక్కుం టుంటే ఆమె ప్రతిఘటించింది. మేము ఇచ్చేయ్యమని చెపుతున్నా వినలేదు. అప్పుడు దొంగలు వాళ్ళని చంపి డబ్బు, నగలు దోచుకుని అడవిలోకి పారిపోయారు" చెప్పాడు అవతారకృష్ణ.

"ఇదంతా మీరు కల్పించిన కథ, ప్రచారంలో వున్న కథ. నాక్కావలసింది అది కాదు. నిజం కావాలి. చెప్పు"

కిరణ్ రెండో భుజంమీద లోతుగా చీరాడు.

బాధతో మూలిగాడు.

"నేను చెప్పిందంతా నిజమే."

"ఆ సమయంలో బ్రహ్మాజీగారి దివాన్ జోగారావు మీ కారులోనే ఉన్నాడు గుర్తుందా?"

అవతారకృష్ణ నోరు తెరిచాడు.

"ఆయన మా నాన్న! ఆయన నిజం చెప్పి చని పోయాడు తెలిసిందా?"

పకపక నవ్వాడు కిరణ్.

"ఇప్పుడు చెప్పు? ఎవరు ఎంత పంచుకున్నారు?"

"నేను ఐదులక్షలు తీసుకున్నాను. మిగిలిన ముగ్గురు ఐదు లక్షలు పంచుకున్నారు."

"గుడ్. బ్రహ్మాజీని, ఆయన భార్యని చంపినవాళ్ళు ఎవరు?"

"నేను కాదు."

"మరెవరు?"

"కాటిల్యరావు, రాజేంద్రకుమార్, జేమ్స్."

"వాళ్ళెక్కడున్నారు?"

"కాటిల్యరావు హోమ్ మంత్రి. మిగిలినవాళ్ళెక్కడో నాకు తెలియదు.

"అయితే నువ్వు చంపలేదంటావ్?"

"అవును."

"పోనీ వాళ్ళని చంపమని ఐడియా ఇచ్చావా?"

"లేదు. జేమ్స్‌గాడు ఇచ్చాడు."

"సరే ఇప్పుడు చెప్పు! నీకు శిక్ష ఏమి వెయ్యమంటావో? చట్టానికి చేతగాదు అసలు హంతకుల్ని శిక్షించడం. కాబట్టి చట్టాన్ని నా చేతిలోకి తీసుకుని చంపుతున్నాను. తప్పులేదు. భగవద్గీతలో ఏం చెప్పారు?"

"నన్ను చంపితే ఏం వస్తుంది? నేను తీసుకున్న ఐదు లక్షలకు పరిహారంగా పాతిక లక్షలు ఇస్తాను." అవతార కృష్ణ వణికిపోతూ అన్నాడు.

చల్లటి వాతావరణంలో గూడా అతనికి చెమటలు కారుతున్నాయి. చెమట నెత్తురు కలిసి అతని శరీరం మీద పాకుతున్నది.

"దుర్మార్గుడా? స్నేహితుడివని ఆదరించి పదిలక్షలు అప్పు ఇవ్వడానికి సిద్ధపడిన మంచి మనిషిని రాక్షసంగా చంపుతావా? నువ్వు మనిషివి కావు. పిశాచానివి. నీకు ఈ లోకంలో బ్రతికే హక్కులేదు."

కిరణ్ కళ్ళు ఎర్రబడ్డాయి.

గురిచూసి గుండెలోకి కత్తి దించాడు.

అతను గిలగిల కొట్టుకున్నాడు. కబేళాలో తల తెగిన మేకలా తన్నుకున్నాడు. కాసేపటికి అతనిలో చలనం ఆగిపోయింది.

గది అంతా రక్తం చిమ్మింది.

కిరణ్ ఫాతిమా వంక చూశాడు.

ఆమె యే లోకంలో వున్నదో?

మెలకువ వచ్చిన తర్వాత యెంత అవస్థపడుతుందో!

కిరణ్ కత్తి లాగాడు. రక్తం తుడిచాడు.

ఒక్కసారి గదంతా కలయ చూశాడు తను ఏదైనా ఆధారం వదిలి పెడుతున్నానా అని. ఏమీ లేదని నిర్ధారణ చేసుకున్నాక తలుపుతీసి బైటికి వెళ్ళాడు.

పైపు పట్టుకుని దిగాడు. ప్రహారీ గోడ దూకాడు.

నల్ల కోటుతో బాటు, కత్తితో పాటు పెద్దరాయిని పెట్టి మూటలా కట్టాడు. శక్తికొద్దీ విసిరాడు. అది దూరంగా నదిలోకి వెళ్ళి పడింది.

నెమ్మదిగా రోడ్డుమీదకు వచ్చాడు.

కొంత దూరంలో తుమ్మ చెట్టు కింద దాచిన కాన్వాస్ బూటు తొడుక్కుని మళ్ళీ బయల్దేరాడు. నది ఒడ్డునే చాలా దూరం నడిచాడు. డాక్‌సైట్ చేరుకున్నాడు. అక్కడే రేవుల షెడ్‌లో అతని ఆఫీసు. వాచ్‌మాన్ చలికి రగ్గు కప్పుకుని ముసుగు దీసుకుని నిద్రపోతున్నాడు. తను వెళ్ళడం, రావడం వాడు చూళ్ళేదు అని తృప్తి పడ్డాడు.

ఆఫీసు బీరువాలో వున్న మరో నల్లటి జర్కిన్ వేసుకున్నాడు.

"వాచ్ మాన్!...." అని గట్టిగా కేక పెట్టాడు.

అతను ఉలిక్కిపడి లేచాడు.

"సార్!" అన్నాడు నిద్రకళ్ళతోనే.

"కారు షెడ్ తాళంతియ్యి. ఇంటికి పోతాను. వాన తగ్గిందిలే" అన్నాడు కిరణ్.

"సార్!" అని వాచ్ మాన్ షెడ్ తాళం తీశాడు.

కిరణ్ కారులో కూర్చుని బైటకు తెచ్చాడు.

"జాగ్రత్త!...." అన్నాడు.

"టైమెంతయింది సార్?"

"పన్నెండు" అని కారు పోనిచ్చాడు.

ఫియట్ చీకట్లో మూసుకుపోయింది.

## 21

గాలికి బెడ్ లైటు ఆరిపోయింది.

కిరణ్, విజయను గట్టిగా హత్తుకున్నాడు.

"అవతారకృష్ణ అవతారం చాలించాడు విజయా!" ఆమె చెవిలో గుసగుసలాడుతున్నట్లు చెప్పాడు.

"ఐయామ్ వెరీ వెరీ హేపీ...." అని విజయ అతన్ని పాములా పెనవేసుకుంది.

అతనికి స్వర్గంలో తేలిపోతున్నట్లు అనుభూతి కలిగింది. అప్పటివరకు అనుభవించిన టెన్షన్ నుంచి రిలాక్స్ అయ్యాడు.

మర్నాడు ఉదయం కిరణ్ కి మెలకువ వచ్చేసరికి ఎనిమిది దాటింది.

విజయ తల దువ్వుకుంటూ కనిపించింది.

అతను కళ్ళు తెరవడం చూసి నవ్వింది.

"మీ ఫ్రెండ్ ని ఎవరో మర్డర్ చేశారంట" అంది.

"ఎవరూ మా ఫ్రెండ్?" ప్రశ్నించాడు కిరణ్.

"కంట్రాక్టర్ ఫ్రెండ్ అవతారకృష్ణ."

"ఎవరు చెప్పారు?"

"పనిమనిషి."

"మై గాడ్" అని హడావుడిగా లేచి పనిమనిషిని పిలిచాడు.

"దుర్గా....దుర్గా....!"

"ఏంటయ్యగారూ!" అని వచ్చింది పనిమనిషి.

"అవతారకృష్ణని చంపేశారా?"

"అవునయ్యగారూ! అయన్ని ముండింట్లో యెవరో కత్తితో పొడిచేశారంట. ఊరంతా చెప్పుకుంటున్నారు" అంది దుర్గ.

"నువ్వు చూశావా?"

"అమ్మో నాకు భయం" అంది గుండెలమీద చేతులు వేసుకుని.

కిరణ్ ఫోన్ రిసీవర్ ఎత్తి డియస్పీకి రింగ్ చేశాడు.

"డియస్పీ సి.సి. ప్లీజ్."

"నేను కంట్రాక్టర్ కిరణ్‌ని మాట్లాడుతున్నా! డియస్పీగారున్నారా?"

"లేరు సార్! కంట్రాక్టర్ అవతారకృష్ణ మర్డర్ జరిగింది. అంతా అక్కడే వున్నారు. మీకు తెలీదా?"

"ఇప్పుడే తెలిసింది. నిజమేనా అని."

"నిజమే సార్!"

"ఎవరు చేశారు?"

"డిటెయిల్స్ తెలీయదు సార్!"

"థాంక్యూ!" అని రిసీవర్ పెట్టేశాడు.

త్వరగా డ్రెస్ చేసుకుని కారులో ఫాతిమా ఇంటికి బయల్దేరాడు.

దూరంనుంచే జనం ప్రవాహంలా కనిపిస్తున్నారు. ఊళ్ళో జనమంతా అక్కడే వున్నట్లుగా వుంది.

పోలీసు జీపులు, గవర్నమెంట్ వెహికల్స్ కంట్రాక్టర్ల కార్లు అక్కడ బారులు తీరివున్నాయి.

పోలీసులు జనాన్ని అదుపుచెయ్యడానికి కష్టపడుతున్నారు.

పోలీసుల వలయాన్ని దాటుకుని డియస్పీ, ఇంజనీర్లు, కంట్రాక్టర్లు వున్న చోటుకి చేరుకున్నాడు కిరణ్.

డియస్పీ బిజీగా వున్నాడు. పోలీస్ అధికారులతో మంతనాలు సాగిస్తున్నాడు.

కంట్రాక్టర్ సుబ్బిరెడ్డిని అడిగాడు కిరణ్.

"ఎలా జరిగింది?"

అతను పెదవి విరిచాడు.

"ఏమీ అర్థంకావడంలేదు కిరణ్. ఇంత బతుకు బతికి ముండ ఇంట్లో చావడం ఏమిటి? ఛీ....పరువు తక్కువ!" అన్నాడు.

సుబ్బిరెడ్డికి, అవతారకృష్ణకి చుక్కెదురు.

కిరణ్ కామెంట్ చెయ్యలేదు.

"ఎవరు చంపివుంటారు?" ప్రశ్నించాడు కిరణ్.

"ఎక్కడా అనకు. వాళ్ళ బావే చేయించాడని పుకారు పుట్టింది" మెల్లిగా చెవులో అన్నాడు సుబ్బిరెడ్డి

"ఈజిట్! ఐ కాంట్ బిలీవ్. చెల్లెల్ని ముండమోయిస్తాడా ఎవడైనా?" ఆశ్చర్యంగా అన్నాడు కిరణ్.

"బ్రిడ్జి కూలిపోవడంతో చిరంజీవిరావుకి పిచ్చెక్కింది ఏమైనా చేయిస్తాడు. డబ్బు, హోదా దగ్గర చెల్లెలేమిటి? తమ్ముడేమిటి" అన్నాడు సుబ్బిరెడ్డి.

కిరణ్ మరికాస్త ముందుకు వెళ్ళి కంట్రాక్టర్ మునెయ్యకు విష్ చేశాడు.

"ఎలా జరిగింది ఈ ఘోరం?" అడిగాడు కిరణ్.

"ఫాతిమా తమ్ముడే చంపాడని అనుకుంటున్నారు."

"ఎవరు ఫాతిమా అంటే?"

"నువ్వెక్కడున్నావయ్యా మగడా! ఫాతిమా అంటే మన అవతారకృష్ణ ప్రియురాలు."

"ఓహోహో నాకు పేరు తెలియదులెండి."

"వాడికి, వీడికీ యేవో గొడవలయ్యాయట."

"ఇల్లీగల్ కనెక్షన్స్‌తో ఇదే గొడవండి" అన్నాడు కిరణ్.

అవతారకృష్ణ డెడ్ బాడీని పోస్ట్‌మార్టమ్ చెయ్యడానికి అంబులెన్స్‌లో ఎక్కించారు పోలీసులు.

అతని భార్య, కూతురు ఏడుస్తున్నారు వరండాలో.

తర్వాత ఎక్కడి వాళ్ళు అక్కడ చెదిరిపోయారు.

రెండు రోజులు పోయాక క్లబ్‌లో తీరికగా కూర్చున్న డియస్పీ దగ్గరికి చేరాడు కిరణ్.

"కమాన్ మిస్టర్ కిరణ్!" అని ఛైర్ చూపించాడు.

కిరణ్ కూర్చుని "ఏమైనా తెలిసిందా మావాడి మర్డర్ కేసులో" అన్నాడు

"ఇంత కన్‌ఫ్యూజ్‌డు కేసు నాకెక్కడా తగల్లేదు కిరణ్!" తలపట్టుకున్నాడు డియస్పీ.

"ఏం?"

"అతన్ని పొడిచిన వెపన్ దొరకలేదు. గమ్మత్తు ఏమిటంటే ఇరవై నాలుగు గంటలూ కాపలా కాసే అల్సేషన్ కుక్క మాయమైపోయింది. వాడి ముందలేమో! అదే ఫాతిమా! నాకేం తెలీదు మొర్రో అంటుంది.

అతన్ని చంపుకోవాల్సిన ఖర్మ నాకెందుకు? నేనేం కావాలంటే అది తెచ్చి ఇచ్చేవాడు అంటుంది. ఒక రకంగా దాని పాయింట్ కరెక్టే."

"పోలీస్ డాగ్స్‌ని తెప్పించలేదా?" ప్రశ్నించాడు కిరణ్.

"నో యూజ్. తెల్లవార్లూ వాన కురుస్తూనే వుంది. కుక్క ఎక్కడని వాసనపడుతుంది. పాదాల ముద్రలు గూడా చెరిగిపోయాయి."

"ఐ.సీ."

"మరి ఎవరనుకుంటున్నారు? ఎవరికి అవసరం అతన్ని చంపాలని?"

"అదే తీవ్రంగా ఆలోచిస్తున్నాం. లాభం లేనిదే ఎవరూ మర్డర్ చెయ్యరు. లేదా కక్షకట్టి చేస్తాడు."

"యూ ఆర్ సెంట్ పర్సెంట్ కరెక్ట్" అన్నాడు కిరణ్.

"అనుమానం చాలామందిమీద వుంది. ఫాతిమా తమ్ముడు యూసఫ్ అని ఒకడున్నాడు. వాడిని చావ బాదినా నాకేం తెలియదు అంటున్నాడు. హెల్తాఫీసరు తమ్ముడు ఒకడున్నాడు."

"హెల్తు ఆఫీసర్ తమ్ముడా?" కిరణ్ ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

"యస్. వాడు అవతారకృష్ణ కూతుర్ని లౌ చేస్తున్నాడట. అది గొడవైంది. ఒకసారి ఆ కుర్రాడ్ని పార్కులో కొట్టించాడు."

"ఆ మాత్రానికే మర్డర్ చేస్తాడా?"

"ఏముంది కిరణ్! కుర్రాడు. వుడుకు నెత్తురు. పైగా వాళ్ళ కులాలు ఒకటికాదు గూడా. తండ్రిని చంపితే

కూతురు స్వేచ్ఛగా తనను పెళ్ళిచేసుకుంటుందని వెర్రి ఆలోచనతో చేసివుంటాచ్చు. ఏం చెప్పలేం."

కిరణ్ నిట్టూర్చాడు బాధగా.

"ఇంకొక పెద్ద చేపవుంది తెలుసా?"

కిరణ్ ఉలిక్కిపడ్డాడు.

"పెద్ద చెపా?"

"యస్. చిరంజీవిరావు. ఆయన బావగారే" నవ్వాడు డియస్పీ.

"మై గాడ్" అన్నాడు కిరణ్.

"ఇంత న్యూసెన్స్ మర్డర్ కేసు నా సర్వీస్‌లో చూశ్చేదనుకో. మతిపోతోంది. ఎవడ్నీ గట్టిగా అడగ డానికి ఏ ఆధారం దొరకడంలేదు" అసంతృప్తి వ్యక్తం చేశాడు డియస్పీ.

"ఒక గేమ్ టెన్నిస్ ఆడదాం, వస్తారా?" పిలిచాడు కిరణ్.

"పదండి" అని చైర్‌లోనుంచి లేచాడు డియస్పీ.

రెండు నెలలు మెటల్ కాంట్రాక్ట్ చేశాడు కిరణ్. రావలసిన బిల్స్ పాస్ అయ్యాయి. చెక్‌లు అందు కున్నాడు. కొత్తగా వేటికీ టెండర్లు వెయ్యలేదు.

ఆనందపురం వెళ్ళి పదిహేను రోజులు వుండివచ్చారు. విజయ, కిరణ్ హేపిగా వుండడం చూసి భవానీదేవి ఆనందించింది. వాళ్ళవెంట జయపూర్ వచ్చి నెలరోజులు వున్నది.

ఒకరోజు అతనికి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ గోవింద రావుకు ట్రాన్స్‌ఫర్ అయ్యాడని తెలిసి ఇంటికి వెళ్లాడు. పరామర్శలు అయ్యాక కిరణ్ చెప్పాడు.

"సార్! రూల్స్ ప్రకారం మెటల్ తోలుతుంటే

నాకేం మిగులు కనిపించడంలేదు."

గోవిందరాజులు నవ్వాడు.

"ఇండియాలో రూల్ ప్రకారం ఏ వ్యాపారం చేసినా లాభం వుండదు. ఇళ్ళు, వాకిళ్ళు అమ్మి నెత్తిన గుడ్డేసుకుని పోవాలి."

"నాకెందుకో లాలూచీ వ్యవహారాలు నచ్చడంలేదు."

"ఏం చేద్దామనుకుంటున్నావ్?"

"మద్రాసో, హైదరాబాదో వెళ్ళి ఏదైనా ఇండస్ట్రి స్టార్ట్ చేద్దామనుకుంటున్నాను."

"ఐడియా మంచిదే. అక్కడా నీకు ప్రాబ్లమ్స్ తప్పవు."

"లెట్ మీ ట్రై సార్! ఇక్కడ మీరుంటే నాకు ధైర్యంగా వుండేది. మీరూ వెళ్ళిపోతున్నారు."

"నాదే వుందిలే."

"అలా అనకండి మీరు ఇక్కడున్నారనే వచ్చాను. ఈ బిజినెస్‌లో అ, ఆలు నేర్పింది మీరే."

గోవిందరాజులు మొహమాటంగా నవ్వాడు.

"లారీలు అమ్మేదామనుకుంటున్నాను సార్! ఎవరికైనా కావాలంటే చెప్పండి" అన్నాడు కిరణ్.

"అలాగా! సుబ్బిరెడ్డికి అవసరం అన్నాడు. అతనిప్పుడు హైదరాబాద్ నుంచి హైవేకి తెచ్చి నడుపుతున్నాడు! కనుక్కుందాం" అని సుబ్బిరెడ్డికి ఫోన్ చేశాడు.

కాసేపటిలో సుబ్బిరెడ్డి అక్కడికి చేరుకున్నాడు.

డీల్ ఫైనలైజ్ అయింది.

సుబ్బిరెడ్డి చెక్ రాసిచ్చాడు.

కిరణ్ ఆఫీసులో కూర్చుని చాలా రాత్రివరకు

ఎకౌంట్స్ చూశాడు. అన్ని ఖర్చులు పోను లక్ష లాభం మిగిలింది.

'మన క్రెడిట్ లో ఒక మర్డర్, మరొక లక్ష' అనుకుని నవ్వుకున్నాడు.

క్లబ్ లో తనకి రెండు లక్షలు నష్టం వచ్చిందనీ, అందుకే బిజినెస్ మానేసి వెళ్ళిపోతున్నానని కనిపించిన వాళ్ళందరికీ చెప్పాడు.

ఆఖరి రోజున కిరణ్ కి క్లబ్ లో వీడ్కోలు పార్టీ ఇచ్చారు. కిరణ్ వంటి మంచి మిత్రుడు వెళ్ళిపోవడం అందరికీ బాధగా వుందని వక్తలు అభిప్రాయం వ్యక్తం చేశారు డియస్పీతో సహా.

ఆ మర్నాడు కిరణ్ క్లబ్ మెంబర్స్ కి స్కాచ్ విస్కీతో గ్రాండ్ గా డిన్నర్ పార్టీ అరేంజ్ చేశాడు.

మెంబర్స్ అతన్ని ఘనంగా మెచ్చుకున్నారు.

'జయపూర్ కి గుడ్ బై' చెప్పారు కిరణ్, విజయ.

మొదటి రాక్షస సంహారం విజయవంతంగా పూర్తయినందుకు విజయకు అంతులేని ఆనందంగా వుంది.

రెండో రాక్షసుడి వేటకు పథకం తయారు చెయ్యాలి.

## 22

పెదవులకు లిప్ స్టిక్ టచప్ చేసింది. తేనెరంగు కూలింగ్ గ్లాసులు తగిలించింది. జుట్టు వెనక్కి మడిచి కట్టింది. ఇప్పుడామె బాబ్డ్ హెయిర్ కటింగ్ చేసుకున్న అమ్మాయిలా కనిపిస్తోంది.

గులాబీ రంగు పంజాబీ డ్రెస్ ఆమెకు అద్భుతంగా సూటయింది. పల్చటి వల్లెవాటు నిర్లక్ష్యంగా రెండు గుండెల మధ్య కదులుతోంది.

ఆమె పంజాబీ అమ్మాయి కాదంటే ఎవరూ నమ్మరు.

'రెబ్ నాయర్' తిరగేస్తున్న కిరణ్ సడన్ గా ఆమెను చూసి కళ్ళు అరవ్పడం మర్చిపోయిన వాడిలా చూస్తుంటే, విజయ వచ్చి అతని ప్రక్కనే కూర్చుంది.

"ఏమిటా చూపు. దిష్టి తగులుతుంది" అంది అతని ముఖాన్ని తిప్పి.

"నీ మేకప్ అద్భుతంగా వుంది. నువ్వు నువ్వని నేనే నమ్మలేకపోయాననుకో. ఎక్కడ నేర్చుకున్నావు? నాటకాలు వేసేదానివా?" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

"అంత బాగుందా?" అందామె మందహాసం చేస్తూ.

"మార్వలెస్" అంటూ ఆమె ముఖాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

పెదవులకు, పెదవులు కలపబోతుంటే "డోంట్ బీ సిల్లీ. లిప్ స్టిక్ చెరిగిపోతుంది" అంది విజయ.

"ఫర్వాలేదు. మళ్ళీ వేసుకోవచ్చు. ముద్దొచ్చినప్పుడే పెట్టుకోవాలి" అన్నాడు.

విజయ అతన్ని నెట్టి లేచి నిల్చుంది.

"వెళ్ళొస్తాను" అంది హేండ్ బాగ్ తీసుకుని.

"విష్ యూ బెస్టాఫ్ లక్" నవ్వాడు.

విజయ రోడ్డుమీదకు వచ్చింది.

ఆటోలో ఎక్కి కూర్చుని అడ్రెస్ చెప్పింది.

'అడ్వాన్ అడ్వర్ టైజర్స్' ఆఫీసుముందు ఆటో దిగింది. ఆఫీసులోకి వెళ్ళి మేనేజర్ రూమ్‌లోకి వెళ్ళింది.

"వెల్ కమ్ మేడమ్" అన్నాడు మేనేజర్ చిరునవ్వుతో.

విజయ కూర్చుంది. హేండ్ బాగ్ లో నుంచి కవరు తీసింది.

"ఈ ఫోటోలో వున్నది మా అంకుల్. చనిపోయాడు.

పేపర్‌లో వేయించాలని వచ్చాను" అన్నది.

అతను కవరు అందుకుని ఫోటో తీసి చూశాడు.

"ఏ పేపర్లో వేయాలంటారు?"

"అన్ని తెలుగు పేపర్లలో" చెప్పింది విజయ.

అతను ఆశ్చర్యంగా చూశాడు.

"చాలా అవుతుంది మేడమ్."

"నో ప్రాబ్లమ్."

"హైదరాబాద్ ఎడిషన్లో వేస్తే సరిపోతుందా?"

"తెలుగు పేపర్లు ఎన్ని ఎడిషన్ వేస్తారు?"

"కొన్ని హైదరాబాద్, విజయవాడ ఎడిషన్స్ వేస్తారు. మరి కొన్ని హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి ఎడిషన్స్ వేస్తున్నారు."

"ఐ వాంట్ టూ పబ్లిష్ ఇన్ ఆల్ ఎడిషన్స్" చెప్పింది విజయ.

అతను నోరు తెరిచాడు.

"అన్ని తెలుగు పేపర్లలో కూడానా?"

"యస్."

అతను ఆశ్చర్యంనుంచి కోలుకోడానికి కొంచెం సమయం పట్టింది.

"చెప్పండి ఏ సైజ్ వెయ్యమంటారు?"

"ఈ ఫోటో యే సైజ్‌లో వుంది?"

అతను స్కేల్‌తో కొలతలు వేసి "టెన్ బై ట్వెల్వ్ సైజ్ మేడమ్" అన్నాడు.

"అదే సైజ్ వేయించండి."

"అంత సైజ్ అనవసరమేమో మేడమ్?"

"వెయ్యండి, బాగుంటుంది" అందామె.

అతను ఆ చెవక్స్ చూసి కాలిక్యులేటర్ మీద లెక్క వేశాడు.

"చెప్పండి ఎంత మా బిల్?"

అతను చెప్పాడు.

ఆమె హేండ్ బాగ్‌లో నుంచి డబ్బుతీసి ఇచ్చింది.

"మేటర్ చెప్పండి మేడమ్?"

"ఆయన పేరు పశుపతి రాజేంద్రకుమార్."

"బిజినెస్ చెప్పండి."

"చాలా బిజినెస్‌లు వున్నాయి. అవన్నీ అనవసరం. చనిపోయిన డేట్, పుట్టిన రోజు వేయించండి చాలు" అంది విజయ.

"ఈ సంస్మరణ ఎవరు వేయించారని వెయ్యాలి?"

"బంధుమిత్రులు."

"దెన్ ఓ కె" అన్నాడు మేనేజర్.

ఇంటర్‌కమ్‌లో ఎక్కౌంటెంట్‌ని రమ్మని పిలిచాడు.

అతను వచ్చాక డబ్బు అందించి రసీట్ ఇవ్వమన్నాడు.

"మేడమ్ రసీట్ ఎవరి పేరుతో ఇవ్వమంటారు?"

"నా పేరుతో నే. కె.యస్. రాణి" చెప్పింది విజయ.

"ఏ రోజు పేపర్లో రావాలంటారు?"

"ఈ రోజు సోమవారం. శుక్రవారం పేపర్లో వేయించగలరా?"

"నో ప్రాబ్లమ్" చెప్పాడు మేనేజర్.

ఎక్కౌంటెంట్ రసీట్ బుక్ తెచ్చి మేనేజర్ ముందు పెట్టాడు. అతను సంతకం చేసి ఆమెకు అందించాడు.

డాక్టర్ రాజారాంకి నిద్రలేవగానే పేపరు చూడడం అలవాటు. మెయిన్ హెడ్డింగ్ చూస్తాడు. హాట్ హాట్ న్యూస్ చదివేస్తాడు. హాస్పటల్ కి వెళ్ళేలోపల పేపర్ మొత్తం చదవడానికి వీలుండదు. ఉదయం చూడగా మిగిలింది రాత్రికి చదువుతాడు.

అలవాటు ప్రకారం పేపరు చూస్తూ గావుకేక పెట్టాడు.

'పద్మా' అంటూ.

అతని కేకకు భార్య హడలిపోయి ఏం కొంప మునిగిందో అర్థంకాక కిచెన్ లో నుంచి పరుగెత్తుకు వచ్చింది.

చూస్తే ఏమీ కాలేదు భర్త నిక్షేపంగా వున్నాడు.

'హమ్మయ్య' అని గుండెలమీద చెయ్యేసుకుని తేలికగా వూపిరి పీల్చుకుంది.

"ఏమిటి అంత గట్టిగా కేక పెట్టారు? హడలిపోయాను. గుండె ఆగిపోయింది" అంది పద్మావతి.

డాక్టర్ రాజారాం మాట్లాడలేదు. ముఖం నల్లబడిపోయి వుంది. పేపరు అదేపనిగా చూస్తున్నాడు.

భర్త మాట్లాడకపోవడంతో ఆమెకు అనుమానం వచ్చింది. పేపర్లో ఏదో దారుణమైన విషయం చూసి అలా అయిపోయాడనుకుంది. రోజూ ఎన్నో యాక్సిడెంట్లు, రేప్ లు, మర్డర్లు జరుగుతుంటాయి. ఎందరో చస్తుంటారు అందులో ఏం విశేషం ఉంటుంది? ఎవరైనా ఈయన అభిమాన నాయకుడుగాని, సినిమా నటుడుగాని హఠాత్తుగా పోయాడా? అలా పోతే రాత్రి టి.వి.లో న్యూస్ ఐటమ్ లో చూపించేవారే?

పద్మావతి భర్త కేకకు కారణం ఏమైవుంటుందో

ఊహించలేక దగ్గరగా వచ్చింది.

"ఏం జరిగింది?" అంది.

అతను మౌనంగా పేపరు ఆమె చేతికి అందించాడు.

"నాన్నా!"

ఆమె కుప్పలా కూలిపోయింది సోఫాలో. వెక్కి వెక్కి ఏడవసాగింది.

రాజారాం ఆమెను వారించలేదు. కొంత సేపు అలా ఏడిస్తే రిలీఫ్ కలుగుతుంది ఆమెకు.

తర్వాత ఓదార్చాడు.

"చూడు పద్మా! నాకొక విషయం అర్థంకావడం లేదు. మీ నాన్న చనిపోయింది ఆదివారం ఈ రోజు శుక్రవారం. ఆరు రోజుల తరువాత సంస్మరణ వెయ్యడం తర్వాతే మనం చూశాం. ఇప్పటివరకు ఆయన చనిపోయినట్లు మనకు టెలిగ్రామ్ గాని, ఫోన్ గాని లేదు. అందులోను నువ్వు పెద్ద కూతురివి. ఎందుకు ఫోన్ చేసి తెలియ చేయలేదంటావ్?" అన్నాడు.

పద్మావతి ఏడుస్తూనే అన్నది. "ఇదంతా మామయ్య కుట్ర."

"ఎవరూ?" ఆశ్చర్యపోయాడు.

"దశరథ్ మామయ్య!"

"ఏం? ఆయనెందుకు కుట్ర చేస్తాడు?" రాజారాంకి ఏమీ అర్థంకాలేదు.

"ఎందుకేమిటండీ? నాన్నకి మగపిల్లలు లేరు కదా! ఆస్తి మొత్తం కాజెయ్యాలని కుట్రపన్నుతున్నాడు. మనల్ని దూరంగా వుంచుతున్నాడు. దుర్మార్గుడండీ వాడు. ఎంత దారుణం కాకపోతే! తండ్రి చనిపోతే పిల్లలకు తెలియపరచకుండా దహనం చేస్తాడా?"

పద్మావతి ఏడుస్తూనే మేనమామను నోటికొచ్చినట్లు తిడుతోంది.

రాజారాంకి అసలు సంగతి ఏమీ అర్థంకావడంలేదు.

ఆస్తి సంగతి తర్వాత.

ముందు కర్రెసీ నేకే పిల్లలకి తెలియబరచి, పిలిపించాలి గదా! లేకపోతే లోకం ఆడిపోసుకోదూ?

అదేమాట భార్యతో అన్నాడు.

పద్మావతి విసుచుక పడింది.

"దీన్నిబట్టి వాడి వక్రట తెలియడంలేదా? మనల్ని పిలిపిస్తే ఆస్తి గురించి అరాతీస్తామని వాడి భయం. ఈ పాటికి వాడు విల్లు రాయించుకుని వుంటాడు. అంతా రాశేసి వుంటాడు."

"పోతే పోనియ్యి వెధవ ఆస్తి దాన్ని గురించి బాధ లేదు. కడసారి చూపులు దక్కనియ్యకుండా ఎందుక చేశాడా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు రాజారాం.

పద్మావతికి కాలు చెయ్యి ఆడడంలేదు.

రాజారాం అన్నాడు.

"ఈ ఫోటో చూశావా? ఏపీ దొరకనట్లు ఎప్పటిదో ఇరవై ఏళ్ళనాటిది వుంటుంది. దాన్ని వేయించాడు. నేను మొదట చూసి ఎవరోలే అనుకున్నాను."

"మా నాన్నను చివరి చూపులు దక్కకుండా చేశాడు. వాడు నాశనమైపోతాడు. కుక్క చావు చస్తాడు. మనిషిని పంపించినా గుంటూరు ఎంతసేపట్లో వస్తాడు? సర్కార్ ఎక్కితే తెల్లవారేలోగా దిగేవాడు" పద్మావతి ఏడుస్తూనే అంది.

"పూరుకో పద్మా! అయిపోయిందానికి ఏంచేస్తాం. ఇప్పుడేం చెయ్యాలో తోచడంలేదు. చెప్పు ఏం చేద్దాం?

మద్రాస్ వెళ్దామా?" అడిగాడు రాజారాం.

"మా చెల్లెలికయినా కబురు చేశారో లేదో? అది వెళ్ళిందో లేదో? నాకేం తోచడంలేదండీ. మీరే యేదైనా చెయ్యండి."

"దగ్గర్లో గుంటూర్లో వున్న నీకే కబురు చెయ్యక పోతే ఎక్కడో ఢిల్లీలో వున్న మీ చెల్లెల్ని పిలిపిస్తా రంటావా?" అన్నాడు రాజారావు.

పద్మావతి ఏడుస్తూనే వుంది.

రాజారాం లేచి "మనం వెళ్తేనే బాగుంటుంది పద్మా! నువ్వు లేచి బట్టలు సర్దుకో. డ్రైవర్‌కి కబురు పెడతాను" అన్నాడు.

## 24

స్రవంతి డ్రెస్సింగ్ చేసుకుంటూ వుండగా కాలింగ్ బెల్ మ్రోగింది. ఆమె అల్లుకుంటున్న జడ వెనక్కి నెట్టి ఆదుర్దాగా తలుపు దగ్గరికెళ్ళింది. రెండు రోజుల తర్వాత డ్యూటీ నుంచి తిరిగివస్తున్నాడు శివరాం. తనని చూస్తూనే అల్లుకుపోతాడు. చేసుకున్న అలంకరణ అంతా వృధా. మళ్ళీ మొదలు పెట్టాల్సిందే.

స్రవంతి హృదయం వుప్పొంగింది శివరాంని తలుచుకోగానే.

తలుపుతీసి చూస్తే నిరాశ కలిగింది.

వచ్చింది శివరాం కాదు. మిసెస్ సురేష్‌కుమార్.

"హాయ్! స్రవంతీ!"

"హాయ్!"

"ఇంకా తయారుకాలేదా?" అంది ఆమె.

"అవుతూ వున్నాను. శివరాం వస్తాడేమోనని ఎదురు చూస్తున్నాను. డ్యూటీ దిగివుంటాడు ఈపాటికి."

"మిసెస్ బెనర్జీ ఎదురుచూస్తూ వుంటుందేమో? ముందుగా రమ్మని మరీ మరీ చెప్పింది."

"పార్టీ ఎప్పుడో ఈవెనింగ్ గదా! ఇప్పుడు ఇంకా లెవెన్ కాలేదు."

"మనం క్లోజ్ గా మూవ్ అయ్యేవాళ్ళం గూడా గెస్టుల్లాగా ఈవెనింగ్ వెళ్తే బాగుంటుందా? మనకి లంచ్ గూడా అక్కడే ఎరేంజ్ చేస్తున్నానని మరీ మరీ చెప్పింది."

మిసెస్ సురేష్‌కుమార్ చెప్పే మాటలు పరధ్యానంగా వింటూ వుంది స్రవంతి.

ఏ క్షణంలోనయినా శివరాం వస్తాడని ఆమె నమ్మకం.

హాల్లో వున్న ఫోన్ మ్రోగింది.

స్రవంతి మిర్రర్ ముందునుంచి కదల్లేదు.

మిసెస్ సురేష్‌కుమార్ వెళ్ళి రిసీవర్ ఎత్తింది.

"హాలో....హూ ఈజ్ స్పీకింగ్ ప్లీజ్."

"సుచిత్రా బెనర్జీ. ఐ వాంట్ స్రవంతి. మే ఐ నో యువర్ గుడ్ నేమ్ ప్లీజ్."

"నేనే మిసెస్ సురేష్‌కుమార్."

"అక్కడేం చేస్తున్నావు? ఇక్కడ బోర్ కొట్టి చస్తున్నాను. స్రవంతి, నువ్వూ వెంటనే రండి."

"అలాగే.....అలాగే.....! నాదేం ఆలస్యం లేదే బాబూ! స్రవంతి డ్రెసప్ అవుతోంది. మిష్టర్ శివరాం వస్తాడేమోనని ఎదురుచూస్తోంది."

"ఎవరే?" అని కేక పెట్టింది స్రవంతి.

"ఇంకెవరు? సుచిత్ర! ఇంకా రాలేదేమని కంగారు

పడుతోంది" చెప్పింది మిసెస్ సురేష్‌కుమార్.

"దానికి చాద సంతాకపోతే ఎప్పుడో ఈవెనింగ్ జరిగే పార్టీకి ఇప్పుడే రమ్మని మనల్ని చంపడం దేనికి?"

"లేక లేక కొడుకు పుట్టాడు మరి. పార్టీ హాల్లో ఎరేంజ్‌మెంట్స్ గ్రాండ్‌గా డెకొరేషన్ చేయించాలా లేదా?"

"అదంతా మనం చేసేదే వుంది?"

"కర్రిపెత్తనం."

ఇద్దరూ మాట్లాడుకుంటూ ఉండగా మళ్ళీ టెలిఫోన్ రింగైంది.

"చూడవే బాబూ! మళ్ళీ ఫోన్ చేసిందేమో?" అంది స్రవంతి నవ్వుతూ.

మిర్రర్‌లో తన ప్రతిబింబాన్ని తనివితీరా చూసుకుంటోంది. స్రవంతి చామన ఛాయలో వుంటుంది. ఢిల్లీలో ఆమె ఫ్రెండ్స్ అంతా మంచి రంగులో మిసమిసలాడుతూ ఉంటారు. తను చిలకల్లో కాకిలా ఉంటానేమో అనే ఇన్‌ఫీరియారిటీ లోలోపల బాధిస్తుంటుంది. అందుకే ఆమె మేకప్ మీద ప్రత్యేక శ్రద్ధ చూపిస్తుంది. రెగ్యులర్‌గా బ్యూటీ క్లినిక్‌కి హాజరవుతుంది. ఆకర్షణీయంగా తయారవడంవల్ల ఆమె రంగు, అందం మరుగున పడిపోతాయని ఆమె నమ్మకం.

"హాల్లో.... స్రవంతీ?"

"నో మేడమ్ ఐయామ్ మిసెస్ సురేష్‌కుమార్."

"స్రవంతి లేదా?"

"వుంది. మీరెవరు?"

"నేను స్రవంతి సిస్టర్ని, పద్మావతిని మాట్లాడుతున్నాను గుంటూరు నుంచి."

"ఏమే! మీ సిస్టరి మాట్లాడుతుంది. త్వరగా రా!"

"మా సిస్టరా?" నివ్వెరపోయింది స్రవంతి.

"అవునే. పద్మావతి అట. గుంటూరు నుంచి."

స్రవంతి పరుగుతీసింది.

"హల్లో! అక్కా! నేను స్ర వం తి ని మాట్లాడుతున్నాను."

"స్రవంతీ! నేను పద్మని మాట్లాడుతున్నానే."

"గుంటూరు నుంచేనా?"

"అవునే. కొంప మునిగిపోయిందే" పద్మావతి ఏడుపు వినిపించింది. మాటలు ఆగిపోయాయి.

స్రవంతి గుండె ఆగిపోయినట్లయ్యింది.

ముఖాం చెమటలు పట్టింది.

"ఏం జరిగిందే అక్కా!"

"నాన్న చచ్చిపోయాడే!" పద్మావతి గొంతు బొంగురుగా వినిపించింది.

"వాట్?" స్రవంతి గట్టిగా కేక పెట్టింది.

"అవునే!"

"ఎప్పుడు?"

"ఆదివారం."

"ఆదివారమా?...." స్రవంతి బిత్తరపోయింది.

"అవునే మావయ్య మనల్ని మోసం చేశాడు."

"ఏమిటక్కా! నువ్వు చెప్పేది నాకేం అర్థం కావడం లేదు. ఆదివారం నాన్న చనిపోవడం ఏమిటి? మావయ్య మోసం చెయ్యడం ఏమిటి? ఈ రోజు శుక్రవారం తెలుసా?"

"అదేనే నేను చెప్పేది. ఆదివారం నాన్న చని

పోయాడు. మావయ్య మనకి తెలియజెయ్యలేదు. ఈ రోజు పేపర్లో సంస్మరణ అని నాన్న ఫోటో వేస్తే చూశాము. నువ్వు పేపరు చూళ్ళేదా?"

"లేదు. ఇక్కడ తెలుగు పేపరు దొరకదు."

"సరే! మీరు అట్నుంచి అటు మద్రాస్ వచ్చెయ్యండి. మేము ఒకగంటలో బయల్దేరుతున్నాం. ఏం? వినబడుతోందా?"

"ఆఁ....ఆఁ....అసలు ఎలా పోయాడు నాన్న?...."

"ఏమో? ఫోన్ చేస్తే నెంబర్ రెస్పాన్స్ లేదన్నారు. వెళ్ళాక అన్నీ తెలుస్తాయి."

స్రవంతి ఏడుపు ఆపుకుంటూ మాట్లాడుతోంది. తర్వాత లైన్ కట్ అయింది. ఆమె రిసీవర్ క్రెడిల్ చేసి వెక్కి వెక్కి ఏడ్చింది. మిసెస్ సురేష్‌కుమార్ సంగతి తెలుసుకుని ఆమెను ఓదార్చింది.

"ఇప్పుడేం చెయ్యాలో! నాకేం తోచడం లేదు." బేలగా అంది స్రవంతి.

అప్పటి వరకు ఎంతో వుత్సాహంగా వున్న స్రవంతి నీరుగారిపోయింది. శక్తిలేనిదానిలా సోఫాలో కూలబడిపోయింది. తండ్రి గుర్తొచ్చి వెక్కి వెక్కి ఏడుస్తోంది. శోకమూర్తిలా కనిపిస్తున్న స్రవంతిని చూసి మిసెస్ సురేష్‌కుమార్‌కి జాలి కలిగింది.

"నేను వెంటనే మద్రాస్ వెళ్ళాలే. శివరాం ఎప్పుడొస్తాడో!" ఆవేదనతో అంది స్రవంతి.

"స్రవంతీ ప్లీజ్ రిలాక్స్. శివరాం వచ్చేస్తుంటాడు. కంగారు పడకు."

"ఎయిర్‌పోర్ట్‌కి ఫోన్ చేసి శివరాం వచ్చేదేమో కనుక్కోవే!" స్రవంతి కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది.

మిసెస్ సురేష్‌కుమార్ ఎయిర్‌పోర్ట్‌కి ఫోన్ చేసింది.

"శివరాం డ్యూటీ దిగి రెండుగంటలు దాటిందటే. ఇంకా రాకపోవడం ఏమిటి?" అంది.

అది విని స్రవంతికి ఆవేదన ఎక్కువైంది. ఎంతకీ ఏడుపు ఆపడంలేదు. గంట దాటింది. స్రవంతి ఏడుపు వింటుంటే బాధగా వుంది. యేడ్చేవాళ్ళు ఎంత బాధ అనుభవిస్తారో, అది వింటున్న సన్నిహితులు ఇంకా యెక్కువ వేదన పొందుతారు.

సుచిత్ర మళ్ళీ ఫోన్ చేసింది. స్రవంతి ఫాదర్ పోయాడని తెలిసి బాధ పడింది. శివరాం వస్తే పార్టీకి రమ్మని స్లిప్ రాసి అక్కడికి వచ్చేయమంది. నలుగురిలో వుంటే స్రవంతికి వూరడింపుగా వుంటుందని చెప్పింది. సుచిత్ర సలహా బాగానే వుందనిపించింది.

స్రవంతిని బ్రతిమాలి బయల్దేరదీసింది. శివరాం దగ్గర డూప్లికేట్ కీ వుంటుంది కాబట్టి ఇబ్బంది లేదు. టీపాయ్ మీద స్లిప్ చూసి హోటల్‌కి తప్పకుండా వస్తాడు అని చెప్పి కన్విన్స్ చేసింది మిసెస్ సురేష్‌కుమార్.

మౌర్య హోటల్ పార్టీ హాల్ బుక్ చేసింది సుచిత్ర కొడుకు బర్త్‌డేకి. రిసెప్షన్ కౌంటర్ దగ్గర నిలబడి వుంది సుచిత్ర. కారు దిగి వస్తున్న స్రవంతికి ఎదురు వెళ్ళింది. సుచిత్రను చూడగానే స్రవంతికి ఏడుపు ఆగలేదు. వాళ్ళిద్దరూ క్లోజ్ ఫ్రెండ్స్.

స్రవంతిని ఓదారుస్తూ సోఫాలో కూర్చోబెట్టింది సుచిత్ర. ఇద్దరూ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఇంతలో మిసెస్ సురేష్‌కుమార్ కారు పార్కు చేసి వచ్చింది.

"శివరాం ఇంకా రాలేదే. ఏం చెయ్యాలో తోచడం

లేదు" అంది స్రవంతి.

"శివరాం వచ్చాడు" అంది మిసెస్ సురేష్‌కుమార్.

స్రవంతి వులిక్కి పడింది.

సుచిత్ర ఆశ్చర్యంగా చూసింది.

"ఎక్కడున్నాడు?" అంది సుచిత్ర.

"నేను కారు పార్క్ చేసుంటే కన్పించాడు టాక్సీలో దిగాడు పోర్టికోలో. ఎవరో ఫ్రెండ్‌తో కలిసి లోపలకు వచ్చాడు. మీరు చూశ్ళేదా?" మిసెస్ సురేష్ కుమార్ ఆశ్చర్యంతో అడిగింది.

"లేదే!" అంది స్రవంతి.

"మీరు చూశ్ళేదు. పోనీ మిమ్మల్ని అతను చూశ్ళేదా?"

"ఏమో?" అంది సుచిత్ర.

మిసెస్ సురేష్‌కుమార్ అయోమయంగా చూసింది.

స్రవంతికి అర్థం కావడం లేదు. డ్యూటీ దిగినవాడు ఇంటికి రాకుండా హోటల్ కి ఎందుకు వచ్చినట్లు? ఆ మాటే ఫ్రెండ్స్‌తో అంది.

"ఫారిన్ నుంచి ఎవరైనా క్లోజ్ ఫ్రెండ్ వచ్చాదేమో! అతనితో పాటు వస్తూ ఇక్కడ దిగి వుంటాడు" అంది సుచిత్ర.

"చూద్దాం. వస్తాడేమో?" అంది మిసెస్ సురేష్ కుమార్.

"ఎక్కడున్నాడో చూడవే ప్లీజ్!" అంది స్రవంతి.

ఇంత పెద్ద హోటల్లో అతను ఏ గదిలో వున్నాడో ఎలా తెలుస్తుంది? ఫారిన్ టూరిస్టులు, బిజినెస్ మాగ్నెట్లు, పొలిటీషియన్స్ ఎందరో వుంటారు. ప్రతి గదికీ ముందు 'DONT DISTURB' అనే కార్డులు తగిలించి

వుంటాయి. మిసెస్ సురేష్‌కుమార్‌కి ఏమీ అర్థం కావడం లేదు.

రిసెప్షన్ కౌంటర్లో అడిగింది ఇప్పుడే లోపలికి వచ్చిన ఇద్దరు ఏరూమ్‌లో వున్నారని వాళ్ళ ఆనవాళ్ళుగూడా చెప్పింది. వాళ్ళు 'టూ నాట్ త్రీ'లో వున్నారని తెలిసింది.

"శివరాం టూ నాట్ త్రీలో వున్నారే" చెప్పింది మిసెస్ సురేష్‌కుమార్.

"ఇంకేం మరి వెళ్ళి విషయం చెబుతాం. వెంటనే మెడ్రాస్ వెళ్ళాలి గదా పాపం" అంది సుచిత్ర.

"వస్తాడు గదా! ఇక్కడే కూర్చుందాం" అంది మిసెస్ సురేష్‌కుమార్.

"ఎప్పటికి వస్తాడో? వెంటనే చెప్పే మంచిది. ఇమీడియట్‌గా ఏదైనా ఫ్లైట్ వుందేమో?" అంది సుచిత్ర.

మిసెస్ సురేష్ ఎందుకు మౌనంగా వుందో ఇద్దరికీ అర్థం కాలేదు. స్రవంతికి మనసు కలుక్కుమంది.

"సర్లేవే నేనే వెళ్ళి చెప్తాను" అంది స్రవంతి సోఫాలో నుంచి లేచి నిలబడి.

"ఎందుకు నీ వెళ్ళి చెప్తావే!" అంది మిసెస్ సురేష్‌కుమార్. ఆమె గొంతులో ఎందుకో కంగారు ధ్వనించింది.

"ముసుగులో గుద్దులాట ఎందుకు? అందరం వెళ్దాం" అంది సుచిత్ర.

"వెళ్ళడం ఎందుకు ఫోన్ చేసి విషయం చెబుదాం. దిగివస్తాడు. సరిపోతుంది." అంది మిసెస్ సురేష్‌కుమార్.

"ఇంతలోకి వెళ్ళి ఫోన్ ఎందుకు? లిఫ్ట్‌లో ఎంత సేపు వెళ్తాం? సెకండ్ ఫ్లోర్‌లోనే వుంది 'టూ నాట్ త్రీ' అంది సుచిత్ర.

ముగ్గురూ లిఫ్ట్ దగ్గరికి వెళ్ళారు.

సెకండ్ ఫ్లోర్ లో దిగారు.

'టూ నాట్ త్రీ' రూమ్ ముందు 'DONT DISTURB' కార్డు కనిపించింది.

మిసెస్ సురేష్ దిక్కులు చూస్తోంది. స్రవంతి ఏమీ తోచని దానిలా వాళ్ళ ముఖాల్లోకి చూసింది. సుచిత్ర తలుపుమీద చెయ్యి వేసింది.

తలుపులు తెరుచుకోగానే శివరాం ముఖం కనిపించింది. తలుపు తట్టిన వాళ్ళని తిట్టాలనుకున్న అతని నోరు అలా ఆశ్చర్యంతో తెరుచుకుపోయింది. అతను మొలకు చుట్టుకున్న టర్కీటవల్ తప్ప శరీరంమీద ఏ ఆచ్ఛాదనా లేదు.

"మీరు....మీరు...." అని తత్తరపడ్డాడు. బిత్తర చూపులు చూశాడు.

సుచిత్ర వెంట అంతా లోపలకు నడిచారు.

బెడ్ మీద వున్న విదేశీ యువతి వాళ్ళని చూసి తన నగ్నశరీరాన్ని కప్పుకోవడానికి బెడ్ షీట్ అందుకుంది.

# 25

రివాల్వింగ్ ఛైర్ లో అసహనంగా కదులుతున్నాడు రాజేంద్రప్రసాద్. ఉదయం ఏడు గంటల నుంచి ఎన్ని ఫోన్ కాల్స్ వస్తున్నాయో లెక్క లేదు ప్రసాద్ ఇండస్ట్రీస్ కి మెడ్రాస్ లో వున్న డిస్ట్రిబ్యూటర్స్, స్టాకిస్టులు, వ్యాపార ప్రముఖులు, ఫ్రెండ్స్ ఫోన్స్ చేసి విసిగిస్తున్నారు. దేశవ్యాప్తంగా వున్న డిస్ట్రిబ్యూటర్స్ ట్రంకాల్స్ చేసి యస్. టి. డి. లోను మాట్లాడుతున్నారు.

'నేను బ్రతికే వున్నాను మొర్రో' అని చెప్తున్నా

నమ్మడం లేదు.

తెల్లవారి రిలీజయిన అన్ని తెలుగు పేపర్లలోను రాజేంద్రప్రసాద్ ఆదివారంనాడు చనిపోయాడని ఫోటోతో సహా బంధుమిత్రుల పేరిట వేసిన ప్రకటన సంచలనం కలిగించింది. రాస్తా చూస్తా ప్రకటనకాదు. పావు పేజీలో ప్రముఖంగా వేశారు. కాదు వేయించారు.

ఎవరు?

వేలు ఖర్చు పెట్టి ప్రకటన వేయించినవారు ఎవరు?

అందువల్ల వాళ్ళకేం లాభం?

రాజేంద్రప్రసాద్ బుర్ర బద్దలై పోతున్నది.

అతనికి భార్యలేదు. ముగ్గురు కూతుర్లు. ఇద్దరికి పెళ్ళయి పోయింది. ఆఖరి అమ్మాయి బి. ఇ. ఎలెక్ట్రానిక్స్ చదువుతోంది. ప్రసాద్ ఇండస్ట్రీస్ తయారుచేసే ఎల క్ట్రానిక్స్‌కి మార్కెట్లో మంచి పేరుంది. ఫ్యాన్స్, కట్టు మిషన్స్, హీటర్స్, మిక్సీలు హాట్ కేక్స్‌లా అమ్ముడవు తున్నాయి. దేశవ్యాప్తంగా డీలర్లున్నారు. విదేశాలకు ఎగుమతులున్నాయి.

తెలిసినంతవరకు శత్రువులుగూడా ఎవరూ లేరు.

తనని అపఖ్యాతి పాలుచెయ్యడానికి ఎవరు చేశారీ పని?

బజ్జర్ నొక్కగానే లోపలకు వచ్చిన అటెండర్ ఖాళీ అయిన గ్లాసులోకి రాయల్ సెల్యూట్ విస్కీ వంపి ఐస్ క్యూబ్స్ వేశాడు. ఖాళీ ప్లేట్లో జీడిపప్పు పోశాడు.

ఫోన్ రింగైంది.

అతను రిసీవర్ ఎత్తి కోపంగా అన్నాడు.

"రీటా! ఎవరితోను మాట్లాడనని చెప్పాను. గుర్తు

లేదా? డోంట్ డిస్టర్బ్ మీ!"

"సరే! ఆంధ్రా హోమ్ మినిస్టర్ ఫోన్ చేశారు. పేపరు ప్రకటన ఫాల్స్ అని చెప్పాను. ఆయన నమ్మడం లేదు. మీతో మాట్లాడాలని పట్టుపడుతున్నారు. మీరు ఆయన బెస్టు ఫ్రెండ్‌నని చెప్తున్నారు" చెప్పింది రీటా.

"వూఁ...."అన్నాడు అయిష్టంగానే.

లైన్‌లోకి వచ్చాడు కౌటిల్యరావు.

"హల్లో! రాజేంద్రప్రసాద్?"

"యస్. స్పీకింగ్."

"నేనురా కౌటిల్యరావుని."

"బాగున్నావా?"

"నా బాగు సరే! పేపర్లో నువ్వు చచ్చిపోయావని వేశారేమిటి? ఎవరు వేశారు? సరదాగా నువ్వే వేయించు కున్నావా?"

"ఏడ్చావ్? ఎవడు వేయించాడో తెలియక నేను చస్తుంటే నేను సరదాగా వేయించుకున్నానంటా వేమిటి?"

"లేకపోతే అంత పెద్ద ఫోటో దబ్బిచ్చి మరీ ఎవరు వేస్తారు? నెహ్రూగారు పోయినప్పుడు గూడా పేప రోళ్ళు అంత పెద్ద ఫోటో వెయ్యలేదు."

"నీ జోక్ సరేగాని బాగా సంపాదిస్తున్నావా?"

"నా ముఖ్య సంపాదన. ఏవూళ్ళో ఎవడు దేన్ని రేప్ చేసినా, ఏపోలీస్‌స్టేషన్‌లో లాకప్ మరణం జరిగినా, ఎక్కడ బందిపోట్లు దోచుకున్నా హోమ్‌మినిస్టర్ రాజీ నామా చెయ్యాలని గొడవ చేస్తుంటారు అపోజిషన్ వాళ్ళు."

"సారకాయలు కోయ్యక. యస్. ఐ.ని వేస్తే

పాతిక వేలు, సి.ఐ.ని ట్రాన్స్‌ఫర్ చేస్తే ఏభై వేలు సంపాదిస్తున్నావనీ పేపరోళ్ళు తెగరాస్తుంటే రామ....రామ అంటావేమిటి?"

"వాళ్ళేం రాసుకుంటే నాకేం. ఏనుగుపోతుంటే కుక్కలు మొరుగుతాయంట. లెక్కచేసేదెవడుగాని నీ బిజినెస్ బాగుందా?"

"బాగానే వుంది."

"ఆ మధ్య మా వాడికి కోయంబత్తూర్ నుంచి ఏదో సంబంధం వుందని చెప్పావు? మళ్ళీ రాలేదేం? ఏమైంది?"

"నేనా? మీవాడికి కోయంబత్తూర్‌లో సంబంధం ఉందన్నానా? భలేవాడివిరా?" ఆశ్చర్యపోయాడు రాజేంద్రప్రసాద్.

"నువ్వు హైదరాబాద్ వచ్చినప్పుడు చెప్పావు గదారా? లాడ్జిలో దిగానన్నావు. సాయంకాలం ఆరింటికి వస్తానన్నావు. మళ్ళీ అడ్రస్ లేవు. నాకూ తీరికలేక తర్వాత ఆ విషయం పట్టించుకోలేదు."

"ఏడ్చినట్టుందిరా? నేను హైదరాబాద్ వచ్చి రెండేళ్ళయింది. ఆ రాజేంద్రప్రసాద్ ఎవడో? నేను మాత్రం కాదు."

"నువ్వుకాక నన్ను ఒరేయ్ అని పిలిచే రాజేంద్రప్రసాద్ ఇంకెవడున్నాడ్రా?"

"ఏమో? నీకే తెలియాలి. హోమ్ మినిష్టర్‌వి గదా! సి.ఐ.డి.లని పంపి ఎంక్వయిరీ చేయించు" నవ్వాడు రాజేంద్రప్రసాద్.

"గమ్మత్తుగా వుందే! అన్నట్టు నీకు తెలుసా? మన వాడు అవతారకృష్ణని ఎవరో మర్డర్ చేశారు?"

"ఊటీకా?"

"అవున్రా! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. నువ్వు హైదరాబాద్ వచ్చినప్పుడు వాడి అడ్రస్ అడిగావు. నేను తెలియదని చెప్పాను."

"అచ్చా! నేను కాదురా బాబూ! వాడెవడో?"

"ఏమో? వాడు వండర్ గా వుంది ఇదంతా!"

"వాడెక్కడున్నాడు? ఎవరు మర్డర్ చేశారు?"

"జైపూర్‌లో డామ్ కడుతున్నారు తెలుసుగా. అక్కడ వీడు కంట్రాక్టరట. అర్ధరాత్రి ముండ ఇంట్లో ఉండగా యెవరో మర్డర్ చేశారట."

"అయ్యయ్యో?"

"పేపర్లో చూసి స్టన్ అయిపోయాను. మన క్లోజ్ ఫ్రెండ్ వాడు. తలొక దిక్కు అయిపోయాం."

"ఇంతకీ ఎవరు మర్డర్ చేశారు వాడిని?"

"ఇంతవరకు తెలియలేదు."

"ఒరేయ్ చాలా షేమ్‌గా వుందిరా వినడానికి. హోమ్ మినిష్టర్‌వి ఆమాత్రం తెలుసుకోలేకపోయావా?"

"భలేవాడివే! పేపర్లో చూసి వెంటనే డి.ఐ.జి.ని పిలిపించి చెప్పాను వెంటనే హంతకుడు ఎవరో పట్టుకోమని. పాపం ఆయనేం చేస్తాడు? ఆ రేంజి డి.ఐ.జి. గట్టిగా చెప్పాడు. స్వయంగా చూడమన్నాడు. యస్పీ గూడా స్పాట్‌కి వెళ్ళి ఎంక్వయిరీ చేశాడు. కేసు చాలా గమ్మత్తుగా వుంది. ఫాతిమా అని వాడి కీప్. దాన్ని అనుమానించడానికి వీల్లేదట. మనవాడు పోషిస్తున్నాడు. అన్నం పెట్టేవాడిని అది ఎందుకు చంపుతుంది? దాని తమ్ముడిని అనుమానిస్తున్నారు. వాడి ఊరుగు లౌ ఎఫైర్‌లో ఒకడిని సస్పెక్ట చేస్తున్నారు. వాళ్ళ బాధ

మీద కూడా అనుమానం ఉందట."

"అయితే ఈ కేసు తేలేది కాదులే" అన్నాడు రాజేంద్రప్రసాద్.

"ఇంతకీ నువ్వు చచ్చిపోయావని పేపర్లో వేయించింది ఎవరట?"

"మా బావమర్ది స్వయంగా తిరుగుతున్నాడు పత్రిక ఆఫీసుల చుట్టూ. కనుక్కొని రాస్తాడు. హైదరాబాద్ లో నువ్వు కూడా ఎంక్వయిరీ చెయ్యి ప్రకటన ఎవరు వేశారో తెలుస్తుంది."

"ఓ. కే."

"ఉంటాను. చూసి చాలా రోజులైంది. మెడ్రాస్ వచ్చినప్పుడు ఇంటికి రా."

"అలాగే. నువ్వు ఇక్కడికి రావడం లేదా?"

"లేదురా! తీరిక ఏది?"

"ఓ. క. గుడ్ బై."

రాజేంద్రప్రసాద్ రిసీవర్ క్రెడిల్ చేసేసరికి ఎదురుగా దశరథ్ కూర్చుని ఉన్నాడు.

"ఏరా! కనుక్కున్నావా?"

"ఆ....ప్రకటన ఇచ్చింది ఎవరో అమ్మాయట బావా!"

"అమ్మాయా?" ఆశ్చర్యపోయాడు.

"క. యస్. రాణి. ఆ అమ్మాయి కూడా పత్రికల ఆఫీసు కొచ్చి ఇవ్వలేదట. అడ్వాన్స్ అడ్వర్ టైజర్స ద్వారా ప్రకటన పంపిందట" చెప్పాడు దశరథ్.

"క. యస్. రాణి ఎవర్రా? నాకెవరూ గుర్తురావడం లేదు. నీకేమైనా జ్ఞాపకం వుందా?"

"లేదు బావా!" అన్నాడు దశరథ్.

"వండర్ ఫుల్ గా వుందే! నేను చచ్చిపోయానని వేలు ఖర్చుపెట్టి ప్రకటన ఎందుకు ఇచ్చినట్లు? వాళ్ళకేం లాభం? అందులోనూ ఆమ్మాయి!"

రాజేంద్రప్రసాద్ మత్తు దిగిపోతున్నట్లుగా వుంది. పీసా ఎత్తి గ్లాసు నింపుకున్నాడు.

ఫోన్ మ్రోగింది.

దశరథ్ రిసీవర్ ఎత్తాడు.

"అలాగా! చెప్తాలే" అని ఫోన్ పెట్టేశాడు.

"గుంటూరునుంచి పద్మ వాళ్ళు వచ్చారట" అన్నాడు దశరథ్.

రాజేంద్రప్రసాద్ కి నవ్వొచ్చింది. తను చచ్చిపోయాడని కూతురు, అల్లుడు వచ్చారన్నమాట.

"ఇప్పుడేం చేద్దాం?" ప్రశ్నించాడు రాజేంద్ర ప్రసాద్.

"కౌంటర్ వేద్దాం పేపర్లో."

"ఏమని నేను బ్రతికే వున్నాననా?" నవ్వాడు.

"అవును."

"వెయ్యకపోతేనేం?"

"ఇలాగే ఫోన్లు. కండోలెన్స్ టెలిగ్రామ్స్ వస్తుంటాయి. చుట్టాలు దిగుతూంటారు" అన్నాడు దశరథ్.

"నేను బ్రతికి వుండగా చచ్చానని పేపరు వాళ్ళు వేసినందుకు పరువు నష్టం దావా వెయ్యొచ్చా?"

"ఎవరి మీద?"

"పేపరు వాళ్ళమీద."

"ఎలా? వాళ్ళేం వార్త కాదుగా వేసింది. ప్రకటన. డబ్బిస్తే వేశారు. దానికి వాళ్ళకేం బాధ్యతవుంటుంది?"

"డబ్బిస్తే మాత్రం బ్రతికి వున్నవాళ్ళు, చచ్చారని

యెలా వేస్తారు?" అన్నాడు రాజేంద్రప్రసాద్.

"వాళ్ళకేం తెలుస్తుంది? ఇలా అని వాళ్ళు వూహించ లేదుగా?" అన్నాడు దశరథ్.

"మన లాయర్ని కన్సల్ట్ చెయ్యి. ఏమంటాడో చూద్దాం" అన్నాడు రాజేంద్రప్రసాద్.

దశరథ్ తల వూపి వెళ్ళిపోయాడు.

ఫోన్ రింగైంది.

"సర్! మీ చిన్నల్లుడు ఎయిర్‌పోర్ట్ నుంచి ఫోన్ చేస్తున్నారు. వారికి కారు పంపాలట" చెప్పింది రీటా.

"వెంటనే పంపండి" చెప్పాడు రాజేంద్రప్రసాద్.

అతను తల వెనక్కి వాల్చి కళ్ళు మూసుకున్నాడు. ఉదయం నుంచి అంతా గమ్మత్తుగా వుంది. థ్రిల్లింగ్‌గా కూడా వుంది. యెవరో అమ్మాయి తను చచ్చిపోయినట్టు ప్రకటన ఇవ్వడం ఏమిటి? ఎన్ని వేలు ఖర్చు పెట్టిందో? ఎవరా కె.యస్. రాణి? తన ఫోటో ఆమెకు ఎక్కడ్నుంచి వచ్చింది? అదీ రీసెంట్ ఫోటో కూడా కాదు. ఏనాటిదో?

అతనికి గమ్మత్తయిన ఆలోచన వచ్చింది. అది సినిమాటిక్‌గా వుంది. తను లోగడ యెవర్నయినా పెళ్ళి చేసుకుంటానని మోసం చేశాడా? ఆమెకు ఆడ పిల్ల పుట్టి ఇలా తనమీద పగ తీర్చుకోబోతున్నదా?

ఆలోచిస్తే అతనికి ఎవరూ గుర్తురాలేదు. పగతీర్చుకోవాలనుకుంటే తనను చంపడానికి ప్రయత్నించాలి గాని, ఇలా చచ్చిపోయాడని ప్రకటన ఇస్తే ఏం లాభం? ఎంత అమాయకురాలు?

తన ఆలోచన సిల్లీగా వుందనిపించింది అతనికి. నవ్వుకున్నాడు తనలో తనే.

'పేపర్లో తన ఫోటో చూసి అమ్మాయి లిద్దరూ ఎంత ఏడ్చారో పాపం?' అనుకునే సరికి అతినిగుండె బాధగా మూలిగింది.

తనని చూడాలని ఆదుర్దాపడుతుంటారు. తను చని పోలేదని తెలిసి చాలా సంతోషపడివుంటారు. తన రాక కోసం యెదురుచూస్తూంటారు. వెంటనే ఇంటికి వెళ్ళాలి, అనుకున్నాడు.

కారు రెడీ చెయ్యమని ఇంటర్‌కమ్‌లో చెప్పాడు.

ఆఖరి పెగ్ గొంతులో పోసుకుని, సీటులోనుంచి లేచి బయల్దేరాడు.

## 26

శుక్రవారం తెలుగు దినపత్రికలలో నేను చని పోయినట్లుగా ఫోటోతో సహా వేసిన ప్రకటన అబద్ధం. నేను నిక్షేపంగా వున్నాను. యెవరో నా విరోధులు నన్ను అపఖ్యాతి పాలుచెయ్య డానికి వేయించిన ప్రకటన అని బంధు మిత్రులం దరికీ ఇందుమూలముగా తెలియజేస్తున్నాను. నేను చనిపోయానని పొరబడి స్వయంగాను, ఫోన్ల ద్వారాను, టెలిగ్రామ్స్ యిచ్చి సంతాపం తెలియ జేసిన మా ఖాతాదార్లకు, బంధు మిత్రులకు కృత జ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఇట్లు,
పశుపతి రాజేంద్రప్రసాద్,
ప్రొప్రయిటర్,
ప్రసాద్ ఇండస్ట్రీస్,
యన్. యన్. కృష్ణన్ సాలై, మద్రాసు.

తెలుగు పత్రికలలో వచ్చిన ప్రకటన చదివి విజయ సంతోషించింది.

"కిరణ్! డబ్బుపోతే పోయింది గాని రాజేంద్ర ప్రసాద్ అడ్రస్ దొరికింది" అంది విజయ.

కిరణ్ నవ్వాడు.

"అనవసరంగా డబ్బు వేస్టు చేశావు విజయా! కాస్త ఆలస్యంగానైనా వాడి అడ్రస్ తెలుసుకునేవాడిని."

"అవతాగకృష్ణ అడ్రస్ తెలుసుకోవడానికి నువ్వు పడ్డ తిప్పలు అప్పుడే మర్చిపోయావు."

"అందులోనే వుంది థ్రిల్."

"థ్రిల్ ఏమో గాని టైమ్ వేస్టు కాకూడదని నా వుద్దేశ్యం. చూశావా ఇరవై నాలుగు గంటల్లో వాడు బైటపడిపోయాడు. లేకపోతే యెలా తెలుసుకునే వాడివి? యెన్ని తిప్పలు పడేవాడివి అనవసరంగా."

"ఆ మాట నిజమే."

"ఇప్పుడిక వాడిని పైకి పంపించడానికి ఏ ప్లాన్ వేస్తావో వెయ్యి చూద్దాం" అంది విజయ.

"బేసిక్ ప్లాన్ ఒక్కటే. పోలీసుల్ని తికమక పెట్టడం. వాడు చచ్చేనాటికి మగ్గురు నలుగురు అనుమానితుల్ని తయారుచెయ్యడం" చెప్పాడు కిరణ్.

"బాగుంది కిరణ్! యెలా వచ్చింది నీకీ ఐడియా?"

"నీ కోసమే నా మనసులో పుట్టుకొచ్చింది."

" కోసమా?"

"యస్ విజయా! చిన్నతనం నుంచి మనం ఒకటిగా పెరిగాం. మనం పెళ్ళిచేసుకుని సుఖంగా వుంటామని యెన్నో కలలు కన్నాం. కాని యెప్పుడో జరిగిన చేదు

నిజం చెప్పి మా నాన్న నీ మనసులో పగ రగిల్చాడు. ఆ జ్వాలల్లో మాడిపోవడానికి సిద్ధపడ్డావు నువ్వు. నేనీ విషయం విన్నప్పుడు షాక్ తిన్నాను. భరించలేకపోయాను. నువ్వు లేకుండా నేను జీవించడం కల్ల అనిపించింది. బ్రతికేది నాలుగు రోజులే అయినా సుఖంగా జీవించాలని అనుకున్నాను. కాని నేరం చేసి బైటపడకుండా వుండడం యెలాగా అని తీవ్రంగా ఆలోచించాను. రోజుల తరబడి మథన పడ్డాను. చివరకు సక్సెస్ అయ్యాను. ఒక రోజు ఈ ఐడియా ఫ్లాష్‌లా మనసులో మెరిసింది" చెప్పాడు కిరణ్.

విజయ అబ్బురంగా చూసింది అతన్ని.

"థాంక్స్ కిరణ్. నువ్వు తోడుగా నిలబట్టి నేనిలా నిశ్చింతగా వున్నాను" అంది విజయ మెచ్చుకోలుగా.

కిరణ్ ఆప్యాయంగా చూశాడు.

"చెప్పు కిరణ్! మద్రాస్ ఎప్పుడు బయల్దేరదాం?"

"నీ ఇష్టం విజయా!"

"ఈ వెనింగ్ ఫ్లైట్‌లో ఖాళీలున్నాయేమో ఎంక్వయిరీ చెయ్యనా?"

"వద్దు విజయా! ట్రైన్‌లో చూడు."

"ఏం? విమానం అంటే భయమా?"

"అది కాదు. అంత అర్జెంట్‌గా వెళ్ళాల్సిన అవసరం ఏముంది? నెమ్మదిగా ట్రైన్‌లో వెళ్దాం. అనవసరంగా డబ్బు దండగ."

"హాయిగా గంటలో వెళ్ళిపోవచ్చు. డబ్బు దండగ ఏవుంది?"

"అవసరం వచ్చినప్పుడు ఎంతయినా ఖర్చుపెట్టు. అనవసరంగా ఒక్క రూపాయిగూడా ఖర్చుపెట్టకూడదు

విజయా! రాత్రికి వెళ్ళే బదులు రేపు ఉదయం చేరుకుంటాం. దానికి వెయ్యిరూపాయలు ఖర్చుపెట్టడం అవసరం కాదా!"

"అబ్బా! అబ్బాయిగారు చాలా పొదుపు నేర్చుకున్నారే?" వ్యంగ్యంగా నవ్వింది విజయ.

"ట్రైన్ పొదుపు, సుఖం కూడా. బెర్తుమీద పడుకుంటే రైలు ఉయ్యాలలా ఊగుతూ హాయిగా నిద్ర పడుతుంది."

"అవును ఉయ్యాల ఊగి యెన్నాళ్ళో అయింది కదూ!"

"ఎప్పుడో అట్లతద్దినాడు ఊగినట్లు గుర్తు" నవ్వాడు కిరణ్.

"త్వరగా డ్రెస్ చేసుకో. సికింద్రాబాద్ వెళ్దాం."

"ఎందుకు?!

"ఎందుకేమిటి? రిజర్వేషన్ కోసం. లేకపోతే జనరల్ కంపార్టుమెంట్లో వెళ్దామా?"

"నేను రెడీ" అన్నాడు కిరణ్.

విజయ అతని రెక్కపట్టుకుని సోఫాలో నుంచి లేవదీసింది. మర్నాడు ఉదయం మద్రాస్ చేరుకున్నారు. టి.నగర్ గిరి రోడ్‌లో విజయ వాళ్ళకి రెండంతస్తుల బిల్డింగ్ వుంది. వెయ్యిగజాల ప్లాట్ చుట్టూ ప్రహారీ గోడ మధ్యలో బిల్డింగ్. మామిడి, నిమ్మ, నారింజచెట్లు, రకరకాల పూల మొక్కలతో పచ్చగా ఉంటుంది. విజయ వాళ్ళ తాతగారు కట్టించారు. భవానీ నిలయం అని పేరు కనిపిస్తూ ఉంటుంది. ఎందరు అద్దెకు అడిగినా భవానీదేవి ఒప్పుకోలేదు. ఔట్ హౌస్‌లో తిమ్మయ్య ఉంటున్నాడు. అతనే ఆ ఇంటికి వాచ్‌మాన్, తోట

మాలి కూడా.

పదిగంటలకు కిరణ్ తయారైపోయాడు. తెల్లటి బట్టల్లో వాషింగ్ సోప్ అడ్వర్టైజ్‌మెంట్ మోడల్‌లా కనిపిస్తున్నాడు. అతని చేతిలో బ్లూ కలర్ ఫైలుంది. అందులో అతని డిగ్రీ సర్టిఫికెట్లు, యన్.సి.సి., స్పోర్ట్స్ సర్టిఫికెట్సు వగైరా వున్నాయి.

విజయ బాత్‌రూమ్‌లో నుంచి వచ్చి అతను రెడీ అయిపోవడం చూసి కొంచెం ఆశ్చర్యపోయింది.

"కిరణ్! అప్పుడే ఎక్కడికి?"

"వేటకి."

"ఏ వేట?"

"మద్రాస్ మహానగరంలో ఎలా బ్రతకాలి మేడమ్! ఏదో ఒక నౌకరీ వెతుక్కోవద్దూ! ఒంటరి వాడిని కూడా కాదు."

"జోక్స్ తర్వాత."

"జోక్ కాదు నిజం. కావాలంటే ఇదుగో ఫైల్ చూడు."

ఫైల్ విజయకు అందించాడు.

విజయ ఫైల్ తిరగేసి తిరిగి ఇచ్చేసింది.

"ఇక్కడెవరున్నారు మీ తాత నౌకరీ ఇవ్వడానికి?"

"వెతకడానికేగా బయల్దేరింది."

"ఎలా వెళ్తావ్? స్కూటర్ కూడా తెచ్చుకోలేదుగా?"

"నిరుద్యోగి స్కూటర్ మీద తిరిగితే ఉద్యోగం యెవరిస్తారు?"

"అయితే"

"బస్సే గతి."

విజయ నవ్వింది.

కిరణ్ ఫైల్ చేత్తో పట్టుకుని బయల్దేరాడు. గిరి రోడ్ కి ఒకవైపు పాండీబజార్, రెండోవైపు రాఘవయ్య రోడ్డు వున్నాయి. ప్రసాద్ ఇండస్ట్రీకి వెళ్ళడానికి దారి విజయను అడిగి తెలుసుకున్నాడు. పాండీబజార్లో బస్ స్టాప్ దగ్గర నిల్చున్నాడు. పన్నెండు 'బి' ఎక్కి రామ్ థియేటర్ దగ్గర దిగాలి. అక్కడికి దగ్గర్లోనే ఉంటుంది ప్రసాద్ ఇండస్ట్రీస్.

పదిగంటలకు ఫుల్ రష్‌గా వుంటాయి సిటీబస్‌లు. పన్నెండు 'బి మరీను. వస్తున్నాయి, పోతున్నాయి. క్రిక్కిరిసిన పాసింజర్స్‌తో పోతున్న బస్సులు చూస్తూ నిల్చున్నాడు. అరగంట గడిచింది. ఎంతసేపు నిల్చున్నా తనకోసం బస్సులు ఖాళీగా రావని అర్థమైంది. ఒక బస్ రాగానే ఎక్కాడు. లోపల ఉక్కపోత. కండక్టర్ బస్ మధ్యలో జనం మధ్య చిక్కుకుపోయాడు.

'మున్నాడీ పాంగో'

'మున్నాడీ పాంగో'

కేకలు పెడుతున్నాడు. ఎవరూ వినిపించుకోవడం లేదు. అతనికి బి.పి. రెయిజైపోయి అరుస్తున్నాడు. రామ్ థియేటర్ వచ్చేవరకు కిరణ్‌కి టిక్కెట్ తీసుకోవడం కుదర్లేదు. బస్ దిగేసి క్రింద నుంచి కండక్టర్ని కేకేసి రూపాయి కాయిన్ చేతిలో పెట్టాడు.

బస్ కదిలింది.

'ఎన్నంగో' అని కండక్టర్ కేకేస్తున్నా వినిపించుకోకుండా ముందుకు సాగాడు కిరణ్.

కోడంబాకంలో మెయిన్ రోడ్డుమీదే వుంది ప్రసాద్ ఇండస్ట్రీస్. బిల్డింగ్ పైన నియాన్ లైటుమీద ఇంగ్లీషు

అక్షరాలు కలిపిరాతలో వున్నాయి. రాత్రిపూట అవి వెలిగితే ప్రకాశవంతంగా కనిపిస్తాయి.

గేటుముందు స్టూలుమీద కూర్చుని వున్నాడు గూర్ఖా వాచ్‌మాన్. కిరణ్ అతన్ని గమనించనట్లు సరాసరి లోపలకు వెళ్ళిపోయాడు. వాచ్‌మాన్ అడ్డు చెప్పలేదు. ఫస్ట్‌క్లాస్ పర్సనాలిటీతో నడుచుకుపోతున్న అతన్ని ఆప డానికి వాచ్‌మాన్‌కి ధైర్యం చాలలేదు ఎందుకో.

ఆఫీసులో ఎవరి పనిలో వాళ్ళున్నారు. కిరణ్‌ని ఎవరూ పట్టించుకోలేదు.

తెల్లటి యూనిఫాంలో వున్న అటెండర్ని అడిగాడు కిరణ్.

"మేనేజర్ గారు ఎక్కడుంటారు?"

అటెండర్ చెప్పాడు.

'వి. వెంకటసుబ్బయ్య, మేనేజర్' అని తలుపుమీద బోర్డు వ్రేలాడుతోంది.

అటెండర్ ద్వారా స్లిప్ మీద తన పేరు రాసి పంపాడు.

కిరణ్, ఎమ్.ఏ.

అటెండర్ తిరిగివచ్చి లోపలకు రమ్మన్నాడు.

"గుడ్ మార్నింగ్ సర్" అన్నాడు కిరణ్.

వెంకటసుబ్బయ్య గుమ్మడికాయలా వున్నాడు. బొద్దుగా ఎర్రటి శరీరం. బట్టతలచుట్టూ తెల్లటి వెంట్రుక లున్నాయి. ముఖానికి విభూతి రేఖలు అడ్డంగావున్నాయి. అరవాయనేమో అనుకున్నాడు.

"ప్లీస్ బీ సీటెడ్" అన్నాడు.

థాంక్స్ చెప్పి కూర్చున్నాడు కిరణ్.

"నా పేరు కిరణ్. ఎమ్.ఏ. ప్యాసయ్యాను. మీ

ఇంకస్ట్రీలో ఎక్కౌంట్స్ వింగ్‌లో యేదైనా జాబ్ దొరుకుతుందేమోనని వచ్చాను" ఇగ్లీషులో చెప్పాడు.

"అబ్బాయ్ నువ్వు తెలుగువాడివేనా?"

"అరే ఎలా తెలుసుకున్నారు?"

"నీ ముఖం చూసి తెలుసుకున్నాలే" చనువుగా అన్నాడు వెంకటసుబ్బయ్య.

"మీరూ తెలుగువారేనా? అడ్డబొట్లు చూసి అరవ వాళ్ళు అనుకున్నాను" అన్నాడు కిరణ్.

"అరవవాళ్ళల్లో కలిసిపోయాం. మా అబ్బాయి పేరు శివరామన్, అమ్మాయి శ్రీవల్లి. ఎక్కడుంటే అక్కడ మిక్సయిపోవాలి."

"మీరు చెప్పింది సెంట్ పర్సెంట్ కరెక్టు."

"ఇప్పుడు చెప్పు? ఏం కావాలన్నావ్ జాబ్ కదూ!"

"అవున్సార్. మనం మనం ఒకటి. మీరెలాగైనా జాబ్ ఇప్పించాలి."

"మాడబ్బాయ్! నువ్వు తెలుగువాడివై పోవడం నీ దురదృష్టం. ఇక్కడ తెలుగువాళ్ళని పనిలో చేర్చుకోరు" చెప్పాడు వెంకటసుబ్బయ్య.

"మీరు తెలుగువాళ్ళే కదా సార్!"

"ఎప్పుడో పాతకాలంలో తీసుకున్నవాళ్ళం కొందరం ఉన్నాంలే."

"అదేంసార్? ఈ కంపెనీ ప్రొప్రయిటర్ అరవ మనిషా?"

"లేదు. తెలుగువాడే."

"నిజంగా!"

"అక్షరాలా! పదహారణాల తెలుగువాడు. పేరు పశుపతి రాజేంద్రప్రసాద్."

"ఇదేం అన్యాయం సార్! తెలుగువాడి కంపెనీలో తెలుగువాడిని పనిలోకి తీసుకోరా?"

"అదంతే. తెలుగువాళ్ళు పోకిల్లారాయుళ్ళు. పని ఇచ్చినా ఎగ్గొట్టి స్టూడియోల చుట్టూ తిరుగుతుంటారు సినిమాల్లో వేషాలకోసం. ఎప్పుడూ సెలవులు పెట్టి కంపెనీకి ఎగనామం పెడుతుంటారు."

"అన్యాయం సార్! అందరూ అలా వుండరు."

"ఇది నా ఉద్దేశ్యంకాదు నాయనా. మా ప్రొప్రయిటర్ ఉవాచ. అందుకే ఈ కంపెనీలో అంతా అరవవాళ్ళు పనిచేస్తున్నారు. వాళ్ళు కష్టజీవులు. పని మీద శ్రద్ధ వున్న వాళ్ళు. తెలిసిందా!"

"మీరు చెప్పింది గుర్రం, గాడిద ఒకటే అన్నట్లుంది."

"ఏం చేస్తాం. మా ప్రొప్రయిటర్‌కి తెలుగువాళ్ళ మీద బాడ్ ఇంప్రెషన్ పడిపోయింది."

"నాకో సందేహం సార్!"

"ఏమిటి నాయనా?"

"మీ ప్రొప్రయిటర్‌కి కూతుళ్ళున్నారా?"

"ముగ్గురూ కూతుళ్ళే. కొడుకులేరు."

"ఎవరికైనా పెళ్ళిళ్ళు అయ్యాయా?"

"ఇద్దరికి పెళ్ళిళ్ళు చేశాడు."

"వాళ్ళ.........ఐ మీన్ అల్లుళ్ళు తెలుగువారేనా? అరవవాళ్ళా?"

"తెలుగువాళ్ళే."

"అంటే అసమర్థులకిచ్చి పెళ్ళిళ్ళు చేశాడన్నమాట."

కిరణ్ మాటలకు వెంకటసుబ్బయ్య గట్టిగా నవ్వాడు.

"భలేవాడివయ్యా!"

"లేకపోతే యేమిటి సార్ మీరు చెప్పేది. తెలుగు వాళ్ళంతా సినిమాపిచ్చోళ్ళు అయినట్టు చెప్తున్నారు"

అటెండర్ లోపలకు వచ్చి ఫైల్స్ ట్రేలో పడేసి పోయాడు.

"చెప్పండి సార్! ఏమైనా వేకన్సీలున్నాయా?" అడిగాడు కిరణ్.

"చూద్దాం. ఇప్పుడు కాస్త బిజీలో ఉన్నాను. రెండు రోజులు ఆగి కనిపించు" అన్నాడు వెంకటసుబ్బయ్య.

"థాంక్యూ వెరీమచ్ సార్!" అన్నాడు కిరణ్ సంతోషంతో.

ఆటో యెక్కి గిరి రోడ్డులో ఇంటికి వెళ్ళిపోయాడు. మళ్ళీ సాయంకాలం దాటిన తర్వాత కోడంబాకం వెళ్ళాడు. ప్రసాద్ ఇండస్ట్రీస్ ఆఫీసు యెదురుగా ఉన్న హోటల్లో కూర్చున్నాడు. ఆరుగంటలకు బైటకు వచ్చాడు వెంకటసుబ్బయ్య. బస్ స్టాప్ వైపు వస్తుంటే కిరణ్ ఆయన్ని అనుసరించాడు.

"గుడ్ ఈవెనింగ్ సార్!"

వెంకటసుబ్బయ్య వెనక్కి తిరిగిచూసి ఆశ్చర్యపోతూ "నువ్వా!" అన్నాడు.

"నేనే సార్! మీతో కాసేపు మాట్లాడాల వచ్చాను."

"జాబ్ విషయమేగా! చూద్దాం."

"ఫరవాలేదు సార్! అలా చోళా హోటల్లో కూర్చుని మాట్లాడుకుందాం. ప్లెజెంట్ గా వుంటుంది."

చోళా హోటల్ పేరు చెప్పగానే వెంకటసుబ్బయ్య ముఖం ప్రసన్నంగా కనిపించింది.

"ఎందుకయ్యా! అంత దూరం. మరీ కాస్ట్లీ హోటల్

గూడాను" అన్నాడు మొహమాటపడుతూ.

"ఫరవాలేదు పదండి" అని కిరణ్ ఆటో పిలిచాడు.

ఆటో ఆగింది.

ఇద్దరూ యెక్కి కూర్చున్నారు.

"చోళా" చెప్పాడు కిరణ్.

## 27

వారం తర్వాత కిరణ్ అసిస్టెంట్ స్టోర్ కీపర్‌గా డెయిలీ వేజెస్ మీద ప్రసాద్ ఇండస్ట్రీస్‌లో జాబ్ సంపాదించాడు. ఆ సందర్భంగా చోళాలో పార్టీ ఇస్తానంటే వెంకటసుబ్బయ్య వద్దన్నాడు. నీకొచ్చే నెల జీతం ఒక పూటలో హారతి కర్పూరమైపోవడం నా కిష్టంలేదు. చీప్ అండ్ బెస్టు హోటల్‌కి వెళ్దాం అని మౌంట్ రోడ్‌లో వున్న గజేంద్రవిలాస్‌కి తీసుకెళ్ళాడు వెంకటసుబ్బయ్య. ఆ హోటల్ యెప్పుడూ రష్‌గా వుంటుంది. ఇడ్లీ, దోసె వంటివే కాకుండా నాన్ వెజ్ బిర్యానీ, చికెన్ సిక్స్టీఫైవ్ వంటివి గూడా దొరుకుతాయి. కావాలనుకున్నవాళ్ళకి గజేంద్రవైన్స్‌నుంచి మందు తెప్పించి ఇస్తారు కస్టమర్స్‌కి.

వెంకటసుబ్బయ్య ఇష్టప్రకారమే అప్పుడప్పుడూ గజేంద్రవిలాస్‌కి ఇద్దరూ వెళ్ళి కాలక్షేపం చెయ్యడం మామూలయింది. త్వరలోనే అతనికి అతి ఇష్టుడై పోయాడు కిరణ్. వెంకటసుబ్బయ్య పేరుకే మేనేజర్ గాని పవర్స్ అన్నీ దశరథ్‌వే. అతను రాజాగారి బామ్మర్ది ఆ కంపెనీలో బిజినెస్ మేనేజర్, ఎగ్జిక్యూటివ్ మేనేజర్, సేల్స్ మేనేజర్ వంటి కేటగిరీలలో వెంకటసుబ్బయ్య ఒకడు. అతను ఎకౌంట్సు సెక్షన్ చూస్తుంటాడు.

రాజేంద్రప్రసాద్, అతని ఇండస్ట్రీ గురించి తెలుసు కున్న విషయాలు యెప్పటికప్పుడు విజయకి చెప్తూ వుంటాడు కిరణ్. నెల రోజుల తర్వాత చాలా సమాచారం చేరింది.

రాజేంద్రప్రసాద్‌కి ముగ్గురు కూతుర్లు. ఇద్దరికి పెళ్ళయింది. మూడో అమ్మాయి బి. ఇ. ఎలక్ట్రానిక్స్ చదువుతోంది. అతని భార్య చనిపోయింది. బావమ్మరిది దశరథ్ తిరుగులేని అధికారం చలాయిస్తూంటాడు. అతనే జనరల్ మేనేజర్.

ప్రసాద్ ఇండస్ట్రీస్ కాకుండా 'ఫిలిప్స్' అనే హోటల్ గూడా వుంది అతనికి. ఒక ఫారినర్ అమ్మే కుంటే కొన్నాడు. క్యాబరే డ్యాన్సులకు నగరంలో 'ఫిలిప్స్'కి మంచి పేరుంది.

అతను డబ్బు దగ్గర చాలా పీనాసితనంగా ప్రవర్తిస్తూంటాడు. భార్య పోయిన తర్వాత అతను డబ్బు గుంజు తారనే కారణంగానే యే ఆడదాన్నీ చేరదీయలేదు. 'ఫిలిప్స్' పుణ్యమా అని అతనికి ఆ అవసరం లేకుండా పోయింది. ఎందరో క్యాబరే డ్యాన్సర్స్ వస్తూ, పోతూ వుంటారు. అతనికి నచ్చిన అమ్మాయితో సరదాగా కాలక్షేపం చేస్తూ డబ్బు ఇవ్వకుండా సుఖాన్ని జుర్రుకుంటాడు. యజమానికి ఆమాత్రం కన్సెషన్ ఇవ్వడానికి యెవరికీ సామాన్యంగా అభ్యంతరం వుండదు. ఆ ఫీల్డ్ అటువంటిది.

రాజేంద్రప్రసాద్‌ని కాటు వెయ్యడం, తప్పించుకోవడం అంత తేలికైన విషయం అని అనిపించడంలేదు కిరణ్‌కి. అయినా కాలమే తన సమస్యకు పరిష్కారం చూపిస్తుందనే నమ్మకంతో వున్నాడు.

ఆ రోజు సాయంకాలం నాలుగున్నరయింది.

కిరణ్ బస్ కోసం రామ్‌థియేటర్ స్టేజి దగ్గర నిల్చున్నాడు. ట్వెల్వ్ 'బి' బస్సులు క్రిక్కిరిసిపోతున్నాయి. రష్‌గా వున్న బస్సుల్లో ప్రయాణం చెయ్యడానికి అలవాటు పడుతున్నా ఇంకా ఇబ్బందిగానే ఫీలవుతున్నాడు మరీ ఫుట్‌బోర్డు మీద నిలబడి పోవడం అతనికి ఇష్టం వుండదు.

"ఒరేయ్ కిరణ్."

కిరణ్ తలెత్తి చూశాడు.

అతడు శ్రీనాథ్. చాలా కాలం తర్వాత కలుసుకున్నామన్న ఆనందం అతనిలో తొణికిసలాడుతోంది.

"ఏరా శ్రీనాథ్! నువ్వా? ఇక్కడ...." కిరణ్‌కి సంతోషంతో మాటలు రావడంలేదు.

ఇద్దరూ విజయవాడ లయోలా కాలేజీలో చదువుకున్నారు. హాస్టల్ రూమ్‌మేట్స్. రెండు సంవత్సరాలు కలిసివున్నారు. తర్వాత శ్రీనాథ్ ఇంజనీరింగు చదవడానికి వరంగల్ వెళ్ళిపోయాడు. కిరణ్ బి. కామ్‌లో చేరాడు. మళ్ళీ ఇప్పుడే కలవడం.

"నువ్వెందుకు వున్నావిక్కడ?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనాథ్.

"ముందు నీ సంగతి చెప్పు?" అన్నాడు కిరణ్.

"ఏ వుంది? ఉద్యోగానికి వేట" అన్నాడు శ్రీనాథ్.

"నేనూ అంతే. ప్రస్తుతానికి చిన్న జాబ్ సంపాదించాను. అదుగో అందులోనే."

ప్రసాద్ ఇండస్ట్రీస్ వైపు చెయ్యెత్తి చూపించాడు.

"సమ్‌థింగ్ ఈజ్ బెటర్ దెన్ నథింగ్" నవ్వాడు శ్రీనాథ్.

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 60/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా గ్యారంటీగా అందుతాయి. ఇంకా రెండేసి నెలల కొకసారి V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

"చాలాకాలం తర్వాత కలుసుకున్నాం. పద మెరీనా బీచ్ కి వెళ్ళి మాట్లాడుకుందాం" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ తల వూపాడు.

ఇద్దరూ ఆటో యెక్కారు.

బీచ్ లో కూర్చుని చాలాసేపు మాట్లాడుకున్నారు. చిన్ననాటి సంగతులు ముచ్చటించుకున్నారు. కిరణ్ తన గురించి అసలు విషయాలు ఏమీ చెప్పలేదు. పెళ్ళయిందని మాత్రం చెప్పాడు.

శ్రీనాథ్ మెకానికల్ ఇంజనీర్. అతని స్వతంత్ర వ్యక్తిత్వంవల్ల యే కంపెనీలోను ఇమడలేకపోతున్నాడు. పోనీ స్వయంగా యేదైనా ఇండస్ట్రీ స్టార్టు చేద్దామన్నా పెట్టుబడిలేదు. ఉమ్మడి కుటుంబంలో అతని చదువు కోసం అయిన ఖర్చు విషయంలో చాలా గొడవలు జరిగాయి. వాటాలు పంచిన తర్వాత పొలం అమ్మేశాడు శ్రీనాథ్. ఇప్పుడు కేవలం స్వశక్తి మీదనే బ్రతకాలి.

"అయితే నువ్వు జాబ్ కి పనికిరావురా!" అన్నాడు కిరణ్ అతను చెప్పిన కథంతా విని.

"నేనూ అదే నిశ్చయానికి వచ్చాను" అన్నాడు శ్రీనాథ్.

"ఈ రోజుల్లో స్ట్రెయిట్ ఫార్వర్డ్ పనికిరాదు. లోకం మోసంతో నిండిపోయింది. మోసగాళ్ళకే రోజులు" అన్నాడు కిరణ్.

"జీవితంమీద విసుగుపుట్టి పోనీ మోసం చేద్దామన్నా వీలుకుదరడంలేదు నాకు" అని నవ్వాడు శ్రీనాథ్.

"నువ్వు ఎజెంటు అయిపోతానంటే, నేనో చిన్న ఉపాయం చెప్తాను. దెబ్బతో పెద్ద ఇండస్ట్రియలిస్టువి

## శ్రీ మహాలక్ష్మి వారి వెరైటీ నవలలు

### మే 25 విడుదల!

1. సౌగంధి యద్దనపూడి సులోచనరాణి 25-00
(డైరెక్టు నవల)
2. ఉపశ్రీ రామాయణం (సరళవచనం) 25-00
3. ఉపశ్రీ భారతం ,, 25-00
4. ఉపశ్రీ సుందరకాండ ,, 12.00
5. పదకేళి 10-00
(100 పజిల్స్—ఆఖరున జవాబులతో)
6. ఉద్యోగపరీక్షలు - విజయరహస్యం 7-50
P.V.K. ప్రసాదరావు
7. కార్యాలయ - వాణిజ్యపదకోశము 12-00
R. వెంకటేశ్వరరావు
8. చైతన్యదీపాలు
ఆదూరి వెంకటసీతారామమూర్తి 20.00
9. మనోరథం ద్విభాష్యం రాజేశ్వరరావు 18.00
(కథలు)

అడ్వాన్సు లేని ఆర్డర్సు అంగీకరింపబడవు.

పోస్టు ఖర్చులు అదనం

ఫోన్ నెం: 63322

### శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్

మ్యూజియం రోడ్, గవర్నరు పేట,

విజయవాడ - 520 002.



అయిపోతావు" చెప్పాడు కిరణ్.

శ్రీనాథ్ ఆశ్చర్యంగా చూశాడు.

"ఏమిట్రా అది? దెబ్బతో జాతకం మారిపోయే ఉపాయం?"

"నీకు ధైర్యం ఉంటే చెప్పు. అంతా నేను చూసు కుంటాను."

"ఏమిటో చెప్పు?"

"వివరాలన్నీ తర్వాత. ఏం లేదు. చిన్న అబద్ధం ఆడితే చాలు. ఆ తర్వాత జరిగేవన్నీ నేను చూసు కుంటాను."

"చిన్న అబద్ధం అయితే ఓ. కే." అన్నాడు శ్రీనాథ్.

"అంతేరా బాబు. నువ్వు మర్డర్స్ చెయ్యనక్కర్లేదు. దోపిడీలు అంతకంటే చెయ్యక్కర్లేదు."

"అయితే సరే!" అన్నాడు శ్రీనాథ్.

"రేపు సాయంకాలం ఆరుగంటలకు చోళా హోటల్ గేటు దగ్గర రెడీగా వుండు" చెప్పాడు కిరణ్.

"ఎందుకు?"

"వెధవ ప్రశ్నలు వెయ్యకు. చూస్తూ వుండు. నేను చెప్పేవాటికి 'తందాన' అంటూ ఉండడమే నీ పని" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ తల ఊపాడు.

మర్నాడు సాయంకాలం కిరణ్ ఆటో దిగేసరికి చోళా హోటల్ దగ్గర రెడీగా నిల్చుని ఉన్నాడు శ్రీనాథ్

కిరణ్‌తో పాటు వెంకటసుబ్బయ్య దిగాడు.

(ఇంకా వుంది)

